శ్రీలేఖ సాహితి ప్రచురణ

# ఏకశిల వైతాళికులు




సంపాదకత్వం :

టి. శ్రీరంగస్వామి



Regd. No. 2337/89




Estd. 1977

ఏ క శి ల

# వై తా ళి కు లు



సంపాదకత్వం :

## టి. శ్రీరంగస్వామి


శ్రీలేఖ సాహితి

5-11-114/4 విద్యారణ్యపురి

వరంగల్లు - 506009

1991

EKASHILA VYTHALIKULU (Essays on contemporary Writers)

Edited by
T. SRI RANGA SWAMY



Publication : 14

First Edition March 1991
ప్రజోత్పత్తి ఉగాది

Price Rs. 30/-

For Copies :

1) VISHALANDHRA BOOK HOUSE
Hyderabad, Hanamakonda, Vijayawada
Anathapoor. Vizag. Tirupathi, Kakinada

2) SRILEKHA SAHITHI
H. No. 5-11-~~1/14/4~~, Vidyaranya puri
Warangal - 506009

3) ANDHRA SARASWATHA PARISHATH
Tilak Road, Hyderabad 500 001

Printed by :
*NATARAJ PRINTERS*
*Kashibugga, Warangal*



# ఈ వైతాళికులను స్పర్శించే ముందు......

ఆధునిక యుగములో తమ వంతు కర్తవ్యముగా సాహితీ సరస్వతికి
కస చేసి, తమ ప్రజ్ఞతో ఎన్నో ఆభరణాలు అలరించిన వారి సాహితీ
వ ఎనలేనిది. అది కొందరికి వైతాళిక గీతం పాడితే మరికొందరికి
ప్రోత్సాహాలను అందచేసి ఉండవచ్చును.

వెనుక తరం సాహితీమాణిక్యాలను వచ్చే తరానికి వదిల పరచాలనే
ుం ఒకటికాగా, ఇప్పుడిప్పుడే సాహితీ వ్యాసంగంనకు శ్రీకారం చుడు
వర్ధమానులలో సాహితీ పిపాసతో పాటుగా వారి రచనా వ్యాసంగానికి
గులు దిద్దాలనే ఆలోచనతో ఏకశిల వైతాళికులు అను శీర్షికతో ప్రతి నెల
ఉపన్యాస పరంపరను ఏర్పాటు చేయడం జరిగింది. ఈ సదస్సుల్లో కేవలం
సంగించకుండా, ఆ వ్యాసాన్ని రాసి తీసుకొని రావలసినదిగా కోరాం. ఈ
గా వచ్చిన వ్యాసాలలో పరిణితి ఉంటుందని, సభలో సూచించిన సూచ
ను అనుసరించి మార్పులు చేర్పులతో పుస్తక రూపంలో మీ ముందుంచు
ం. ఆ ప్రయత్నం ఎంత వరకు సాధించ గలిగాం అన్నది మీకే
పెడుతున్నాం. ఇందులోని వ్యాసాలు ఆయా వైతాళికులను దిఙ్మాత్రంగా
తమే చూపెట్టగలవుకాని, సవివరంగా చూపెట్టలేవు మేము నిబద్ధీకరించిన
ల పరిమితులలో. ఒక్కొక్కరిపై ఒక్కొ సిద్ధాంత గ్రంథంగా వెలువడ
ఉన్నది. మా ఈ ప్రయత్నం ముందుతరం పరిశోధకులకు ఆకరంగా
యోగపడగలదని భావిస్తున్నాం.

ఈ ఉపన్యాస పరంపరను ఆలోచించిన సందర్భములో ఈ క్రింద
ంచిన వారిని మొదటి విడతగా ఎన్నుకోవడం జరిగినది.

పల్లా రామకోటార్య - జనన సంవత్సరం 1911

వానమామలై వరదాచార్యులు - 1912-85

3. కాళోజీ నారాయణరావు – 1914
4. పల్లా దుర్గయ్య – 1916-84
5. వేమలపల్లి రామానుజరావు – 1917
6. పాములపర్తి సదాశివరావు – 1920
7. పొట్లపల్లి రామారావు – 1920
8. అనుముల కృష్ణమూర్తి – 1924
9. చిలుకమర్రి రామానుజాచార్యులు – 1924-67
10. బిరుదురాజు రామరాజు – 1925
11. దాశరథి కృష్ణమాచార్యులు – 1925-88
12. కోవెల సంపత్కుమారాచార్యులు – 1933
13. కోవెల సుప్రసన్నాచార్యులు – 1936
14. పి.వి. రమణ – 1939

శ్రీ వానమామలై గారి గురించి ఉపన్యాసాన్ని అసలే సమర్పించలేదు వక్త. పొట్లపల్లి రామారావు, పి.వి. రమణల గురించి వ్యాసాలు తిరిగి వ్రాస్తామని చెప్పి ఇంతవరకు అందించక పోవడం వలన ఇందులో చేర్చలేకపోయాం.

అంతేకాకుండా ఇందులోని వ్యాసాలన్నీ పైన సూచించిన క్రమంలో లేకపోవడానికి కారణం, వ్యాసాలన్నీ మార్పులచేర్పులతో సకాలంలో రాక పోవడమే. ప్రతి నెల నెలా సమావేశాలు ఏర్పాటు చేయడం ఒక ఎత్తుకాగా ఇలా పుస్తక రూపంలో తేవడం మరొక ఎత్తు అయినది. ఈ వైతాళికులను ఎన్నుకొనడంలో అన్ని ప్రక్రియల నుండి ఏరుకోవడమునకు ప్రయత్నం చేసాం.

ఈ పుస్తకానికి తెలుగు విశ్వవిద్యాలయం వారు రూ. 1500/-లు ఆర్థిక సహాయాన్ని అందించినారు. వారికి మా కృ త జ్ఞ త లు. అంతేకాక ఆర్థికంగాను, హార్దికంగాను తోడ్పడిన మిత్రులకు మా నమోవాకములు.

శ్రీలేఖ సాహితి సాహితీ రంగంలో ఒక క్రొత్త ఒరవడి చూసే ప్రయత్నంలో, ఒక పరిధిలో సల్పిన కృషికి ఇది నిదర్శనం. 'స్నేహం నీడనిచ్చే చెట్టులాంటిది' అన్న మా నానుడిని మరొకమారు సార్థకం చేసి మా ప్రయత్నంనకు అండగా నిలిచిన ఇందులోని వ్యాసకర్తలకు, మిత్రులకు, సహృదయులకు మా అభివందనచందనాలు ...

సదా మీ చేయూతను ఆశిస్తూ-

యస్. శ్రీనివాసస్వామి — అధ్యక్షులు

టి. శ్రీరంగస్వామి — కార్యదర్శి & కన్వీనర్

"శ్రీలేఖ సాహితి"

---

అర్థికంగా నిలిచిన సుహృన్మూర్తులు :-

శ్రీ భూపతి గౌరీశంకర్‌గారు రూ. 500/-

శ్రీ టి. సర్వయ్యలింగంగారు రూ. 251/-
అధ్యక్షులు, వాసవీ గ్రంథాలయం, వరంగల్లు

ప్రకటనకర్తలు, రచయితలు

పుస్తక అక్షరాలంకరణ : శ్రీ ప్రసాదజీగారు

# అభినందన స్పర్శ

ఏకశిల వైతాళికులు వరంగల్ జిల్లాకు చెందిన వర్తమాన కాలంలోని ఏకాదశ కవులను గురించి వెలువడిన సాహిత్య వ్యాస సంపుటి. ఇది ''శ్రీలేఖ సాహితి'' పక్షాన జరిగిన ఉపన్యాస పరంపరకు అక్షరాకృతి. వరంగల్ ప్రాచీన కాలం నుండి సాహిత్య, కళా వ్యాసంగానికి నిలయం, ఇక్కడ సంప్రదాయధోరణులు, ఆధునిక రీతులు రెండూ ఎంతో సమన్వయసుందరంగా సాహిత్యాభిమానుల్ని ఆకర్షిస్తాయి. ఈ సంస్కార సంపన్నమైన ఉత్తమ లక్షణం ఈ సంపుటిలో స్ఫుటంగా కనిపిస్తుంది. సంప్రదాయ నిరతులు, సంప్రదాయ అభిమానులు, అభ్యుదయవాదులు, అభ్యుదయాభిమానులు ఇట్లా సాహిత్య జగత్తులో వివిధ పార్శ్వాల ప్రతిఫలనం ఈ సంకలనం. సహృదయులకు ఎంతో ఆనందాన్ని కలిగిస్తుంది. నిర్వాహకుల ఈ ప్రయత్నం ప్రజాస్వామ్య భావనకు బలాన్ని చేకూరుస్తుంది. ఈనాడు ఈ విధమైన ఆలోచనా ధోరణి ఎంతో అవసరం.

కవుల జీవిత విశేషాలు మొదలుకొని వారి కృతుల సంగ్రహ పరిశీలనంతో సాహిత్య వ్యక్తిత్వాన్ని స్ఫూర్తికి తెస్తోంది. ఈ కృషి ముమ్ముందు తెలుగు సాహిత్య చరిత్రకు, పరిశోధనా వ్యాసంగానికి ఆకరంగా ఉపకరిస్తుంది. శ్రీలేఖ సాహితి చేసే ఈ ప్రయత్నం అభినందనీయమే కాకుండా అభిలషణీయమూ. సంపాదకులు, కార్యశీలి టి. శ్రీరంగస్వామి ప్రయత్నం ఉత్తరోత్తరా సమగ్రమైన కృషికి నాంది కాగలదని ఆశిస్తూ, అభినందిస్తున్నాను.

వరంగల్లు

ఆచార్య మాదిరాజు రంగారావు
కాకతీయ విశ్వవిద్యాలయం

# ఈ వైతాళికుల అనుక్రమణిక








# మా ప్రచురణలు

1. శ్రీరామ శతకము – శ్రీ టి. రామానుజస్వామి రూ. 10-00
2. కవితాగానం – శ్రీమతి టి. ఇందిరా చిరంజీవి రూ. 3-00
3. ద టు జెంటిల్‌మెన్ ఆఫ్ వెరోనా – డా. జి. దామోదర్
   (తెలుగు అనువాదం) రూ. 12-00
4. వేణు తరంగాలు – యల్. వేణుగోపాలరావు రూ. 5-00
5. ప్రభవ (కవితా సంకలనం) – శ్రీ టి. శ్రీరంగస్వామి
   [సంపాదకత్వం] ఒక సహృదయం
   (ప్రతులు అయిపోయినవి)
6. వరంగల్లు జిల్లా రచయితల వాఙ్మయ జీవిత సూచిక
   శ్రీ టి. శ్రీరంగస్వామి రూ. 15-00
7. కవితావనం – శ్రీమతి ఇందిరా చిరంజీవి రూ. 6-00
8. జన్మభూమి సిరులు – పల్లెసీను రూ. 6-00
9. జీవనరాగాలు – శ్రీ యల్. వేణుగోపాలరావు రూ. 10-00
10. ఝల్లు (కవితా సంకలనం) – శ్రీ టి. శ్రీరంగస్వామి
    [సంపాదకత్వం] రూ. 5-00
11. ఎమ్మెస్సార్ కథలు – శ్రీ యం. సుబ్బారావు రూ. 9-00
12. ప్రమోదూత – (కవితా సంకలనం) శ్రీ టి. శ్రీరంగస్వామి
    (సంపాదకత్వం) రూ. 6-00
13. నా మాట (శతకం) – యం. సుబ్బారావు రూ. 3-00
14. ఏకశిల వైతాళికులు (వ్యాస సంకలనం) రూ. 30-00
    శ్రీ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం)
15. శ్రీలేఖ [ప్రజోత్పత్తి కవితా సంకలనం]
    శ్రీ టి. శ్రీరంగస్వామి [సంపాదకత్వం] రూ. 6-00
16. కోవెల సుప్రసన్నాచార్యులు వాఙ్మయ జీవిత సూచిక
    శ్రీ టి. శ్రీరంగస్వామి రూ. 15-00

# దాశరథి

కీ॥ శే॥ దాశరథి కృష్ణమాచార్యులు

జననం 21-7-1925 (క్రోధన శ్రావణశు॥ విదియ)

చిన గూడూరు మహబూబాబాదు

వరంగల్లు

ముద్రితాలు :

అగ్నిధార

పునర్నవం

మహాంధ్రోదయం

తిమిరంతో సమరం

కవితా పుష్పకం

గాలిబు గీతాలు

పల్లె సీసం

పల్లె శ్రీనివాస్
యం. ఏ.
జననం 18-2-1945

నేరేడుపల్లి
మల్లంపల్లి
వరంగల్లు - 506349

ముద్రితాలు :
రాధమ్మ పెళ్ళి (నాటిక)
రుధిరాంకితం (నవల)
జన్మభూమి సిరులు (గేయ కావ్యం)

అముద్రితాలు :-
మాధవ మాధుర్యం (భాగవత పరిశీలన)
అదృశ్య కిరణాలు (నవల)
అతికిన బాంధవ్యం (నవల)

# దాశరథి

మహాకవి దాశరథి అనగానే, "దాశరథి కవితా స్రవంతిని ఎన్ని దోసిళ్ళతో తెస్తారు?" అని ప్రశ్నించినట్లనిపించింది అవును! 'కొండంతలో – ఉండంత అన్నట్లు ఎంతో కొంత సంతరిద్దామనిపించింది.

దాశరథి అంటే........!
వాగిపోయి మాటుమణిగిన
శరత్తులలో సైతం, దర్శనీయ స్థలాలను
రమ్యంగా, రమ్య స్థలాలుగా చిత్రించి చూపిన
థియేటరు లాంటివాడని ...... నా నమ్మకం

అంతేకాదు. నిద్రాణమై వున్న తెలంగాణాను తన కవితల ద్వారా మేలుకొలిపిన వైతాళికుడు శ్రీ దాశరథి. అభ్యుదయ భావలోకంలో వినూత్న సంచలనం సృష్టించిన ఆధునికాంధ్ర కవితాశరధి దాశరథి. నిదురించిన తెలంగాణా సోదరులను మేల్కొలిపి, వారి హృదయ కవాటాల్లోకి వెలుగులు విరజిమ్మి, కోటి గొంతుకలతో మహాంధ్రోదయమైందని ఎలుగెత్తి పిలిచిన మహా కవితా వారధి దాశరథి. తెలంగాణా రైతు జనుల మనోరథాల్ని విప్లవాభ్యుదయ మార్గంలో నడిపించిన కవితా చైతన్య సారథి దాశరథి. ఆయన స్పృశించని సారస్వతాంశం లేదు.

ఈ మహాకవి 1927 క్రోధన నామ సంవత్సర శ్రావణ శుద్ధ విదియ రోజున వరంగల్ జిల్లాలోని మహబూబాబాదు తాలూకా గూడూరు గ్రామంలో జన్మించాడు. ఖమ్మం, హైదరాబాదుల్లో విద్యాభ్యాసం చేశాడు. చిన్న వయస్సు నుండి కవిత్వం సయన సొత్తు. ఆనసంలో, నీరసంలో, ఉద్రేకంలో, ఆవేదనలో, బాధలో, దుఃఖంలో కవిత్వం పుడుతుంది తరుచుగా వీటి తాకిడికి తట్టుకోలేక ఆయనలో ఉప్పొంగిన కవిత్వం, ఆనాటి నిజాం ప్రభుత్వాన్ని రెచ్చ గొట్టి సవాలు చేసింది.త త్ఫలితంగా పోలీసులు వెంటాడటం, తప్పించుకుని అడవుల్లోకి పారి పోవడం లాంటి సంఘటనలు దాశరధిగారి జీవితంలో సాధారణంగా జరిగిపోయాయి. నైజాము నవాబు కాలంలో అనేకమార్లు జైళ్ళకు వెళ్ళాడు. తరతరాల నుండి వదలి పోని బూజును అక్షరాలుకట్టగట్టి దులిపివేసిన సాహసం ఆయనది. నవాబు నిరంకుశత్వం వెర్రితలలు వేసి, భయంకర రాక్షసిగా రూపొందితే, తన కవితా కత్తులు పదునుబెట్టి వృత్తరించ ఉద్యమం తలపెట్టిన కవివీరుడు దాశరధి. ప్రజల్ని హింసించిన ఆయన ప్రతి పాలకుడూ నశించి తీరుతాడనేది ఆయన ప్రగాఢ విశ్వాసం. ఆ విశ్వాసంతోనే కవిత సాగింది. నిజామాబాదు జైల్లో ఆయన ఉన్నప్పుడు ....

ఓ నిజాము పిశాచమా! కానరాడు
నిన్ను బోలిన రాజు మాకెన్నడేని
తీగెలను తెంపి అగ్నిలో దింపినావు
నా తెలంగాణ కోటి రత్నాల వీణ.

అంటూ బొగ్గుతో జైలు గోడలపై వ్రాశాడు. నాడు తెలంగాణాలో దోపిడీలు, స్త్రీల మానభంగాలు, ఊళ్ళు తగల బెట్టడాలు మొదలైన విద్రోహక చర్యలు చూసిన దాశరధి హృదయం నుండి 'అగ్నిధార'లు వెలువడ్డాయి. పీడిత ప్రజల సమస్యలకు శక్తివంతమైన కావ్య రూపాన్ని ప్రసాదించాడు. అన్యాయం, క్రమం, దౌర్జన్యంపై విరుచుకు పడ్డ కవిత్వమే ఆయన అగ్నిధారలో చోటుచేసు ంది. పదే పదే అనేస్తా అంటూ.... ''దగాకోరు-బడాచోరు రజాకారు పోషకుడవు' 'టిప్పర నోటి వెంట పాటలుగా మాటలుగా దిగి పొమ్మంటా''నని వాదిస్తూ.... ర్దంలే గద్దె యెక్కి పెద్దరికం చేస్తావా' అని మందలిస్తూనే 'మూడు కోట్ల చేతులు మెడను పడదోస్తాయి-మెడనే విడదీస్తాయి. 'నీకు నిలుచు హక్కు లేదు నీకింకా దిక్కు లేదని' ఎంత ధైర్యంగా నిలదీశాడు! "దిగిపొమ్మని జగత్తంత నగారాలు కొడుతున్నది" దిగిపోవోయ్ తెగిపోవోయ్" అంటూ ఎన్నిసార్లు చేతులెత్తి పిడికిలి బిగించాడో!

'తెలంగాణమ్మన గడ్డిపోచయును ధరించే కృపాణమ్ము' అని ఐక్యతా శంఖం పూరించి. "రాజ లలామ్ముండను వాని పిశాచమణచడానికి సాగించాడు యుద్ధాన్ని మత పిశాచి వికార దంష్ట్రికలతో మా భూమి లభించి మాకుత్తుకల్ గోసెడి వేళ గూడ ఆంధ్రత్వమ్ము పోనాడతేవని' రుద్రమల్ మెచ్చ యుద్ధమున గెలిచామని యెలుగెత్తి చాటినాడు" రెండు వంచల యేండ్ల చరిత్ర పుటల కప్పుకున్న గాఢాంధకారమెల్ల కొట్టుకొని పోయింది.

"నేను మీటే రుద్రవీణకు స్వరం నేర్పే రుధిర పక్షులు,
చీకటింటికి చిన్ని కిరణం తెచ్చి విడిచే రుధిర పక్షులు,
కాలమార్గం మీద నడిచే-కారు మైయకు గాలిపోసే రుధిర పక్షులు"

అంటూ ప్రామాణిక కాలంలో సామూహిక చైతన్యం పురికొల్పాడు. అనేక శబ్దాలంకారాల్లో గేయ ఛందోరీతులు కొత్త పుంతలు తొక్కాయి. ఆయన కవిత్వానికున్న భావావేశం దేశాభిమానంలో పునీతమైంది. అభిమానోద్దీపకమైన ప్రబోధం మహాంధ్రోదయంలో ప్రతిధ్వనించింది. తెలుగువారి హృదయ కుహరాల్లో పూర్వాంధ్ర చరిత్ర స్మృతులను నిద్రలేపి, దేశాభిమాన దీపకళికల్ని వెలిగించాడు. ఆ వెలుగులో తెలుగును దర్శించమని, "ఉడుకుద రాత్రుల్ పోయినవి. ఇల్లు ఇల్లాలిని, పిల్లజెల్లలను స్వర్గ సౌఖ్యమ్ముగా కనమని" ఉద్బోధించాడు.

తెలుగు నింగి దారులలో – వెలుగుపులుగు రెక్కలార్చి
చిమ్మి పైచె తరతరాల – చిక్కని చీకట్లనెల్ల .... అని స్వేచ్ఛగా

గాలి పీల్చుకుని తృప్తిగా.... 'తెల్లవారుటకన్న నాకు–గలకాంక్ష మరొండు లేదు...." అనడంలో ఆశ్యాశలులేవు నాకు ఆనందోజ్జ్వల ప్రభాతమే అయ్యిందిగదా! అరి శిరస్సులనుత్తరించిన అలుగునూ తెలుగునూ నేనే కదా! అఖిల జగముల చుట్టి వచ్చిన పులుగునూ తెలుగునూ నేనైనప్పుడు నాకు కావలసిందేమున్నదని సగర్వంగా చెప్పుకున్నాడు. తరువాత కవిగా.... ప్రజాకోటిని వెలిగించే రవిగా ఆయన అడిగిందీ, కోరిందీ.... "నాకు కావలె, నవశిరీష ప్రసవమంజుల భావగుంఫిత

కావ్యరాజము —— నవ్యజగతీ నవ్య మార్గ ప్రదర్శకము"

యింకా.... శ్రమిక హృదయాంతర్మహా బడబాగ్ని ఉరుకులు పెట్టె దారులు,
కృషిక సీర విశాతముఖమున-క్రుమ్మినట్టి హాలాలహరులు
తెలుగు ఊరుల–వెలుగు వారల ప్రతిఫలించే మహాకావ్యం"

కావాలని కాంక్షించాడు. ఆయన ఆశించిన ప్రతి అక్షరంలో దేశాభ్యున్నతిని చూపే విశిష్ట సౌభాగ్యం యిమిడివుంది. నిలయాన్ని లయించుకున్న విశేష సత్వమూ వుంది. ఒక చోట ఆనందోత్సాహంతో....

నేనురా తెలంగాణా నిగళాలు తెగ దొబ్బి
ఆకాశమంత యెత్తరచినాను
నేను రాక్షసి గుండె నీరుగా, పద్యాల
పాడి మానవుని కాపాడినాను.
.... .... .... ....

ఇంత ఉద్రిక్తుడై ... రాక్షసి గుండె నీరుగా మార్చి చివరకు తానేంచేయగలిగాడు? 'మూడుకోటులనొక్కటే ముడి బిగించి-పాడినాను మహాంధ్ర సౌభాగ్య గీతి" అని తృప్తిపడ్డాడు. ఆ తృప్తితోనే విశ్రమించలేదు. మరింకేదో చేయాలనే తపన. మరింకేదో సాధించాలనే నిరంతర ఆరాటం.... అక్కడే ఎవరి గుండె శిథిలమైందో జంటగా ఒకని చేయి పట్టుకొని.

"ఈ శిథిలాలయమ్ముననే-జనించిన చిక్కనిక్కనై రేత మో
రాశి శిఖరాగ్రి సీమ పదరా! ఒక దీపము పెట్టి వత్తము ....

అంటూ ఉపయోగించిన మహాంధ్రోదయంలోని, మహోజ్జ్వల పదజాలము, ప్రతి ఆంధ్రుడి గుండెల్లో చిరకాలంగా చెరగని ముద్ర వేసినది. తెలుగు సరస్వతిని మూడు మూర్తులా అలంకరించి, ఉపాసించండని ఆదేశించాడు. తెలుగు వాణి మా బాణియనీ తెలుగు రూపు మా రూపు అనీ, తెలుగు పలుకు మా ఉలుకు అనీ - తెలుగునందున్న పరమార్థాన్ని వెలయించాడు. తెలుగు వారల కష్టనిష్ఠూరాల్లో తానొకడుగా కలిసిపోయాడు, భాషలో వాకింత కాఠిన్యం వున్నా, భావంలో డొంకతిరుగుడు లేకుండా, సూటిగా దూసుకొచ్చి హృదయాలను హత్తుకొని మత్తును వదిలించే మహత్తర బలం దాశరథి కలం. ఆ కలంలో వాడీ-వేడీ రెండూ వున్నాయి. వరమూ-ప్రసాదమూ రెండూ వున్నాయి. ఎంత చిత్రము!

మరి.... పునర్నవం పురిటిలోనే జగత్తు పైపు ఎందుకు చూసిందో! తెలివిగా అర్థం ఎలాచేసుకుందో గాని.

'జగత్తులో నేడు సగం - దగాపడుట మానుకుంది
పేద జనం నేడు మొగం - తుడుచుకొని మేలుకుంది'

అంటోంది. ఆలోచనలకు మార్గం చూపే ఈ గేయాలు క్రమంగా బాల్యం లోకి ప్రవేశించి....

> 'దుర్మార్గాలకి దుఃఖాలకి - ఆవతలిగట్టున
> తొంగి తొంగి చూస్తున్న లోకం బాల్యం' పసివాడు వాఃసారి....
> అగ్గితో ఆడుకుంటాడు - కత్తితో కవాతు చేసాడు.

ఇది జీవన జలధికి యివతలి గట్టుకు మొదట్లోనే నిర్ణయించిన బాల్య లోకం. ఈ లోకపుదారుల్లో స్వేచ్ఛగా ఆడుకోవచ్చునంటాడు. ఇంకా....

'అమ్మ యెదలోపల అమృతాన్ని - నాన్న చంకలో నాక లోకాన్ని' అనుభవించగల పుణ్యుడట. బాల్యం జారిపోతే అనుభవించడం ఎలాగ? ఏమా తలంపు? అమ్మవొడి అనుభూతికి నిలయం - నాన్న చంక ఆలోచనాత్మక వివేకం. అమ్మ అనునయంలోనూ, నాన్న అదుపులోనూ పెరుగుతాడు చంటివాడు. ఒకటి ఆర్ద్రితా మాధుర్యాలకు నిలయం అయితే, రెండవది ఉన్నతికీ పరిణతికీ స్థానం అవుతుంది. మొదటిది ఫలిత సిద్ధికీ, రెండవది రాబోయే దర్శనాకృతికీ అద్దం పట్టేలా విశ్లేషించి చెప్పుతాడు కవి. పసితనంలో వున్న దేవత్వం మనల్ని పూగించి పూగించి యౌవనం అనే నరజన్మలోకి విసిరేస్తుందని అందుకే అంటాడు. ఆ తరువాత.... మళ్ళీ యిలాంటి దివ్యమైన సమయాలు వచ్చేనా? ఏమో! అని నిట్టూరుస్తాడు కూడ! ఆయన నిగ్రహంలో.... నిట్టూర్పుల్లో నిర్నిద్రకాంతులు జిగేల్ మంటాయి. క్రొత్త స్పృహ వస్తుంది మనకి. వెంటనే పరమసుందరమైన విహార క్షేత్రాల్లోకి తీసుకువెళతాడు. హాయిని పంచి యిస్తాడు. అందుకే ఆ కవితలో క్రొత్తదనం, కమ్మదనం వుందుంది. అనుభూతీ, ఆక్రందన వినిపించగలడు. గర్జనతో, గాంభీర్యంతో హడలగొట్టగలడు. జడత్వం జబ్బుజరిచి, చైతన్యం వుసికొలిపి, అనంత సంగ్రామం వైపు మళ్ళిస్తాడు మనల్ని. అది యెక్కడో సాగుతోంచని మనం ఆలోచించనక్కర లేకుండానే.... 'అనాధుడికీ - అగర్భ - శ్రీనాధుడికీ మధ్య

అనాదిగా సాగుతోంది అనంత సంగ్రామం' అని చెప్పగానే మనం పూరుకుంటామా! ఎందుకు జరుగుతుందో తెలుసుకోవడానికి ప్రయత్నిస్తాం!

> 'సేద్యం చేసే రైతుకు - భూమి లేదు పుట్ర లేదు
> రైతుల మూల్గులు పీల్చే - జమిందార్ల ఎస్టేట్లు

అంటు చెప్పగానే చీమూ రక్తమూ వున్న యే యువకుడు కదిలిపోకుండా వుండలేడు. సమసమాజస్థాపన కోసం సోషలిజాన్ని, సహజీవనాన్ని స్వంతవస్తువులుగా ఉపయోగించుకున్న దాశరథ్గారికి ముందు చూపు లేదని ఎలా అనగలం? భవిష్యత్తు మీద ఆయనకున్న ప్రేమ నూతనాభ్యుదయం కోసమే. అది కేవలం ఆంధ్రులకే పరిమితం కాదు, భారతీయాభ్యుదయం కోసం కూడ. ఆయనలోవున్న దేశప్రేమ నిరంతరం నూతన వలయాలుగా చుట్టుకుంటుంది. ప్రపంచంలో ఏ మూలనైనా నిరంకుశం, ప్రజాపీడనం జరుగుతున్నా తాను నిద్రించడు. ఆయనకున్న విశ్వ మానవ ప్రేమ, విప్లవం అనే కంచు కాగడా ఒక చేత పట్టి, చీకట్లను పారద్రోలి, మరోచేత విజయ పతాకాన్ని యెత్తి నడుస్తుంది. ఆ ఉద్వేగంలో ఆయన గొంతు కోటి గొంతుకల్తో

'సత్యానికి గెలుపన్నది – సత్యంరా మానవుడా!
అన్యాయంతో స్వర్గం – అందదురా దానవుడా'

అని ఘోషిస్తుంది. ఈ కారణంగా దాశరథి 'ప్రజా శక్తిలో కొంత శబ్ద సృష్టిచేసిన మరో బ్రహ్మపిండం' అనవచ్చు. ప్రతి శబ్దములో ఉచితమైన సత్యము, అమితమైన ప్రయోగమూ, పవిత్రమైన భావతత్వమూ ప్రదర్శించగలడు. కాని అసాధ్యాలు వల్లించడం, అనవసర ప్రసంగాలు చెయ్యడం, అర్థాంతరంగా ఆడంబర పదజాలాన్ని ప్రయోగించి సాహితీ బహుముఖాకృతి వెలయించుతున్నానని ప్రకటించుకోవడమూ ఆయనకు గిట్టదు. ఎంత ఉద్రేకాన్ని ప్రదర్శించగలడో అంత తీయని ప్రేమనూ పంచిపెట్టగలడు. గుండెలనిండా కరుణను నింపగలడు. 'వధూనిక' అను కావ్య ఖండికలో దాశరథి చెప్పిన మాట రసాల రసపుతేట.

"వానకాలమందు కానలకోనల
చెట్ల కొమ్మలందు చిన్న గూట
రెక్కగొడుగు క్రింద డొక్కల పక్కల
పక్షిగాచు తల్లి పిట్టవీవు" అంటాడు.

అలాగే తన కవితామృత ధారలచే ద్వేషాగ్నిని ఆర్పివేయడానికి. 'విషముడుల్ల జేసి రసము పుట్టునట్లుగా' వివిధ భావాలను కల్పించ బూనుకున్నాడు కవి. అందుకే నాల్గు వైపులా చూసి,

'ఈ యమృతాభిషేక మునకెంచరు సత్కవులేగుదెంచినా

రోయి! మరంద మాధురులనూను లసత్ కవితా ప్రసూనముల్

దోయిట బూని' అని ప్రశ్నిస్తున్నాడు. అబ్బ! ఎంత తీయదనం! మరందమాధురులట. పోతన్నగారి గీతాన్నంలో కలిపిన రసాన్నంకాక మరేమిటిది!"కవితా పుష్పకం"లో శాంతినుద్దేశించి చెబుతూ....

'పూలను ముద్దు పెట్టుకొని ముండ్లను వద్దనబోకు నీవు- నీకేలు
తాకినంతనే ముళ్ళు కూడ పూలై పులకించును- నీ సొగసైన

చూపు, మోడును మేడగా మలచి, ముల్లును మల్లెను చేస్తుంది' అంటాడు. ఎంత చమత్కారమో! బ్రహ్మను మించిన నీకు గారడీవాడు కూడ సలాము చేయు అన్నాడు.

అయితే, ఆయన దృష్టిలో 'శాంతి అనంగమోహిని. బంగరు వన్నెల చిన్నది. అజ్ఞాన తమస్సమూహము నాశము జేసెడి జ్యోతి. అలాంటి శాంతి సతికీ తనకూ ఎంత ప్రేమ వున్నదట. మధుమాసంలో పికమేమి పాడినా, వనమున నేమి పూచినా వారికీ పట్టదట. ఆమె హృదయాంగణపు పంచలోని గున్నమావి చక్కని పండ్లనొసంగునట'. ఎంత విచిత్రము! విశేష భావనాబలంలో అశేష వ్యూహ చమత్కృతులు! ఈ చమత్కృతులను గ్రహించిన రాష్ట్ర ప్రభుత్వం 1967లో ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమీ బహుమానం ప్రకటించింది. ఎంత సొబగులను సంతరించుకున్న కవితా పుష్పకం, ఆంధ్ర దేశమంతటా పయనించింది. సమస్త ఆంధ్ర పాఠకలోకం హృదయాలపై శయనించింది

ఇక అనువాద పద్ధతిని పరిశీలిస్తే, దాశరథిగారు వ్రాసిన 'గాలిబు గీతాలు' సుప్రసిద్ధానువాదమని చెప్పవచ్చు. ఇందలి గజళ్ళను మథించి గాఢమైన రసంతీసి, తెల్లని తెలుగు గుడ్డలో వడగట్టి మధుపాత్రలాగే మనకందించాడు దాశరథి. ఫారసీ,ఉర్దూ భాషల్లో ఆయనకున్న ప్రతిభను ఈ గ్రంథం స్పష్ట పరుస్తుంది.

ఫారసీ, ఉర్దు గజల్ కవితా సంప్రదాయంలోకి వెళితే, విప్రలంభ శృంగారానికే ప్రాధాన్యం వుంది. ఇందొకటి నాయికానాయకుల ప్రేమ

(మజాజీ) మరొకటి భగవద్భక్తి ప్రేరకమైన ప్రేమ (హఖికీ) యని రెండు విధములు ఈ రెండింటిని రంగరించి బొపోసన పట్టిన ఉద్దండ వి మీర్జా గాలిబు అయితే, అందులోని ముఖ్య ఖండికలు యేర్చికూర్చి ఆయన సమగ్ర కవితా హృదయాన్ని అద్దంపట్టి చూపిన గొప్ప ప్రతిభామూర్తి దాశరధిగారు. గజళ్ళలోని ఉత్తమ కవితా ఖండాల్ని ఎంపిక చేయడంలో, వాటిని తెలుగు వాతావరణంలోకి, ఆచార సంప్రదాయాల్లోకి మలచడంలో చూపిన సామర్థ్యం గణనీయమైనది మూలమునకు అత్యంత సన్నిహితంగా చెప్పడంలోనైతేనేమి, రసవంతమైన అనువాద సరళిలోనైతేనేమి చక్కని స్వరూప స్వభావాల్ని చిత్రించాడనడంలో అతిశయోక్తి లేదు. శృంగారాన్ని అందించిన ప్రేయసికి యితరులతో వున్న పొత్తు సహించడంలోనే ఔచిత్యం శోభించు చున్నదనే భావన తలపించే యీ కవిత గమనించదగినది.

"ఒరుల కొసగ లేదే ఉవిద? నీ యధరమ్ము?
నాకు గూడ నోరు లేక పోదు"

వేళాకోళం కాదు. అలాంటి స్థలాల్లో తాను లేక పోవడమే తృప్తియట తనను గూర్చిన ప్రస్తావనుంటే చాలట.

'ఉవిద గోష్ఠిలో నేనుండకుంట మేలు
నన్నుగూర్చిన ప్రస్తావనమ్మె చాలు'

గాలిబు హృదయాన్ని ప్రకటించిన పీరు, ఉర్దూ నుండి తెలుగు భాషలో పోసినట్లు గజల్ పోకడకు అనుగుణంగా వుంది. గాలిబు హృదయంలో ఆశ, నిరాశ, ఆనందము, వేదాంతము ఆయనకున్న ప్రేమోపాసన లోనే కనబడుతుంది. అదే ఫక్కీలో, ఆయా అనుభూతుల్లోనే లీనమై దాశరథి గారు యీ గీతాన్ని అనువదించారు. చక్కని పదజాలంతో, నిండుదనంతో గాలిబు భావాన్ని అర్థవంతంగా చెప్పగలగడం అనితర సాధ్యమేమరి దేవులపల్లి రామానుజరావు గారన్నట్లు "పూర్వ జన్మలో దాశరథియే గాలిబేమో!" లేక ఈ జన్మలో గాలిబే దాశరథి యై జన్మించెనేమో!" యింతగా సంభ్రమాశ్చర్యాల్ని కలిగించిన "గాలిబు గీతాలు" అనువాదకృతి, ఉత్తమానువాద బహుమతిని పొందడంలో వింతలేదు.

శాంతి, సామ్యవాదం కోసం అభ్యర్థిస్తాడు కవి "తిమిరంతో - సమరం"లో తిమిరం అనేది లోకం నిండా అనేక రూపాల్లో నివసిస్తోంది. ఆ చీకట్లనన్నింటినీ ఛేదించడాన్నే "అనంత సంగ్రామం" అంటాడు. ఈ సంగ్రామంలో శ్రమ, బాధ ఆవేదనలుంటాయి అన్నిటినీ ఎదుర్కొని సాధించే జ్ఞానం కోసం ఆయన కలం పురకలు పెట్టింది. మూఢత్వానికీ, మూర్ఖత్వానికి తిరోగమనానికి ప్రతీక తిమిరం. ఈ తిమిరంలో సమరంచేసే వాడు కవి. సైనికుడు కత్తితో పొందలేనిది, కవి కలంతో సాధించవచ్చునన్న విద్వత్ కవి దాశరథి. తానీ విధంగా సాధించేది సంఘ సంస్కరణ వొక్కటే కాదు, దేశంలోని మూలనున్న ప్రతి పౌరునికీ ఉన్న స్వేచ్ఛను, యధేచ్ఛగా ఉపయోగించుకునే హక్కును కలుగజేయడం కూడ. మానవతావాదంలో, జాతీయ దృక్పథంలో అజ్ఞాన తిమిరంపై ధ్వజమెత్తిన మేటి యోధుడు దాశరథి.

"ఇంతకీ-యీ చీకటిని పార ద్రోలే జ్యోతి
మానవతా వాదం మీద మనిషి ప్రీతి
ఎంతకీ కానరాక పోవటం కలిగిస్తున్నది భీతి"

'దానవుడు గెలిచేటి తరము గడిచింది-మానవుడు వర్ధిల్లు వేళ వచ్చింది' అవి మానవతా-విప్లవ భావాత్మకంగా చెప్పబడింది.

చీకటీ వెలుతురూ ఒకదానికొకటి తరుముతూ వెళ్ళే పలయాలు. ఇందేవొక్కటి విశ్రమించినా రెండవదానికి స్థానం వుండదు.

'తెల్లవారనిదే తమస్సు విడిపోదు
కళ్ళు తెరవనిదే ఉషస్సు కనరాదు' అనడంలో - తెల్లవారితే చీకటి తొలగుతుందా? లేక చీకటి విడిపోతేనే తెల్లవారుతుందా? అనేది చిక్కు సమస్యగా మనం వూహించవచ్చు. నిజంగా ఇందులో మనకోసమే, మన వూహకే 'యద్భావం తద్భవతి' అనేట్టుగా వదల లేదు. తానే సమస్యను సునాయాసంగా విడదీస్తూ 'చూడగల శక్తిగల నయనాలు' కావాలంటాడు. కళ్ళూ, హృదయం మందగిస్తే చీకటి. శక్తితో పరిశీలించ గలిగితే అంతా వెలుగే అనేది సుస్పష్టం

కవితకి కాంతి ఎం ముఖ్యమో, శాంతి కూడ అంత అవసరం. రణమూ, ధనమూ మనిషి బాధించే రోజుల్లో శాంతమూర్తియైన కవి.

'మనశ్శాంతి లేనినాడు మనిషి మనికిపేనికి?
స్నేహ సుధలు లేనినాడు జీవితమది యెందుకు?'

అని ప్రశ్నిస్తాడు. మరోచోట చిరునవ్వుతో చైతన్యం సాధించే అభ్యర్థన.

ఓ శాంతి సుందరీ!
ఓ చిలిపి చిరునవ్వు కాసెంత రువ్వు

ఈ కారు చీకటికి అణుగుతుంది కొవ్వు.... ఇలా ఎన్ని హృదయాలనో అలరించిన దాశరథి కవితా సుందరి ఎంత సమర్థురాలు! ఆలోచించినా కొద్ది ఆనందాన్ని కలిగించక మానదీ కవితామూర్తి తత్వం.

పరమ భావుకుడూ, ప్రజ్ఞామూర్తియైన దాశరథి ఆకాశవాణిలో కొంత కాలం పనిచేశాడు. ఆ తరువాత ఆయన సినీ గీతాలు వ్రాయడంలో పండిత పామరులకు పరిచితుడయ్యాడు. గొప్ప గొప్ప అవార్డులు పొందడమే గాక ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారిచే 'కళాప్రపూర్ణ' బిరుదును, ఆగ్రా విశ్వ విద్యాలయం వారిచే 'డాక్టర్ అఫ్ లెటర్స్' గౌరవ డిగ్రీని కూడ స్వీకరించాడు.

1977 స్వాతంత్ర్య దినోత్సవం నాడు ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ఆస్థాన కవిగా నియమించబడ్డాడు. ఈ మహాకవి కావ్య సంపద దేశవ్యాప్తంగా అనేక భాషల్లోకి అనువదింపబడవలసివుంది.

అంధకార ప్రీతిపట్ల అదే పనిగా అహరహం ఉత్సాహం చూపించే వారికి, దేశ సౌభాగ్యం, దాని సౌందర్యం గోచరించదు. నిర్మాగమాటంగా అసంతృప్తిని ప్రకటిస్తూ, నిత్యం నీరుగారి పోయే దాని కంటే మిగిలిన కొంత సమయాన్నైనా ప్రపంచ శాంతి కోసం వినియోగించడం మంచిదేమోనని నా భావన. తీవ్రత, ఉద్రిక్తత, స్తబ్ధత కేవలం క్షణికాలు. వాటి పరిధులు దాటింతరువాత హృదయానికి స్పందన, సంస్కరణం తాలూకు భావన సృష్టించకుంటే శాంతికి మూలమవుతుంది. అక్షరాలా యిలాంటి ప్రక్రియనే దాశరథి తెలంగాణా విముక్త పోరాటంతో బాటు దేశాభ్యుదయం, శాంతి శృంగారాల్ని రసవంతంగా, పోషించాడు. విద్వత్కవిగా జాతీయ స్థాయికి యెదిగాడు.

ఏదియేమయినా, ఆధునిక సాహితీ క్షేత్రంలో, తన అసామాన్య కవితాధారలను కురిపించి,

'శీతోష్ణముల పైరు పచ్చలు చేసి
కలము పంటల జూపు దాశరథి మాకు రవి' అని పల్లెసీమల్లో పదేపదే పాడుకునే సారస్వత మూర్తుల కల్పతరువులా, జ్ఞానజ్యోతిలా మిగిలిపోయిన మహాకవివి దా.... శరధీ! అని పిలిస్తేమాత్రం కవితా సముద్రాన్ని చంకనెట్టుకొని రాగలడా? లేదు. కవితాశరధినంతా తన గర్భ గోళం నుండే విశ్వమానవ హృదయ క్షేత్రాల్లోకి ప్రవహింప జేశాడు. ఇప్పుడా శరధి గర్భంలోనే "దివాంధాల నౌక్కటిగా" విశ్రమిస్తున్నాడు. సజీవ ఉత్తుంగ తరంగ సంకేతాలతో ఆశీర్వదిస్తున్నాడు.

ఆ సంకేతాలు తెలుగు జాతికి అంకితాలు.



# కాళోజి

కాళోజి నారాయణరావు

జననం: 14-9-1914
మడికొండ, వరంగల్లు

చిరునామా:-

నక్కలగుట్ట
హన్మకొండ, వరంగల్లు 506001

ముద్రితాలు :

నాగొడవ - 7 భాగాలు
జీవనగీత
కాళోజీ కథలు
తుది విజయం - మనది నిజం
నా భారతదేశ యాత్ర

# యం. సుబ్బారావు

మండవ సుబ్బారావు
యం.ఎ., యం.ఫిల్., బి.ఇడి.,

జననం: 23-5-1952

నేతాజీ గురుకుల విద్యాలయం
ఖానాపురం 506232
నర్సంపేట, వరంగల్లు.

ముద్రితములు :

మాతృ మందిరం (నవలిక)
నవభారతం (కవితా సంపుటి)
యమ్మెస్సార్ కథలు
నామాట శతకం

అముద్రితాలు :

ఎమ్మెస్సార్ గేయాలు - గాయాలు
త్వమేవాహం - ఒక పరిశీలన (సిద్ధాంత వ్యాసం)

# ప్రజాకవి కాళోజి

నన్నయ నుండి నేటి వరకు తెలుగు కవిత్వం అనేకానేక సాంఘిక రాజకీయ సాహిత్య ఉద్యమాలను చవిచూసింది. ఏ ఉద్యమానికి సంబంధం లేకుండా, ఏ ఉద్యమానికి చలించకుండా తమ చుట్టూ అనుభూతుల, ఆనందాల అడ్డుగోడలు కట్టుకొని తమదో ప్రపంచంగా జీవించిన కవులు నాడూ ఉన్నారు నేడూ ఉన్నారు. ఇలాంటి వాళ్ళు ఎప్పుడూ ఉంటారు. వాళ్ల వల్ల తెలుగు కవిత్వానికి వచ్చిన లాభము లేదు. వాళ్ళు రాసినదాంట్లో సామాజిక స్పృహ లేకపోయినా కవిత్వం ఉంటే చరిత్ర పుటల్లో మాత్రమే వాళ్ళ పేర్లు నిలిచి పోయాయి. రెండూ వున్నవాళ్లు పామరుల పండితుల నోళ్లల్లో చిరంజీవులై ఉన్నారు. రెండూ లేకుండా కవిత్వం రాసినవాళ్లంటే రాస్తున్నవాళ్లు చాలా మంది ఉన్నారు. వీరు పత్రికల్లో కనిపించినా, పదికాలాలు మాత్రం జీవించ లేరు. తెలుగు కవిత్వం సంసారంలో సరిగమల దగ్గర నుంచి సాయుధ పోరాటాల వరకు తన వస్తువుగా స్వీకరించుకొని సమకాలీన సాంఘిక పరిస్థితుల్ని సమతల దర్పణంలో లా చక్కగా ప్రతిబింబించింది.

ఆధునిక తెలుగు కవిత్వంలో తెలంగాణా సాయుధ పోరాటం మీద వచ్చినంత కవిత్వం మరే విషయం మీద రలేదని చెప్పటం అతిశయోక్తి

ఏమాత్రం కాదు. శ్రీశ్రీ అన్నట్లు 'భారత దేశం' అంతట్లోకి రాజకీయంగా ఎక్కువ చైతన్యం చూపిస్తున్న ప్రాంతం ఆంధ్రప్రదేశ్; అలాగే ఎక్కువ చైతన్యాన్ని ప్రతిఫలించే కవిత్వం తెలుగు కవిత్వం అని చెప్పవచ్చు "భారత దేశంలో మరే ప్రాంతంలో కూడా తెలంగాణా రైతాంగ పోరాటం 1940లకు ముందు కూడా ఎక్కడ జరగలేదు. అందువల్ల ఏ భారతీయ భాషలలోనూ తెలంగాణా రైతాంగ పోరాటం చైతన్యం వంటి చైతన్యంతో సాహిత్యం రాలేదు. అంటారు శ్రీ కేతవరపు రామకోటి శాస్త్రిగారు. తెలంగాణా సాయుధ పోరాటం "స్పానిష్ సివిల్ వార్" లాంటిది. స్పెయిన్‌లోని అంతర్యుద్ధం యూరప్‌లోని ఎందరో మేధావుల్ని కదిలించింది. అలాగే తెలంగాణా సాయుధ పోరాటం తెలుగు కవుల్ని కదిలించగలిగింది. స్పెయిన్ మీద, అడెన్, స్పెండర్ సిడెలూయిస్, జార్జి, బార్కర్, వంటి మహాకవులు అనేక కావ్యాలు రాసారు. అలాగే తెలంగాణా సాయుధ పోరాటం మీద కావ్యాలు రాసినవారు చాలా మంది ఉన్నారు. వారిలో దాశరధి, కుందుర్తి, ఆరుద్ర, కాళోజి, కె. వి. రమణారెడ్డి మొదలైనవారు ముఖ్యులు. ఇంకెంతోమంది నాటక కర్తలు, నవలాకారులు తెలంగాణా మీద రాసినవారు ఉన్నారు. ఇందులో కొందరు ఉద్యమానికి దూరంగా ఉండి రాసిన వాళ్ళు, మరికొందరు ఉద్యమంలో స్వయంగా పాల్గొంటు కవిత్వం రాసారు, వారిలో దాశరధి, కాళోజి ముఖ్యులు.

"మన కొంపలార్చిన మన స్త్రీల చెరచిన
మన పిల్లలను చంపి మనల బంధించిన
మానవాధములను మండలాధీశులను
మరచిపోకుండ గురుతుంచుకోవాలె
కసి ఆరిపోకుండ బుసగొట్టుచుండాలె
కాలంబు రాగానే కాటేసి తీరాలి"

అంటూ నిజాంచేసే ప్రజా పీడనమునకు స్పందించి ప్రతీకారం చేసి తీరాలి అని ప్రబోధము చేసినవారు కాళోజి.

## కాళోజి జీవితం

తెలంగాణా విప్లవ కవిగా, తెలంగాణా శ్రీశ్రీ గా పేరు పొందిన ప్రజాకవి కాళోజి వారి పూర్తి పేరు కాళోజి నారాయణరావు. వారు సెప్టెంబరు

14, 1914లో వరంగల్ జిల్లాలోని మడికొండ గ్రామంలో జన్మించారు వారి తండ్రి కాళోజి రంగారావుగారు. శ్రీ రంగారావు గొప్ప విద్వాంసులు. వారు ఒక విద్యాలయాన్ని మడికొండలో నిర్వహించారు. వారు వారి విద్యాలయము లోని విద్యార్థులకు సంస్కృతం, ఉర్దూ, ఆంగ్లం, గణితం నేర్పేవారు. వీరి పెద్ద కుమారుడు శ్రీ కాళోజి రామేశ్వరరావు గారు తండ్రి గారి నుండి ఉర్దు భాషను నేర్చుకొని ఉర్దు భాషలో కవితా రచన చేసారు. వారి రెండవ కుమారుడే శ్రీ నారాయణరావు గారు. శ్రీ నారాయణరావు గారు హైదరాబాదులో వకాలతు చదువుతున్న రోజులలో ఆంధ్రమహాసభల్లో చురుగ్గా పాల్గొన్నారు. చదివిన చదువు వకాలత్ అయినా ఆ వృత్తి చేపట్టలేదు. నారాయణరావు గారు. నిజాం పాలనలో జరుగుతున్న దోపిడీలకు, దౌర్జన్యాలకు వ్యతిరేకంగా ప్రజల పక్షాన పకాల్తా పుచ్చుకొని నిజాం నవాబుకు వ్యతిరేకంగా కవిత్వము రాసారు. ఆయన రాసిన కవిత్వాన్ని ఆయనే వేదికల మీద చదివేవారు. సున్నితంగా హేళనగా కవిత్వం రాయటంలో కాళోజి దిట్ట. ఆయన కవిత్వం, ఆయన ఉపన్యాసాలు ప్రజల్లో ఎంతో చైతన్యాన్ని ఉత్సాహాన్ని కలిగించాయి. తత్ఫలితంగా నిజాం సర్కార్‌వారు కాళోజిని జైల్లో పెట్టారు.

1939లో మొట్టమొదటిసారిగా కాళోజి జైలు గోడల్ని చూశారు. అయినా వారు జంకలేదు. ఆనాడు గాడిచర్ల హరి సర్వోత్తమరావు గారు ప్రారంభించిన గ్రంథాలయోద్యమాన్ని తాను స్వీకరించి గ్రామ గ్రామాలలో గ్రంథాలయాలు స్థాపించి, "గ్రంథాలయోద్యమ–ఆస్థాన కవి" అని పిలిపించు కున్నారు. ముస్లిం, హిందూ ఐక్యతకు కాళోజి ఎంతగానో కృషి చేశారు. వరంగల్‌లో మొగిలయ్య అనే వ్యక్తిని కొందరు దుండగులు చంపినప్పుడు ఆ దుశ్చర్యను ప్రతిఘటించటానికి పూనుకున్నాడు. ఈ సందర్భంగా ప్రభుత్వం వారిని వరంగల్ నగరం రావద్దని ఆంక్షపెట్టింది. అంతే కాకుండా 1943లోను 1947లో కూడా కాళోజిని జైల్లో పెట్టింది అప్పటి ప్రభుత్వం. 1948లో విడుదలయినాడు. స్వాతంత్ర్యనంతరం జరిగిన ప్రథమ సార్వత్రిక ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీ పార్లమెంట్ అభ్యర్థిగా పోటీచేసి కాంగ్రెస్ అసెంబ్లీ అభ్యర్థుల మోసం వల్లనే అతి స్వల్పమైన తేడాతో ఓడిపోయాడు. దాపరికం లేకుండా కుండ బద్దలు కొట్టినట్లు ఉన్నదేదో ముఖం మీదే అనేవాడు కనుకనే ఇంతదాకా కాళోజికి రాజకీయాలు అచ్చిరాలేదు. కాంగ్రెస్ పార్టీలో కల్మషం చేరడం ఆరంభించగానే అందులోంచి తప్పుకున్న కాళోజి అపార్టీ ప్రభుత్వం చేస్తున్న లోపాలుతాను M.L.C.గా ఉన్నప్పుడూ, పౌరునిగా, కవిగా విమర్శిస్తూనే ఉన్నాడు.

అన్ని ఉద్యమాలలో కాళోజీ కవితను ఒక సాధనంగా తీసుకొని తన వాణిని ప్రజలకు వైతాళిక గీతంగా వినిపించాడు.

## ప్రజా కవిత్వం

ప్రజాకవిత్వం నిర్మాతలు ప్రజలే. ప్రజలంటే శ్రమజీవులు, శ్రమ జీవుల పాటలే ప్రజల పాటలు. ఈ ప్రజలు తమకు తాము వెలువరించుకున్న కవిత్వాన్నీ, ప్రజలకోసం వారికి అర్థమయ్యేటట్లు వాళ్ళ శ్రమను గురించి, జీవితాల గురించి ఇతరులు రాసే కవిత్వాన్ని "ప్రజాకవిత్వం" అనవచ్చు.

'నెరా నెరా నెరబండీ' అనే పాట ప్రజలకు సులువుగా బోధపడుతుంది కొన్ని చోట్ల ఆనందాన్ని కూడా ఇస్తుంది. ఇది ప్రజాకవిత్వం, పూర్వము ఇటువంటి కవిత్వము రాసినవాడు వేమన. ఆ మహాకవి ప్రజాకవి ఆటవెలదులతో ఆడిన ఆటలు ఈ నాటికీ ప్రజల నాలుకలపై నిలిచిపోయినవి. తరువాత తెలంగాణా సాయుధ పోరాట రోజుల్లో ఇలా ప్రజల మాటల్తో కవిత్వం రాసిన వారు చాలా మంది ఉన్నారు. వారిలో కాళోజి ఒకరు. అభ్యుదయ కవులు కవిత్వం ప్రజల కోసం అంటూనే ప్రజలకు అర్థం కాని కవిత్వం చెపుతుంటే కాళోజి కవిత్వంలోనూ, భాషలలోను గొప్ప మార్పు తెచ్చి ప్రజల కవిత్వాన్ని సృష్టించారు. ప్రతి తెలుగు వాడికి విన్నంతనే అర్థమవటం కాళోజి కవితలో గల ముఖ్యలక్షణము.

## నా గొడవ

కాళోజీ ఎప్పటికప్పుడు దేశంలోని సమస్యలకు, సంఘటనలకు స్పందిస్తూ వందలకొలది కవితలు రాశారు ఇవన్నీ 'నా గొడవ' ద్వారా లోకానికి పరిచయమైనాయి. ఈ 'నా గొడవ' గురించి శ్రీశ్రీ ప్రథమ ముద్రణ ఆవిష్కరణ సభలో ఇలా ప్రశంసించారు. "ఇది కవి గొడవగానే కనిపించి నప్పటికీ చదివిన వారికి ఇది తమ గొడవగానే అర్థమవుతుంది. ఇది విశాల జగత్తు ప్రజలందరి గొడవ. ఇది మనం మననం చేసుకోవాల్సిన పుస్తకం.

కాళోజి దేశభక్తుడు. అయితే వీరి దేశభక్తి కేవలం కవిత్వానికే పరిమితమైంది కాదు. విద్యార్థి దశ నుండి వారు నమ్మిన దానిని గురించి

ప్రభుత్వమునకు వ్యతిరేకమైనదైననూ జంకు గొంకు లేక ధైర్యంగా కవిత్వంతో చూపించారు. నిజాం కాలంలో ప్రజల బాధల్ని, గాధల్ని ధైర్యంతో రాసి, పాడి జైలుకు వెళ్లారు.

ఆయన కవితల్లో ఒక్కొక్క గేయములో ఒక్కొక్క మకుటం పునరావృతమవుతూ ఉంటుంది, జానపద వాఙ్మయములో తరుచుగా కనిపించే 'ఉయ్యాలో, ఉయ్యాలో' 'రామ రామ ఉయ్యాలో'లా ఉంటుంది పునరావృత మగు మకుటం.

'ప్రపంచము' అనే కవితలో

'గడియ గడియకు మారు ప్రపంచము
గవ్వకనూ కొఱగాని ప్రపంచము'

అంటూ మొత్తం కవితలో చివర 'ప్రపంచము' అనే మకుటం రాశారు. అలాంటిదే మరో కవిత 'వ్యత్యాసాలు' ఇందులో ప్రతి పాదము చివర 'ఒక చోట' అని ఉంటుంది. ఇలా ఎన్నో కవితలు కలవు. ఇలాంటి రీతులవల్లనే వీరి కవిత్వం ప్రజా కవిత్వమైంది.

"మాతృదేశము" కవితలో కాళోజిగారి దేశభక్తి వ్యక్తమవుతుంది. చిన్న చిన్న మాటల్లో పెద్ద పెద్ద భావాల్ని కలిగిస్తారు కాళోజి.

"నీరు లేని ఎడారి యైనను
అగ్గికొండల అవని యైనను
వానల వరదల వసతి యైనను
మాతృదేశము మాతృదేశమె"

ఈనాడు ఉద్యోగ అవకాశాలు లేవంటూ, చదువుకు, మేధస్సుకు గుర్తింపు లేదంటూ అనేక మంది యువకులు దేశం వదలి పరదేశాలకుపోవడం మనకు తెలిసిందే.

పెట్టుబడిదారి దేశాలలోని వ్యత్యాసాల గురించి చెప్పటానికి కాళోజి పెద్ద పెద్ద సిద్ధాంత పదాల్ని ఉపయోగించలేదు. ప్రజల మాటల్లోనే ఇక్కడ కనిపిస్తున్న వ్యత్యాసాల్ని చక్కగా ఎలా వివరించారో చూడండి.

"అన్నపు రాసులు ఒక చోట
ఆకలి మంటలు ఒక చోట
హంస తూలిక లొక చోట
అలసిన దేహాలొక చోట
సంపదలన్నీ యొక చోట
గంపెడు బలగంబొక చోట"

'అవనిపై జరిగేటి అవకతవకలు జూచి ఎందుకో నా హృదిని ఇన్ని ఆవేదనలు అంటూ 'కష్టపడు వారలను కాపాడగాలేను' అనే బాధ వారిలో వ్యక్తమవుతుంది. అయినా వారు తమ వంతు కర్తవ్యంగా జనాన్ని చైతన్యపరచటమే అనుకొని ఆ పనిని చేయటానికి వారి కలాన్నే బలంగా ఉపయోగించుకున్నారు.

మన దేశం ప్రధానంగా వ్యవసాయిక దేశం. వ్యవసాయం చేసే రైతు దేశానికి వెన్నముక. ఈ విషయాన్ని గాంధి గారు నాడు 'గ్రామ రాజ్యం రావాలంటూ' రైతు క్షేమం కావాలంటూ ఉపన్యాసాలిచ్చేవారు. ఈ విషయాన్ని 'కర్షకా' అనే కవితలో కాళోజి కమనీయంగా చిత్రించారు,

"నర్తకుని నాట్యాలు గాయకుని గానాలు
వాదిత్రుని వాద్యాలు శిల్పకుని శిల్పాలు
చిత్రకుని చిత్రాలు అంగనల అందాలు
కందర్పు కయ్యాలు కవిరాజు కావ్యాలు
కర్షకా! నీ కట్టు కదలినన్నాళ్ళే"

ఇందులో 'కర్షకా నీ కట్టు కదిలినన్నాళ్ళే' అనే మకుటం పునరావృతం అవటం వలన కర్షకుని ప్రాముఖ్యం వ్యక్తమవుతుంది. ప్రజలు వాడుకునే 'నానుడి' గా మిగిలిపోయిందీ వాక్యం.

కాళోజికి ఏ విషయాన్నైనా నిర్భయంగా, నిర్మొహమాటంగా చెప్పడం అలవాటు. ఆయనకు కలిగిన భావం ఏదైనా సరే చెప్పవలసిందే. ఇతరులు ఏమనుకుంటారో అనే భయంలేదు. ఆంధ్రమహాసభల ప్రభంజనం తెలంగాణా గ్రామాల్లో వీస్తున్న రోజుల్లో ప్రజలు, భూస్వాములు, పోలీసులు చేస్తున్న రాచకాలకు వ్యతిరేకంగా అనేక ప్రతిఘటనలు చేశారు. అనాడు ప్రజల్ని

రక్షించవలసిన పోలీసులే ప్రజల్ని నానా హింసలు పెడుతుంటే వాళ్ళ కిరాతకాలను ఎండగడ్తూ కాళోజి ఎన్నో గేయాలు రాశాడు.

'పాలన పేరిట పల్లెల్లో
జరిగే పాపం చాలింక
రక్షణకై ఏర్పడ్డ బలగమే
చేసే భక్షణ చాలింక'

అంటూ గద్దించినాడు. కాళోజి కైతలు విని కదలకుండా ప్రజలుండరని, వాళ్ళ చైతన్యంతో మేల్కొని కాలం రాగానే కాటేసి తీరుతారని విశ్వాసాన్ని వ్యక్తపరిచాడు.

స్వాతంత్ర్యానంతరం మన ప్రజారాజ్యం ఏదో చేస్తుందని ఎదురు చూసిన ప్రజలకు మిగిలింది నిరాశే.

స్వాతంత్ర్యం పేర సొంతానికి కట్టు
బయట పడనీయ దలచుకోలేదు ప్రభుత్వం
కూటముల కోటల్లో అధికారుల తత్వం"

అంటూ గాంధి గారికి విన్నవిస్తున్నారు. పంచవర్ష ప్రణాళికలు, పంచశీల సూత్రాలు ప్రజలకు ఏమీ మేలు చేయక పోగా, వాటి పేరున డబ్బు ఎంతో ఖర్చుపెట్టి జనులకు అప్పు మాత్రం మిగిల్చారని వాపోతూ కవి,

"శృతిమించిన పంచశీల రాగాలాపన
మితిమీరిన పోకిరి పొకుగుల ప్రేలాపన
అప్పుల పాలైపోయింది జనత
తప్పుల కుప్పైపోయింది ప్రభుత"

అని వాపోతారు. అయితే ఈ పరిస్థితిపోయి గాంధిగారు కలలు కన్న గ్రామ రాజ్యమే రావాలంటే ప్రజల చేతుల్లో ఉందనే విషయాన్ని జ్ఞాపకం చేస్తూ "ఓటిచ్చు అధికారమున్నట్టివారు పురుషులెవ్వారు, కాపురుషులెవ్వారు గుర్తించి ఓటులను గురిపింపవలయు" అని హెచ్చరిక చేస్తారు.

ఇలా 'నా గొడవ'లో నాటి నిజాం ప్రభుత్వం దురాగతాలను, నేటి ప్రజా ప్రభుత్వాల స్వార్థాలను మనం చూడవచ్చు. దాశరథి దీన్ని గురించి

చెపుతూ కాళోజి 'నా గొడవలో'లో చెప్పించదంతా అయ్యింది. ఈనాడు చెబుతున్న దంతా అవుతున్నది. అతడు చెప్పనున్నదే కానుంది. త్రికాలజ్ఞుడైన మహర్షి కాళోజి' అంటారు.

వీరు 'నా గొడవ' ను ప్రచురించడంలో శ్రద్ధ చూపించలేదనే విషయం 'నా గొడవ' భాగాలు చదివితే అర్థమవుతుంది. ఏది నిజాం ప్రభుత్వం మీద రాసిందో ఏది మన ప్రజాప్రభుత్వం గురించి రాసిందో తెలుసుకోవడం కష్టంగా ఉంది. అయినా ఇప్పటికీ ఆ కవితలు సజీవంగానే ఉన్నాయి. సమకాలీన పరిస్థితుల్ని చక్కగా ప్రతిబింబిస్తున్నాయి. అంతేకాక వీరి కవితల్లో పరస్పర వ్యతిరేకమైన అభిప్రాయాలు కూడా కొన్ని కనిపిస్తాయి. ఈ విషయాన్ని శ్రీ సుప్రసన్న వారి ముందు మాటల్లో సోదాహరణంగా చూపించారు. బహుశః దీనికి కారణం వారు దీన్ని ప్రచురించేటప్పుడు పునః పరిశీలించక పోవడం కావచ్చు.

## భాష

ప్రజల భాషతో రాసిందే ప్రజాకవిత్వం. అంతేగాని ఏ ప్రజల కోసం వస్తువు నిర్దేశించిబడిందో ఆ ప్రజలకు అర్థంగాని భాషలో రాయడం వ్యర్థం. కాళోజి భాష ప్రజల భాష. వ్యావహారికంగా ప్రజల్లో ఉన్న పదాల్నే ఉపయోగించి కవితలు రాశారు. కాళోజి ప్రజల్లో వ్యావహారికంగా ఉన్న పదాలు హిందీవైనా, ఉర్దూవైనా, అంగ్ల పదాలైనా ఉపయోగించారు కాళోజి 'సలామత్' 'భాయీ భాయీ' 'పోలింగుబూతు', 'బస్సుసీటు','ట్రాక్టర్' 'బిజిలి' వంటి పదాలు నిరక్షరాస్యులకైనా సరళంగానే అర్థమవుతాయి. ఇలా సజీవమైన భాషను ప్రయోగించడం వల్లనే కాళోజి ప్రజా కవి అయినాడు.

## ఇతర రచనలు

కాళోజి కొన్ని కథలు కూడా రాశాడు. "కాళోజి కథలు" అనే పేరుతో ఓ పుస్తకం ప్రచురింపబడింది. ఈ కథల్లోనూ కాళోజి నైజాం పాలనలోని ప్రజల జీవితాల్ని వర్ణించాడు. ఇంకా 'తుది విజయం మనది నిజం', 'పార్థివయం' వీరి ఇతర రచనలు.

"నా భారత దేశ యాత్ర", "జీవన గీత" వీరి అనువాద గ్రంథములు. ఇందులో 'జీవనగీత' అనే అనువాద గ్రంథం కాళోజి అనువాద నైపుణ్యానికి చక్కని నిదర్శనం గ్రంథం. ఖలీల్ జిబ్రాన్ రాసిన 'ది ప్రాఫెట్' కు తెలుగు పేరు జీవన గీత. ప్రపంచంలోని అనేక ఉత్తమ భాషల్లోకి ఈ గ్రంథం అనువదించబడింది. అలాంటి ఉత్తమ గ్రంథాన్ని తెలుగు పాఠకులకు అందించటానికి కాళోజి చేసినకృషి సాటిలేనిది.

## ముగింపు

'ఒక్క చుక్క సిరా వేయి మెదళ్లకు కదలిక' అనే వీరి మాటలు తెలుగునాట నానుడిగా నిలిచిపోయాయి. ప్రజల నాలుకల మీద నిలిచిపోయే కవిత్వం రాసిన వేమన, కాళోజి ప్రాతః స్మరణీయులు.

"నా తపస్సు ఫలించి, నా గీతం గుండెలలో ఘూర్ణిల్లగ నా జాతి జనులు పాడుకొనే మంత్రంగా మోగించాలని" ప్రతి కవి కోరుకుంటాడు. అయితే అలా జాతి జనులు పాడుకొనే గీతాలు రాయడానికి కృషి చెయ్యాలి ప్రతి కవి. కొంత మంది కవులు వాళ్ల ప్రతిభ, కృషి వల్ల ఇలా కలకాలం జాతి గుండెల్లో నిలిచిపోతారు.

కాళోజి రాసింది తక్కువే అయినా ఎక్కువ పేరు సంపాదించుకున్నారు. కాళోజి వ్యక్తిగా మొహమాటంలేని మనిషి. ఎవరి మీదనైనా, దేనిమీదైనా వారికి కలిగిన అభిప్రాయాన్ని నిస్సంకోచంగా వెలిబుచ్చుతారు, మంచి ఎక్కడ ఏ కొద్దిగా కనిపించినా కాళోజి మెచ్చుకుంటారు. శ్రీశ్రీ గురించి చెపుతూ కాళోజి ఒక చోట,

"నువు రాసి పారేసిన కవితలు గుభాళిస్తున్నపుడు
నువు తాగి పారేసిన సీసాల కంపు మాకెందుకు"

అంటూ 'శ్రీశ్రీ వ్యక్తిగా ఎలాంటి వాడైనా శ్రీశ్రీ తెనుగు'వాడి'ని వాడే ప్రతిభ కలవాడు' అంటాడు.

జాతి గొడవను తన గొడవగా భావించి తన గళం వినిపించిన కాళోజి ధన్యజీవి. ఆధునిక తెలుగు సాహిత్య చరిత్రలో అభ్యుదయ కవిగా

ప్రజా కవిగా నిలిచిపోయిన కాళోజి ప్రజల ఎదల్లో నిగూఢంగా నిరంతరం నిలిచిపోయే ఉన్నాడు.... ఉంటాడు.

ఉదయం

కానే కాదనుకోవడం

నిరాశ

ఉదయించి

అట్లానే వుండాలనుకోవడం

దురాశ



# పాములపర్తి సదాశివరావు

పాములపర్తి సదాశివరావు

జననం: 1920
దేవునూరు: వరంగల్.

చిరునామా :-

ఫైర్‌స్టేషన్ ప్రక్క వీధిలో
మట్టెవాడ, వరంగల్ 506002

కాకతీయ వార పత్రిక సంపాదకులు
1944-46

చరిత్ర, కళ, సంస్కృతి
తత్వశాస్త్ర ప్రాథమిక పాఠాలు
భారతీయ సాహిత్య పరిశీలన
అభ్యుదయ గీతాలు

# పల్లేరు వీరస్వామి

పల్లేరు వీరస్వామి
యం.ఏ., బి.ఇడి.,

జననం : 25-3-1952
నాగారం, పరకాల

చిరునామా:-

ఇం, నెం. 3-68/2జి/1
పరకాల, వరంగల్లు 506164

ఉషోదయం (కవితా సంకలనం) సంపాదకత్వం

అముద్రితాలు :
పల్లేరు శతకము

# పాములపర్తి సదాశివరావు

ఆలోచనల నేస్తూ ఆచరణలలో అమలు పరుస్తూ ఆర్భాట పటాటోపాదులను తూర్పారబడుతూ, ఆడంబరాలకు దూరంగా మసలుతూ, ప్రాలుమాలకుండా సోమరితనాన్ని వదలి అనుక్షణం తన పనితాను సాగిస్తూ, ఎందరికో స్ఫూర్తి ప్రదాతగా నిలిచినా, కీర్తి కండూతి లేని విజ్ఞానమూర్తి పాములపర్తి. వీరిని సదాశివరావు అనడం కన్నా సదాశయరావు అంటే బాగుంటుందేమో!

మనిషి పీలగా ఉన్నా, మేలైన ఆలోచనలతో కార్యదీక్షాదక్షుడైనాడు. నిరాడంబరతతో దర్శనమిచ్చినా, లోకాన్ని తన మేధతో స్పర్శించడం, తన కలంతో నిజాల్ని, నిగ్గుల్ని వర్షించడం, ఉపన్యాసాలతో ఆకర్షించడం చేస్తారు.

వరంగల్లు (మట్టెవాడ)లో 1920 సం॥న జన్మించిన వీరు హన్మకొండ కాలేజెట్ హైస్కూలులో విద్యాభ్యాసం గావించారు. విద్యార్థి దశలోనే చురుకైన ఆలోచనలు గల్గిన చురుకైన విద్యార్థిగా గుర్తింపబడ్డారు. అప్పుడు హైద్రాబాద్ రాజకీయ వాతావరణం భయానకంగా ఉండేది. 'ఆజాద్ హైద్రాబాద్' నినాదాలు విజృంభించేయి. వాటికితోడు రజాకార్ల దౌర్జన్యాలు.

ప్రజల హా హా కారాలు మిన్ను ముడుతుండేవి. కదిలి అదిలించే మనస్తత్వం గావున విద్యార్థి దశలోనే జాతీయోద్యమ ప్రభావ ప్రేరితుడై ఇంటర్మీడియట్ స్థాయిలో కాలేజీని బహిష్కరించి నాగపూర్ లో తన చదువును కొనసాగించాడు.

ఆంధ్ర మహాసభ, గ్రంథాలయోద్యమం, ఆర్య సమాజ్ ఉద్యమాలలో పాల్గొని సాహిత్యం, కళలను ప్రోత్సహించారు. ప్రజలలో పోరాట స్ఫూర్తిని, దీప్తిని కలిగింపజేసారు. ఆనాటి పారతంత్ర్య దుర్గతిని యెదిరించుటకై అతివాదం అవసరమని నమ్మి స్వాతంత్ర్య సమరంలో అజ్ఞాత పోరాటానికి విద్యార్థులను, యువకులను మరెందరినో ప్రేరేపించారు.

1944లో ఓరుగల్లులో కాకతీయ కళాసమితి నేర్పాటు జేస్తారు. వార్షికోత్సవాలను బ్రహ్మాండంగా నిర్వహించారు. సాహిత్య కళా పోటీలను కూడ నిర్వహించి యెంచరో ఆనాటి యువకులకు ప్రోత్సాహాన్ని కలిగించారు. కాళోజీ నారాయణరావు, కాశీనాధం, వేంకట రామారావు, గార్లపాటి రాఘవరెడ్డి మున్నగు మహామహులెందరో కళా సమితికి బాసటగా నిల్చారు, భాగస్వాములైనారు. వీరు వరవిక్రయం, రామదాసు, మధుసేవ, ప్రతాపరుద్రీయం, తెలుగుతల్లి, చింతామణి మున్నగు ఉత్తమ నాటకాల్ని కూడ ప్రదర్శించారు.

సంగీత రంగాన్ని కూడ వీరెంతో అధ్యయనం జేస్తారు. ఎన్నో గాన సభలను నిర్వహించారు. ఆ కళామతల్లికి కైమోడ్పుగా యెందరో గాన విద్వాంసుల గోష్ఠులు నిర్వహించి అనేకులకు సన్మానాల నేర్పాటుజేస్తారు. ఆ విధంగా సన్మానింపబడిన వారిలో ద్వారం వేంకటస్వామినాయుడుగారు, బాల మురళీకృష్ణ గారు. పురాణం పురుషోత్తమ శాస్త్రిగారు, టి.టి. సీతగారు, పల్లవి పట్టాభి రామయ్యగారు, ముట్లుగు శివానందశాస్త్రిగారు, రూపావతిగారు, బాల సరస్వతిగారు, మున్నగు యెందరో విద్వాంసులున్నారు.

తెలంగాణాలో రెండవ తెలుగు పత్రికగా వెలుగొందిన 'కాకతీయ' పత్రికను నడిపిన ఘనత వీరికే దక్కుతుంది. ఈ పత్రికా నిర్వహణలో మాజీ విదేశాంగ శాఖా మాత్యులు శ్రీ పి.వి. నర్సింహారావు గారు కూడ వీరితో కలిసి పనిజేసారు. ఈ పత్రిక పోలీసు చర్యకు ముందు మూడేళ్ళు, వెనుక మూడేళ్ళు నడుప బడింది. ఆరోజుల్లో జనంలో చైతన్య స్ఫూర్తిని పెంచ

గలిగే రచనల్ని గుప్పించడం, అలాంటి రచనల్ని సమీక్షించి వాటి సందేశాన్ని జనంలోకి చొప్పించడం అనే ద్విబాధ్యతలు అంత సులభమైన పనులుగావు.

పోలీసు చర్య, అనంతరం కమ్యూనిస్టులను 'కనిపిస్తే కాల్చివేత' ధోరణిలో పోలీసు ఉత్తర్వులు జారీయైనాయి. నాటి మిలిటరీ అధికారులు ముష్కర కర్కశులు, నంజప్ప అనే అధికారి దారుణ మారణకాండను సృష్టిస్తున్న వేళ, జనం భయం భయంగా దయనీయంగా దౌర్జన్యాలకు బలియౌతున్న వేళ, తుపాకీ గుళ్ళకు గురి అవుతున్న వేళ, ప్రజలకోసం నేనున్నానని, ఆ రాక్షసత్వాన్ని మొండిగా యెదురొడ్డి జనంలో చైతన్యాన్ని దండిగా కలిగించిన ధైర్యశాలి, శ్రీ సదాశివరావుగారు. ఆ రోజులలో తెలంగాణా ప్రజల పౌర స్వాతంత్ర్యానికి కాకతీయ పత్రిక ఆందోళన సాగించింది.

శ్రీ పాములపర్తి సదాశివరావుగారు కొద్ది కాలం అభ్యుదయ రచయితల సంఘంలో పని జేసారు. వీరు చరిత్ర, కళ, సంస్కృతి, తత్త్వశాస్త్ర ప్రాథమిక పాఠాలు, భారతీయ సాహిత్య పరిశీలన, అభ్యుదయ గీతాలు, మరియు 1857లో జరిగిన గదర్ విప్లవం పై గ్రంధాలు వ్రాయడంతోపాటు జ్ఞాన సిద్ధాంత మనే మరొక ఉద్గ్రంధమును వెలువరించినారు. (పై సమాచారం శ్రీ టి. శ్రీరంగస్వామిగారి వరంగల్లు రచయితల వాఙ్మయ జీవిత సూచికలో లభ్యమైంది) కానీ, ఆ ప్రతులేవీ ప్రస్తుతం దొరకడం లేవు. వారు కూడా వాటిని భద్రపరచే పనిచేయలేదు.

వీరు చైనా దాడి సందర్భంగా "విశ్వజ్యోతి" పత్రికలో వ్రాసిన వ్యాసాలు అనేక పత్రికల్లో పునర్ముద్రణల ద్వారా విశేష ప్రచారంలోనికి వచ్చినవి. క్యూబా విప్లవం ముఖ్యంగా రెజిస్ డెబ్రీ భావాలు అనే రచనలను విశ్వజ్యోతి పత్రిక ద్వార ప్రచురించి విప్లవకారులకు మార్గదర్శనం గావించారని ఆ పత్రిక సంపాదకులు శ్రీ కె. నర్సింహారెడ్డి గారన్నారు.

నేడు ప్రప్రథమ సోషలిస్టు దేశమైన సోవియట్‌లో గోర్బచేవ్ నాయకత్వాన మన్నింపబడుతున్న కమ్యూనిస్టు పార్టీలోని ప్రజాస్వామ్యం, వ్యక్తి స్వాతంత్ర్యం అనే అంశాల్ని శ్రీ పాములపర్తి వారు "సందేశం" పత్రికలో 'వ్యక్తి స్వాతంత్ర్యం పై చర్చ' అనే రచన ద్వార అనాడే లేవనెత్తించారు. కానీ కొందరు నాయకులు ఈ ఆలోచనలను ప్రతిఘటించడం

లాంటి అనుభవాలు జరిగాయి. అప్పటి నుండి తాను పార్టీ రాజకీయాలకు దూరమవడం జరిగింది.

వీరు భాషా రాష్ట్రాల వాదనను బలపరచారు. విశాలాంధ్ర ఉద్యమంలో పాల్గొన్నారు. తర్వాత పెద్ద మనుష్యుల ఒప్పందానికి ప్రభుత్వం తిలోదకాలిచ్చిన సందర్భంలో దాని వివరాలను వెలుగులోనికి తెస్తూ, తెలంగాణా హక్కుల ఉద్యమం కోసం వారు వ్రాసిన ఒకే ఒక్క వ్యాసం ఓరుగల్లులోనే గాక తెలంగాణా అంతటా ముసురుకొని శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి వర్గాలను హడలెత్తించింది, గడగడలాడించింది.

వీరి కలానికున్న శక్తి గొప్పది. వరంగల్లు పురపాలక - సంఘం తొలియెన్నికలు జరిగే సమయాన కాంగ్రెస్ నాయకులను వీరు తన కలంతోను, ప్రజాబలంతోను తీవ్రంగా యెదుర్కొన్నారు. పౌర సంఘాన్ని స్థాపించి శ్రామిక శక్తుల ప్రతినిధుల గెలిపించుకున్నారు.

శ్రీ పాములపర్తి గారు ఉత్తమ జర్నలిస్టు. ఎన్నో పత్రికలలో వారి వ్యాసాలు ప్రచురింపబడ్డాయి. ప్రాచీన సాహిత్యంతో సహా, ఆధునిక వైజ్ఞానిక శాస్త్రాలైన ఎలక్ట్రానిక్ వంటి విషయాలు గూడ వీరికి పరిచయాలు. శాస్త్రీయ సంగీతం పట్ల అత్యంత అభిమానం ఉంది. యే విషయాన్నైనా సమూలమైన, సమగ్రమైన అవగాహనతో వివరించగలరు. వీరి కలం యెందరో మహా మహులైన రాజకీయనాయకులు, మంత్రుల రచయితల సభా ఉపన్యాసాల్ని తయారు చేసింది. ఎన్నో పత్రికల్లో రచనల్ని మెరుగులు తీర్చింది. అయితే ఆ కలానికి అనేక పేర్లున్నాయి. అసలు పేరు వెల్లడించడంలో ఆ కలానికి ఆసక్తి ఉండదు.

వీరు బహుముఖ ప్రజ్ఞాశాలిగా అనేక మంది పండితుల ప్రశంసలను చూరగొన్నారు. ప్రపంచ విజ్ఞాన రంగంలో గణుతికెక్కారు. పోతన ఉత్సవాలలో కార్య విధానాలను తీర్చిదిద్దారు. విద్యారణ్య విద్వత్ గోష్ఠిని నిర్వహించారు.

కార్మిక రంగంలోను శ్రీ సదాశివరావు గారి సేవ వుంది. ఆజం జాహి మిల్లు వర్కర్స్ యూనియన్ కార్యదర్శిగా ఆయన ఒక జయప్రదమైన

సమ్మెను నిర్వహించారు. చేనేత, గీత పారిశ్రామిక సహకార సంఘ ఉద్యమాలలో వీరి సాధ్య సలహాలు యెన్నో విజయాలకు దారులు తీసాయి.

తాను నమ్మిన దాని కోసం అవిశ్రాంతంగా శ్రమించడం, నిస్వార్థత తో పనిచేయడం వీరికి వెన్నతో పెట్టిన విద్య. వీరు ఆంధ్ర తెలంగాణాలలోని పలు జిల్లాలలో రాజకీయ శిక్షణా తరగతులలో పాల్గొన్నారు. కార్యకర్తలకు రాజకీయ పరిజ్ఞానాన్ని కలిగించుటకు ముందుకువచ్చారు. పీపుల్స్ డెమోక్రటిక్ ఫ్రంట్ (PDF), కమ్యూనిస్టు ఉద్యమాలలో నేరుగా పాల్గొన్నారు.

వర్ణాంతర వివాహాలను ప్రోత్సహించారు. మెడికల్ కాలేజి (వరంగల్లు)లో జరిగిన కొన్ని వర్ణాంతర వివాహాలకు వీరి ప్రోత్సాహం ఉంది. భూసంస్కరణల ఉద్యమానికి చేయూతనిచ్చి, భూసంస్కరణల చట్టం కొరకు ఆందోళన సాగించారు. "విశాఖ ఉక్కు ఆంధ్రుల హక్కు" అనే ఉద్యమంలో శ్రీ తెన్నేటి విశ్వనాధంగారితో కలిసి పని చేసి జైలుకు వెళ్ళారు.

ఉపాధ్యాయ ఉద్యమంలో పాల్గొన్నారు. వరంగల్ మహబూబియా ఉన్నత పాఠశాలను నెలకొల్పటంలో కీలకపాత్ర వహించారు. 'రాయిస్టు ఉద్యమం', 'మంత్రుల ఆడంబర వ్యతిరేక ఉద్యమం' గోపరాజు రామచంద్ర రావు గారి 'నాస్తికోద్యమం' లాంటి కొన్ని ఉద్యమాలను వీరు బలపరిచారు.

శ్రీ రావు గారు పౌరహక్కుల పరిరక్షణకు అగ్రగామిగా నిలిచి మానవ హక్కుల కోసం నిరంతరం కృషి చేస్తున్నారు. వ్యక్తి స్వాతంత్ర్యం కోసం పాటుపడుతూ, అవినీతి, అన్యాయాలకు వ్యతిరేక పోరాటాలను సర్వదా బలపరుస్తూ తమ రచనల ద్వారా, సలహాల ద్వారా, బహుముఖాలుగా ప్రోత్సహిస్తున్నారు.

పౌర హక్కుల అమలును ఉల్లంఘించే ప్రభుత్వ ధోరణి అజ్ఞాత ప్రజా పోరాటాలకు, హింస ప్రతి హింసల దారుణానికి దారి తీస్తుందని వీరు చెబుతూ ఉంటారు.

"ఐక్యరాజ్య సమితిలో అమలయ్యే అధికారిక పద్ధతి బూటకం, అది ఆచరణలో విఫలమై ప్రజా విశ్వాసాన్ని కోల్పోతుంద"ని వెక్కిరిస్తారు.

"వ్యక్తికి భావ స్వాతంత్ర్యం అవసరం, అది షరతులతో కూడుకొని ఉండరాదు. ఆత్మ సంబంధమైన స్వాతంత్ర్య అభివ్యక్తిగా ఉండి, అన్ని రంగాలనూ ఆవరించే అవకాశం గుర్తించబడాల"ని ఉద్బోధించారు.

"ఇజాలను తెలుసుకోవడం అవసరమే, అయినా రాజకీయ పార్టీలు వాటిని అమలుపరచవు. కాబట్టి ఆ పార్టీలను ప్రజలు అదుపు చేయడానికి అవకాశం ఉండాలి. అలాంటి ప్రజా ఉద్యమాలు అనివార్యం" అంటూ భావిస్తారు.

నేటి పత్రికలు కేవలం వ్యాపార పత్రికలైనాయి. అనేక రంగాల్లో అవి సంక్షేమ విలోకనను సరిగా ప్రతిఫింబించలేని స్థితిలో ఉన్నాయంటూ పత్రికాలోకాన్ని యీసడిస్తారు.

కవిత్వం ద్వారా సమాజం మారదు. కవి సమాజానికి అతీతంగా కూడ చూడగలిగాలి. సాహిత్యంలో మానసిక జీవనం– దాని అనుభూతి వివరణ అనే మానవతా దృక్పథానికి ప్రాధాన్యత ఉండాలి అంటూ విశ్లేషిస్తారు.

ప్రజల సమస్త జీవిత రంగాల్లో వ్యక్తుల ఆత్మవిశ్వాసం, స్వతంత్ర్య స్వచ్ఛంద పాత్ర, కార్యకుశలత అనువాటికి గుర్తింపు పెంపొందాలనేది వీరి ఆశయం

పేదరికానికీ, యేకాకిత్వానికి, త్యాగాలకు ఆయత్తం కాలేని స్వార్థపరత్వ శక్తులు సంఘ శ్రేయస్సును సాధించలేవని వీరు విశ్వసిస్తారు. పాలక వర్గ పోషణ యెపుడూ స్వాతంత్ర్య విస్తరణకు ప్రతికూల పాత్రకే దారి తీస్తుందని వీరి అభిప్రాయం. రాజకీయ పార్టీలు సామూహిక భావాలలోనూ, పార్టీ ఉద్యమాలలోనూ, ఎన్నికల సంరంభంలోనూ సాంఘిక వాస్తవ గుర్తింపు 'మిధ్య'మాత్రమేనని వీరు భావిస్తారు. సాంస్కృతిక చైతన్యానికి ఎక్కువ ప్రాధాన్యత నిచ్చే విధాన అనుసరణ కొరకు కృషి జరగాలని అభిలషిస్తారు.

పరిపాలనా వ్యవస్థకు ప్రజామోద ప్రణాళికా కార్యక్రమాలలో ప్రజల చొరవకు అవకాశం ప్రాధాన్యత చెందడం అవసరమని వీరి ఉద్దేశ్యం;

సంకుచిత తత్వంతో గాక విశాల దృక్పథంతో అన్వేషణాత్మక ఆచరణ ద్వార మాత్రమే అభివృద్ధి సాధ్యపడుతుందని వీరు స్వాతంత్ర్య శీలతను వ్యాఖ్యా నిస్తారు. పై విధంగా తమ ప్రత్యేకమైన విలోకనతో వారు జీవితాన్ని జీవిత, సమస్యలను అర్థం చేసికొనడానికి ప్రయత్నిస్తారు.

కేంద్ర ప్రభుత్వం వీరి సేవలను గుర్తించింది. దేశంలో జాతీయో ద్యమ కాలంనాటి సాంస్కృతిక రంగంలో కృషి చేసిన కొలది మంది ఉత్తమ వ్యక్తులలో వీరిని గుర్తించి వీరికి గౌరవభృతి సౌకర్యాన్ని మంజూరు చేసింది.

ఏకశిల ప్రతిభాపాటవాలకు, సాహిత్య సంస్కృతికి ప్రతిబింబంగా నిలిచిన వీరి రచనలన్నీ ముద్రణలో వస్తే నవతరానికి ఉపయోగకరంకాగలవు. ప్రభుత్వం కాని, విశ్వవిద్యాలయాలు కాని ఈ పనిని చేపట్టవలసి ఉంది అప్పుడే సదాశివరావుగారి సదాశయాల్ని గౌరవించినవారం అవుతాం.



# చిలుకమఱ్ఱి రామానుజాచార్యులు

కీ॥ శే॥ చిలుకమఱ్ఱి రామానుజాచార్యులు

జననం : 24-10-1924

మరణం : 24-10-1967

జఫర్‌గడ్, వరంగల్లు,

ముద్రితాలు :

కళ్యాణ రాఘవము

స్తోత్రాంజలి

మధురవేదన

గీతాంజలి

# యం. వరదాచార్యులు

ముడుంబై వరదాచార్యులు
యం.ఏ., యం.ఓ.యల్.

జననం : 15-6-1941

ఇ. నెం. 1-686
వర్ధన్నపేట, వరంగల్లు-506 132

ముద్రితములు :

వరదరాజ శతకము
సవిత-1 కవితా సంకలనం సంపాదకత్వం
సవిత-2 ,,
దర్పణం ,,

అముద్రితాలు :

కరావలంబ స్తోత్రం (తెలుగు అనువాదం)
మానవత ఖండకావ్యం
పాఖాల చరిత్ర పద్యకావ్యం

# చిలుకమఱ్ఱి రామానుజాచార్యులు

ఓరుగల్లు నగరంలో సరస్వతీ పాద మంజీర ఘలంఘలల విన్యాస పరితోషకమైనరోజు 22వ ఏప్రిల్ 1960. శతావధాని హరిరామలింగశాస్త్రి, విశ్వనాధ వేంకటేశ్వర్లు, హరి రాధాకృష్ణమూర్తి, వై.కె. శాస్త్రి, భండారు సదాశివరావు, అంబటి లక్ష్మీనరసింహరాజు మున్నగు కవి పండిత ప్రకాండ మండిత సభారంగము, రసిక శ్రోతృజన సభా కల్పతరు విభాసిత మనోహరము. అట్టి సభావేదికపై ధోవతి లాల్చి ధరించి, ఉత్తరీయపక్కంధుడై, తిరుమణి శ్రీచూర్ణ విలసిత ఫాలుడై శుద్ధ శ్రీ వైష్ణవరూపంలో బక్క పల్చని ఆరడుగుల విగ్రహం అష్టావధానం చేయడానికి సంసిద్ధంగా ఉండటం, కొందరికి ఆనందాహ్లాదాలను, కొందరి సందేహ సందోహాన్ని, మరికొందరికి సంతృప్తిని కల్గించింది. ఆయనే శ్రీమాన్ చిలుకమఱ్ఱి రామానుజాచార్యులు గారు.

వీరు కాకతీయ రాజధానియగు వరంగల్ నగరమునకు సుమారు 25, 30 కి.మీ. దూరంలో చారిత్రక ప్రసిద్ధినందిన జఫర్గడ్ (పేల్పుకొండ) గ్రామమున 24 అక్టోబర్ 1924 సం॥రన నర్సమాంబా లక్ష్మణాచార్యుల ప్రథమ సంతానముగ జన్మించినారు. సంస్కృత ప్రాథమిక విద్య తమ పెద

తండ్రిగారి వద్ద పూర్తిచేసుకొని, రజాకార్ల దురంతాలను తట్టుకొని యాదగిరిలో సంస్కృతాంధ్ర విద్యాభ్యాసం కొంత వరకు ముగించుకొని హైద్రాబాదు నందలి సీతారాంబాగ్ సాహిత్య, తర్క, వ్యాకరణ వేదాంత శాస్త్రములో అధ్యయనం చేసినారు.

సాధారణంగా అధ్యయన కాలమందు ఏదైనా ఒక శాస్త్రాన్ని అధ్య యనం చేయడానికే ఆచార్యులు అనుమతినిస్తారు. కాని వీరు పై పేర్కొన్న శాస్త్రాలన్నిటిని ఆయాచార్యుల వద్ద ప్రతిరోజు పాఠప్రవచనం చేయించుకునే వారు దీనితో వీరి మేధా సంపత్తి ఎంతటిదో అర్థమౌతుంది. ఆ రోజుల్లోనే హైద్రాబాదు నగరంలోని కవి సమ్మేళనాలలో పాల్గొనేవారు. వీరికి దేవులపల్లి రామానుజరావుగారితో సన్నిహిత పరిచయమేర్పడింది.

విద్యా పరిపూర్త్యనంతరం తండ్రిగారితో వంశపారంపర్యంగా వచ్చిన శిష్య సంచారము చేస్తూ కొంత కాలం గడిచిన పిదప ఆర్థిక ఇబ్బందుల కారణంగా వరంగల్లులో నివాసమేర్పరచుకొని సింహాద్రిబాగ్ సంస్కృత పాఠశాలలో ఆంధ్రాధ్యాపకులుగ నుండి ఆంధ్ర సారస్వత పరిషత్పరీక్షలకు విద్యార్థులను సిద్ధ పరచుటలో ప్రత్యేక శ్రద్ధ చూపినారు (నేనప్పుడక్కడ విద్యార్థిని). పిదప కొంత కాలానికి తెలుగు విశారదతో ప్రభుత్వోద్యోగమున ఆంధ్రాధ్యాపకులుగ పాపయ్యపేట చమన్ వద్ద నున్న మట్టెవాడ ప్రభుత్వ పాఠశాలలో నియమించబడినారు. ఉద్యోగం చేస్తూ ఉస్మానియా వారి తెలుగు సంస్కృతాలలో B O L. పట్టము సంపాదించినారు. ఈ మధ్యకాలంలో వీరు చాలా కష్టములనెదుర్కొనినారు. భార్యకు స్ఫోటకము. 'మిమ్మల్నందర్ని ఏం చేస్తానో చూడండంటూ భీకరంగా మాట్లాడటం' లాంటి చర్యల వల్ల వీరి నిత్య పూజా కార్యక్రమాలకాటంకం చూచి విశ్వనాథ వేంకటేశ్వర్లు గారు మేరుతుల్యంగా నిల్చి ఆర్థిక, ఆధ్యాత్మిక సహకారాన్నందించినారు. అయినా ఇంట్లో వారందరు భీతావహులై కొన్ని వారాలు నిద్రాహారాలు లేకుండా గడిపి నారు. పిదప కొన్ని రోజులకు ఆమె (నర్సిన్నమ్మ) మరణించింది. కర్మ కాండ పూర్తియై మోక్షకాండ నిర్వహింపబడు రోజు మధ్యాహ్నం వరకు యాదగిరి దేవస్థానం నుండి వీరికి రావలసిన సన్మానం రూ. 50-00 అందినవి. ఇది వారిని చాలా కలచివేసినది. అయినా భగవన్నిర్ణయంగా దాన్ని తీసుకొని అధ్యాపకులకిచ్చి సంతృప్తి పడ్డారు.

"నాకు ఛందస్సు గురించి కొన్ని నమ్మకాలున్నవి నేను యాదగిరి స్వామివారి బ్రహ్మోత్సవాలలో చదివిన పద్యాలలో అప అక్షరం "త" కారం (ఊగుతాగుగాత) వచ్చి నాకీ స్థితి కల్గింది. అందువల్ల పద్యరచనా విషయం లో నీవు చాలా శ్రద్ధవహించాల్సి ఉంటుందని నాకు (వ్యాసకర్తకు) తెల్పినారు. పిదప 1960లో ద్వితీయ వివాహం జరిగింది.

ఈ విషయాన్నే "కళ్యాణ రాఘవం"లో "మహాపదల్ గవిసెదైన్యాశం బోధిమగ్నున్ననున్" అని తమ అష్టావధాన ప్రారంభంలో 'పెక్కు చిక్కులుం దరిని కలంచెచిత్తము'నని వైవాహికక్రియావ్యగ్రభావ మొకట యాచనాదైన్య మహోగ్ర బాధ మొకట జననియు జ్వరితయై యుండుటొకటని బాధాతప్త హృదయంతో తెల్పినారు.

'అపర పెద్దన', 'బాలసరస్వతీ' బిరుదాంకితులై అభినవపోతన వాస మామలచే పొగడొందిన చిక్కపల్కులుగల చిలుకమఱ్ఱి వారి అమృత లేఖిని నుండి జాలువారిన కావ్యములు ప్రధానముగ నాలుగు.

1. కళ్యాణ రాఘవము (1960)
2. స్తోత్రాంజలి (1966)
3. మధుర వేదన (1967)
4. గీతాంజలి (1968)

ఇతఃపూర్వం వీరొక 'బుద్ధ కథను, వీరపత్ని' అను కావ్యమును గూడ రచించి నట్లు ప్రతీతి.

'కళ్యాణరాఘవము' వీరికి కీర్తికి పతాక. "ఈ ఒక్క కళ్యాణ రాఘవంతో నేను ఇహ లోకంలో శాశ్వతుడినైనాను. ఇక నాకు ఏ కోరిక లేదు. స్వామిసాన్నిధ్యం తప్ప" అని అప్పుడప్పుడు నాతో అనేవారు. అంతే గాదు తమ ఇంటిలోని శ్రీ నృసింహస్వామి పటము ముందు నిలబడి ప్రతిరోజు ప్రార్థించేవాడు. వీరి ఆధ్యాత్మిక జీవితం చాలా విచిత్రమైంది. ప్రతి రోజు వాల్మీకి రామాయణం పారాయణం చేస్తూ కన్నీరు కారుస్తు అట్లాగే కొంత సేపు కదలక ఉండే వీరిని తల్లిగాని నేనుగాని కదిలించి మందలిస్తే అదోరకంగా,

చూచేవారు. కారణమడిగితే ఏంలేదు ఆ రామ సౌందర్యం నన్నిట్లా
వారు. ఒకసారి వీరు యం.జి.యం. ఆసుపత్రి వరంగల్లులో ఉన్న
పర్మాజీగారు వచ్చి "మీరేమీ ఆలోచించకండి, మీ ఆరోగ్యం మా
విశ్రాంతిగా ఉండండని చెప్తే పైన తిరిగే ఫ్యాన్ వైపు చూపుతూ
ఫ్యాన్ ఆపుచేయడానికి స్విచ్ బందుచేస్తే వెంటనే ఆగుతుందా చెప్ప
డా॥ పర్మాజీగారు నవ్వి ఊరుకున్నారు.

'కళ్యాణ రాఘవం' వీరి కీర్తికి పతాకమని ఇదివరకే
కున్నాము. 1959 సం॥ముపిబ్రవరిలో తిరుపతి వేంకట కవుల వర్ధంతి
అధ్యక్షులుగ వచ్చిన కాటూరి వారు ఇందలి పద్యాలు విని ఆనందించి
బచ్చు వేయించెదన్, ధనమెంతేనిడి అంకితంబడుగ" నన్నారట.
వేంకటేశ్వర్లగారితో మొత్తం మీద పుస్తకం 1960లో త్రివే
మచిలీపట్నంలో భావరాజు నారాయణరావు గారి అధ్వర్యంలో ప్రిం

ఇందలి ప్రధాన కథ సీతాకళ్యాణం ఇది సర్వజనజ్ఞాత
ఈ రచనెందుకని ప్రశ్నకలుగుతుంది. దీనికి సమాధానం పీ
పింగళి వారి మాటల్లో దొరుకుతుంది.

"కావ్యంలో సౌందర్యం శబ్దగతమా, అర్థగతమా, రీ
ఔచిత్యగతమా, భావగతమా, భావనాగతమా అని పరిపరి ప్రమా
నిరూపించే ప్రయత్నం చేయాలి.... ఈ సంప్రదాయానుసారంగా ఈ
చదవగ పై గుణములు ఒక్క బోరాశీభూతమై.... విడదీయుటకు వీ
నిబిడీకృతమై అఖండ జ్యోతిగా వెలుగొందినది. కనులకు మిరుమిట్లు
దీనికి పీఠిక వ్రాయననడానికి కారణం కాటూరి వారితో ఆక్స్ఫర్డ్ వి
యంలో.... కీత్ ఉత్తర రామచరిత లోని సీత పాత్ర్రితడవి. "T
racter is the real dose not submit it self to analysi
విమర్శ వివేచనకు అందదని నమస్కారం చేశాడట. ఈ కళ్యా
ఆ జాతి కావ్యం అని తెల్పారట. దీని వల్ల ఈ కావ్య నిర్మా
వైభవం మనకవగతం కాగలదు.

ఇక ఈ కావ్యం "ఆదికవి గంటపు మ్రోత పెంచుచు
మంజువచః ప్రసూన గుచ్ఛమ్ములనేరియేరి కడు చక్కగగూర్చిన

హారం'గా తీర్చబడింది వాల్మీకి వాగమృతంబనివచించినది"

ఇట్టి కావ్యాన్ని 'నీకంకిదమిద్దిరామ! నిరుపమధామా!' అంటూనే వచ్చిరాని పలుకుల వినిచెదనని' వినయంతో 'ఈవెలమితోన వినవలెనావేలుప సీతలేత నవ్వులలోనన్' అంటూ రామానుజీయ వైభవ గుభాళింపులు విసరి రామాంకితంచేసి జన్మ సార్థకం చేసుకున్నారు.

'చిన్నమిరియమునందు చెడునెకారంబు' అన్నట్లు ఆకారం చిన్నదైన భావగాంభీర్యధుర్యము.

లోకంలో అధర్మం పెరుగుతున్నది. రాక్షసత్వం చెలరేగుచున్నది. ధర్మాతిక్రమణం లోక హానికరం, అని తలచి తమ సమకాలంలో జరుగుచున్న అధర్మాదులనరికట్టడానికి, లోక శివేతర క్షతము చేసి, వ్యవహారదక్షతను, రక్షను కల్గించు మహా కావ్య రచన ధ్యేయంగా పెట్టుకొని "ఆత్మానం మానుషంమన్యే" అని అనటమేగాకుండ 'పేదసాదలను గూడి కలిసి మెలిసి ఆడుకొని దుర్జన ధ్వాంత సంతతుల దుష్టులను, రావణాదుల నశింపజేయు బాలార్క బింబ ప్రతి రూపమగు సీతారామనామకమగునిది తగునని యెంచి కావించిన కావ్యారంభము ఎంత మాహాత్మ్యము గలదో చూడండి.

"శ్రీ లూరించెడి శాంతి భద్రము లులంజెన్నారుకన్, సత్కృతుల్
సాలంబంబులుగాత, సాధుజన రక్షైకావతారంబు శ్రీ
లోలంబౌ నొక వెల్గు నమ్మత మహాలోకంబు, నిర్భికముల్
కేళీ చంక్రమణోన్నమచ్చిరములన్ గేరించుతన్ ధర్మవుల్"

అనయమ్ముంద్రిజగమ్ము లేర్చెది పులస్త్య బ్రహ్మవంశాటవీ
జనితాభీల దవాగ్ని నార్పుటకు భాస్వద్గోత్ర లీలావతా
రనిరూఢంబగు నీల మేఘమదిగో క్రిమ్మెన్ నెమళ్ళాచున
ర్తనముల్ సేయుడు సాధులార! శుభగీతస్ఫీతకంఠంబులన్"

ఇందలి 'వంశాటవీ జనితాభీల దవాగ్ని' వెదురు వనంలో (వంశం) పుట్టిన అగ్ని దాన్నే సమూలంగా నాశనం చేస్తుంది. అట్లే "పులస్త్య బ్రహ్మ వంశాటవీజనితాభీలదవాగ్ని రూప" రావణుడును అంతే. రావణ సంహారం

జరిగినగాని ధర్మరక్షణ జరుగదు. ఆ దవాగ్ని నార్పడానికి నీల మేఘం అంటే నీలమేఘశ్యాముని అవతరణం జరిగింది. అందుకే (మునులు, సజ్జనులు) సాధులు నెమళ్ళై ఆడాలి పాడాలి అంటే ధర్మస్థాపనం తప్పక జరుగుతుందని సూచకము.

"రాజను పేరేగాని మునిరాజులకేనియు నొజ్జ బంతియై రాజను వాని వృత్తి' అని గాధిజుని అశంశ పొందిన జనక రాజు సైతం సీత నత్తవారింటికి పంపుచు ఆమెకు తాను చేసిన మంగళా శాసనం ధర్మనిర్వహణా విషయక రాజ శాసనంలాంటిది.

> "భావికుల సతులెల్ల నీజీవితంపు
> టద్దముననిండు చెలువముల్ దిద్దుకొనగ
> వసుధపతి దేవతామహత్వ శిఖరమున
> దివ్వటీయెత్తనిమ్ము నీ దివ్య కీర్తి"

ఇక గాధిజుడో "రామా నీ కళ్యాణము త్రిలోక కళ్యాణముగా నెంచుకొంటిని, ధీనరక్షా విధిశ్రీకి పట్టము కట్టుకొమ్మని" ఆశీర్వదించి రామునకు చెప్పిన సుద్ది ధర్మ కంటక దుష్టజన శిక్షకుడవై నీ ధర్మ కార్య నిర్వహణ మరువవద్దు సుమా! అన్న హెచ్చరిక సార్వకాలీనము, సర్వజన సమాదర ణీయము సమాచరణీయమున్ను.

> "కంకణము దాల్చి ధర్మరక్షకు గడంగ
> మరచిసుడిగొని యర్థకామములమున్గ
> దంపతుల్ లేరె అంకెలుదాటిపోవ
> ఫలమదేమినెలకొకింతబరువుదప్ప"

ఇదెంత గంభీరభావ స్ఫోరకమో పాఠకులే గమనించాలి. ఇక చివరి వాక్యం చర్నాకోల దెబ్బలాంటిది.

ఇది తిక్కనగారి

> "కొడుకులంగాంచు రాచికూతుఠెద్దానికి... .......
> ...............అట్లుగాని పురుషులనరు మిమ్ము"
> అనే కుంతి మాటలు గుర్తుకుతెస్తుంది.

జీవన మహత్వాన్ని తెల్పుచు జీవితమంతా ధర్మార్థమే అందలి ఆశ్రమాలన్ని పనవాటులే. అందును గృహస్థాశ్రమము రమ్య పనవాటి యది. ఇదెంతటి మనోహర భావగుంఫిత రచనో సహృదయులు గమనింతురుగాక అపర పెద్దన గదా పెద్దను గుర్తు చేశారు. 'కెలకుమన్న తంగేటి జున్ను....'

ఇక సీతామాతకు గాధిజుని ఆశీస్సు ఎంతటి ధర్మభావగర్భితమో అవధరించండి.

> అవని జా! వీర పత్నీత్వమధిగమించి
> కర్కశములగు సంసారకంటకముల
> నుద్ధరించి త్రిభువనీ ప్రసిద్ధిగాంచి
> కమ్మనెలతల తలమానికమ్మనీవు

జనక కుశిక సుతాశీస్సులలో సామ్యమున్నది. అందును ఇందును ధర్మ రక్షణ బాధ్యతా నిర్వహణమే.

'కర్కశములగు సంసారకంటకములు' సీతామాత తానీ లోకంలో అడుగిడడానికి కారణం గుర్తుచేస్తూ

> యదిత్వం ప్రస్థితో దుర్గంవన మద్యైవ రాఘవ
> అగ్రతస్తే గమిష్యామి మృద్నంతీ కుశకంటకాన్

పల్కిన యీ శ్లోకం గుర్తుకు రాదా!

తాను ముందు లంక చేరితేగాని రామాగమనం కాదు. అప్పుడే రావణ సంహారం. ఆయితేనే సాధులు నెమళ్ళై నాట్యంచేసేరు ధర్మం కేళీ చంక్రమణం చేసి గేరింతలు కొట్టదుమరి. ఇట్లడుగడుగునా ధర్మరక్షణ, ధర్మాచరణమే మానవ ధ్యేయమని బోధించిన యీ నవ కావ్యహారం సుజన గళహారం కాదా!

ఇందలి రాముడు ధర్మవీరుడు, మౌన ధీర గంభీరమూర్తి హావ భావాలతో అతి లోక వీరత్వస్ఫూర్తి చూపరులకు గల్గించు మహోన్నతుడు. ఈ కావ్యంలో రామ భద్రుడు మాట్లాడింది రెండే రెండు పర్యాయాలు. లక్ష్మణు

వసలే (మాట్లాడలేదు) పెదవి విప్పలేదు. ఉర్వి నిర్వీరమనుచు నిట్టూర్చిన జనకరాజును చూడగనే 'నూగు మీసములెగదువ్వ నేగు కరము' లక్ష్మణుడు బిగి బట్టుకున్నాడట కాని 'రాముని భుజశిరముల పొంగు దాగలేదట' అలతి అలతి పదాలతో వీర రసస్ఫూర్తి కల్గించడం సుకవిసాధ్యం. అప్పుడు గాధిజుతో పల్కిన మాటలు రాముని వినమ్ర వీర రూపాన్ని కనులగట్టిస్తుంది,

> "ఏమేమీ ఒకవింటినెత్త మగవాడే యుర్వి లేడో? స్ఫుర
> న్నామంబౌ రఘువంశ మెవ్వరి యెడుందండట్టలేదో? మహ
> ర్షీ మీ శిష్యుల కానతీయ వలె నేడే నింగిపై క్షాత్రతే
> జో మాంగల్య పతాక పాతికవలెనంచున్ రాముడుత్సాహిగాన్॥"

శివధనుర్భంగానంతరం ఋషి 'నాదు ప్రతిన పాటికెక్కింప నెటు శ్రమపడితివోయి! మరపురానిది నీ విక్రమ స్ఫురణమ'నగానే పల్కిన మాటలలో వినయత్వస్ఫూర్తి భాసించింది.

"మహాత్మా! మిముబోంట్ల దీవెనల్, పొనరిచెగాక, యేనునొక ప్రోడనె.......
ఇద్ది భీతులన్ మనుపుటొ, దుండగీంద్ర పొచమాపుటొ దిక్కులు (దీవులని కవి యభిమతం) గెల్చి పోల్చుటో" (ఈ రెండు పర్యాయాలే రాముడు మాట్లాడింది)

వింటిటి పెట్టెను చేరపోయే రాముని మూర్తి వీరశృంగారాల సమ్మేళన సమ్మోహకము.

> "అల్లలాడెడి కాకపక్షశితోడు
> నగవులో బీరమొలుకు నెమ్మనముతో
> వడినెగడుగన్న యేనుగు
> నడలతో పుడమి జవ్వాడి నడట"

ధనువునెత్తు రఘుబాలుని వీర కళామూర్తి సహృదయ హృదయార విందస్థిరత్వము నొంది నిల్చునది.

"అయెడ నీల నీరజ దళాంతర కాంతి పెలార్చు లేతనౌ
వైమర మేను ముందునకు వ్రాలిచి, చెంగలువల్ హసించుకేల్
డోయి రవంతసాచి, తృటిలోన చటుక్కనుక్కపెట్టె కి
ల్వాయగ మూత విప్పె రఘు బాలుడు వీర కళావిశాలుడై"

గణిలు గణిల్లునం కదలు గంటలకూన్ ముఖవాటి తల్లడి
ల్లిన గతి దోవ దాశరథి లీల మెయంగయి వెట్టిపట్టివిల్
గొని వెలికెత్తి మధ్యమున గూర్చిన ముష్టిని తూచి యూచి రి
వ్వున యరత్రిప్పు ద్రిప్పి పద భూమి మొదల్ గనియన్ కణవలం
బనమిడి చక్కనిల్పెను సభాజన భాజన విస్మయంబుగన్"

రామలక్ష్మణులకాచార్యత్వము వహించిన గాధేయుడు వశిష్ఠ జనకాదులు సీతారాములందుదైవీయ (స్థితిని) సౌందర్యముగ్రోలిన సార్థకజన్ములు

"నిగమ చోరకువాత ........"ఇత్యాది అవతారవర్ణనమున

శ్రీరాము వికసిత సిత పద్మలోచనములు జూచి సవితృమండలముజూ

(ఇది 'ధ్యేయస్సదాసవితృ మండల........'తలపించును)

"సీత కాదా పెనిన్ జేరు జీవకళిక, ఇటను 'తలపబడనివియ్యి తమ

రాకతోన నా యజ్ఞఫలము వచ్చినట్టులయ్యె' నను జనకుని మాటలందును,

మాకు యీ కూనలకెన్ని జన్మల ఋణమ్మొ' ఇత్యాది విశ్వామిత్ర స్వగతమందును వారి దైవత్వ మహత్వము ద్యోతకమగును.

ఆచార్యుడైన విశ్వామిత్రుని పాత్ర మాటలకందని అత్యున్నతము, అతిపవిత్రమునైనది. పరమాత్మ కళ్యాణకర్తయైన గాధితనయుని నుతియింప ఘనుడెవండ"ని నమస్కారం చేస్తాను.

అమ్మవారు లేకుండ స్వామి ఒక్కడే ఉపాధేయంగాదు గనుక గాధేయుడు రామభద్రుని అమ్మవారితో సహదశరథునకు కనులలో బెట్ట ఇన్నాళ్ళు గాచి యిదిగో నీ సుతుల నీకు నప్పగించితినని" అప్పగింతలు చేసి సీతారాముల మూర్తుల మనోజ్ఞమున నిల్పుకొని మరపురాని చుట్టమై అరిగిన విశ్వామిత్ర పాత్రనాన్యతోవర్ణనీయము.

వేదవతీ చరిత్ర, అహల్య బండబడుట, మున్నగు అవాల్మీకాంశాలు కావ్యశోభాహేతువులైనవి. ధూళి రూపంలో అల్లునిచెల్వు చూడ నేగే క్షితికాంత కృత్యాది అపహ్నవశ్లేషాదులు భూషణములై భాసించినవి.

"ముదితగతిని జేరే మొదట
రాజక మదిపాణి పీదనైక పరవశమున
ముదితగతిని జారె మొదట
రాజక మదిపాణి పీదనైకపరవశమున"

(ముదితగతి = సంతోషము, స్త్రీ) లాంటి పద్యాలు పెద్దన గారి "అపరిమితాను రాగసుమనోలసయై...." పద్యాన్ని తపిస్తూ ప్రబంధ పరిమళాన్ని గుబాళించినది.

ఓజః ప్రసాద మాధుర్యగుణయుతమై, ప్రబంధ కావ్యలక్షణ ప్రకాశితమై, జాతిరత్నములు పసిడి గూళ్ళ పొదిగిన పల్కులుగలది యై రామ పదారామమై విలసిల్లిన కళ్యాణ రాఘవ కావ్యము అతిలోకమైన అఖండ జ్యోతియనుట సహజోక్తియే.

చిలుకమర్తి వారి కావ్యాల్లో విషయ వైవిధ్యం ఉన్నా అంత స్రోతస్సుగా ధర్మాచరణము, ఆధ్యాత్మికత ప్రవహిస్తుంటుంది ''మేనుగలయంతకున్ విషయానువృత్తి సాగుటయె తప్పదిందువ'' యని 'నీ పయింగలనమ్మిక మాప జూచు ఘటనలుం గూడ నీ చిత్రనటనగతులె' అంటూ 'నీలి మేఘమువోలిన నీదు రూపు పరచు కొందును జీవితాంబరమునందు' అని ఆనందంతో 'కరుణాధుని శ్రీరమణి' నారాయణా నమస్కారమిదిగో' నంటూ సర్వం శ్రీకృష్ణార్పణమస్తు అనే సహజ తత్వం గల ఆచార్యుల వారి స్తోత్రాంజలి "అహో కనకస్య సౌరభ సంపత్తిః" అని మద్రాసు రాష్ట్ర సంస్కృతాస్థాన కవి, వైయాకరణ పంచాననులగు కె.యస్.కృష్ణమూర్తి శాస్త్రి గారు, వీరిలో 'ఉదాత్తమగు ప్రతిభా సమృద్ధి, అందుకు తగ్గ సరసనిరపద్య పద్యవిన్యాస కౌశలము రెండును సరితూగియున్నవని కవితార్కిక సింహ (కేసరి) శ్రీమాన్ న.చ. రఘునాథాచార్య స్వామివారి ప్రశంసబందిన యీ గ్రంథాన్ని శ్రీ వేల్పుగొండ దేవస్థాన పునరుద్ధరణ కమిటీ వారు 1966 సం॥ ముద్రించినారు. ఇదియు నృశింహాంకితము. ప్రతి పదమందును భగవద్రూపము గోచరించును.

"త్వద్వీజనాయ.... ....' శ్లోకము"

"భీషాస్మాద్వాతఃపవతే, భీషోదేతిసూర్యః"అనే ఉపనిషద్వాక్యాన్ని

"రాత్రౌ సురాముని వరాః...." ఈ శ్లోకం క్షేత్ర మహాత్యాన్ని వివరిస్తుంది.

భగవంతునకు తనయందున్న గుణ దోష సమర్పణ చేయుచూ ఇహ లోకజీవనానికి ఎన్నో ఒడుదొడుకులకు లోనై దేవుని మరచి విఱ్ఱవీగడం మున్నగు భావాలతో డోలాయమాన మనస్కుడవడం వల్ల తన్నుద్ధరించమని అచ్యుతస్వామిని వేడుకోవడమే ఇందలి విన్నపము. చక్రలదండ, లక్ష్మి స్తుతి, వీరి ఆంధ్ర రచనా పరిపుష్టికి తార్కాణాలు. ఇందు భగవద్గీత, వేదాంతము, శ్రీ భాష్య పరమైన అతి నిగూఢ విషయములు వివరింపబడినవి.

సంస్కృతాంధ్రముల రెంటి యందుని ఉత్తమ రచన సాగించుటలో వీరు సిద్ధహస్తులని యీ కృతిచే విశదమైనదన్న రఘునాథాచార్య స్వామి వాక్కులు సత్యసహజములు.

అనంతుని గూర్చిన అనంత వేదనా ప్రతిరూపమే యీ మధురవేదన ఇందలి ఖండికలు పెక్కు సంవత్సరాలకు సంబంధించినవి. దీన్ని హైద్రాబాదులో అచ్చువేయిస్తానని వీరి వదినగారి (నప్పిన్నమ్మగారిఅక్క) కుమారుడు తీసుకపోయి సంవత్సరంన్నరగడిచినా తిరిగి ఇవ్వనందునతమ్ఋరచనగామిగలదని బాధపడ్డారు. వీరి ఆరోగ్యం దెబ్బతిన్నది. సుప్రసన్న, మొదలగు వారలు ఈ పుస్తక మచ్చు వేయిస్తామని ఒప్పించి గ్రంధమివ్వమనగా చిత్తు (ప్రతి) కాగితాలు లేనందువల్ల ఒక్కొక్కటిగ జ్ఞాపకము చేసుకొని వ్రాయు స్థితిలో స్మృతి తప్పిపడిపోవడం సంభవించేది. నేను ఎన్నో పర్యాయాలు ఆపని నుండి తాత్కాలిక ఉపశమనం కల్గించేవాడిని, మొత్తం మీద యధాతధంగా పుస్తకం సిద్ధమైంది. ఈ వేదనే భగవన్నివేదనామయమై మధురవేదనగా మారినది. అయినా వరంగల్ యం.జి.యం. ఆసుపత్రిలో రెండు మాసాలుండక తప్పలేదు.

ఇదొక అఖండమైన ఖండ కావ్యం. ప్రతి ఖండికలో ఒక భావన అంతస్సుగా అనుస్యూతమై ఉంటుంది. అవతారధారతో ఆరంభమై విశ్వ రూపంతో పూర్తిగావడం 'సర్వం విష్ణుమయం జగత్' అనే భావాన్ని సూచిస్తుంది.

భౌతిక ప్రగతిని వ్యతిరేకించడం కవియభిమతంకాదు. కాని, సంఘం లోని, అధర్మం, లంచగొండితనం, మోసం, అధ్యాత్మికహీనమైన భౌతిక వాదం అస్తిత్వాన్ని కూల దోస్తాయని వీరి ఆవేదన.

"ఒక్కని దారి గిట్టదు మరొక్కనికి, ఒక్కని స్వార్థ బుద్ధిచే ప్రక్కల నెందరెందరికి బాధలు గల్గిన యేని వానికిఁ లెక్కయె కాదు........ పరోపదేశమందొక్కని మించునొక్కడు ఒహో హో యివిమానవ చేతనల్ ప్రభూ" "మానవచేతనల్ ఇందలి వ్యంగ్యం గమనార్హం. ఇంతే/గాదు" నా వాడు పర వాడనే భేదమే లేదు.

సహజీవనానికి, పరోపకారానికి. మానవతా చిహ్నానికి రంగు ప్రధా నం గాదు, గుణము మనస్సు ప్రధానమని ఢంకా బజాయిస్తూ 'మేను నలుపైననే మాయె, సదమలసుశీల రసార్ద్రి హృదయమున్న చాలునట. అట్లుంటేనే స్వపరమరతివీడి యెల్లరకుపకరించి" ఘనత పొందుతాడని జీవం లేని జీమూ తంతో చెప్పించడం ఎంతటి భావుకతో గమనించాలి.

సంఘంలో పరస్పరం ఉండాల్సిన సత్సంబంధం ఇప్పుడెట్లుందో ఈ క్రింది పద్యంలో చూడండి దాని వ్యంగ్య వైభవం.

కాసులార్జించెడికరములు కరములు
స్వీయస్తుతుల్ నేర్చు జిహ్వ జిహ్వ
గొప్పగా మార్కులిచ్చెడిగురుడు గురుడు
తనపనులకడ్డు చెప్పని తండ్రి తండ్రి॥

ప్రపంచానికే శాంతి సందేశమిచ్చిన భరతోర్విని దురాక్రమిస్తే "హిమగిరి అంగారఘోరవృష్టి" కురుస్తుందని గద్దించి, అధ్యాత్మిక స్ఫూర్తితో విబోధ సుధా రుచి పొంగి మర్త్యుదమృతత్వ మొందపలె లేనిచో "భరతోర్వికి తరమునకు చెప్పదగిన విలక్షణ స్థితి" మరేమిటని సగర్వంగా పల్కడం" పైటి చూడక్కల్ మిఱుమిట్లుగా విభావమున్ విజ్ఞానమున్ బెంచుచున్ భరతోర్విని" కాపాడుమని వేడుకున్న సింహావలోకనం మధురాలోకనమైనది. స్పృశింహాంకిత మైనది.

ప్రత్యేక కావ్యంగా భాసించే మధురవేదన ఖండికలోని కుబ్జకవికి (జీవునికి) ప్రతీక. నవవిధ భక్తుల్లో భగవత్ప్రాప్తికి భర్తృభార్యా సంబంధం శ్రేష్ఠతమం. కవి తన్ను నాయికగా భావించిన ఆవేదనయే ఈ వేదన. విశ్లేష భీరుత్వంతో వెల్వడిన ఆవేదనయే భగవద్విషయమై మధురవేదనయైనది.

ప్రపంచ ప్రసిద్ధి పొంది నభూతోనభవిష్యతి యనునట్లున్న రవీంద్రుని గీతాంజలి అనువాదానికి ప్రోత్సాహకులు ప్రస్తుత కాకతీయ విశ్వవిద్యాలయంలో నున్న శ్రీ పరమాజీగారు. రవీంద్రుడు స్వయంగా వ్రాసిన బెంగాలీ మరియు ఆంగ్ల గీతాంజలి గ్రంథాలను పోల్చి చూచి, ఆచార్యుల వారు ఆంధ్రమునకు అనువదించినారు. బెంగాలీలోనున్న కొన్ని భావాలు ఆంగ్ల గీతాంజలిలో తగ్గించబడినాయని ఆచార్యులవారి మాట.

రోజుకు రెండు గీతాలే రచించాలన్న నియమంతో ఆరోగ్యం సరిగా లేకున్నా తమ నియమాన్ని పాటించి అనువాదము సాగించేవారు.

"నీ కేమి చదువురాదు. నేను ఈ గీతాలు చదువుతాను విను. ఎక్కడ అర్థం కాదో చెప్తే అక్కడ సరళం చేస్తా"నని చెప్పి నాకు విన్పించేవారు. ఇట్లా సాగిందీ అనువాద రచన. ప్రోత్సాహకుల మాటకాదనలేక గ్రంథాన్ని పూరించి సీతారాములకు అంకితం చేసినారు. కొద్దికాలానికే వీరికారోగ్యం క్షీణించి రెండవసారి యం.జి.యం. ఆసుపత్రిలో చేరడం, ఆ తర్వాత అతి తక్కువ వారు పరమపదానికి వెళ్ళిపోయినారు.

ఇక పర్మాజీగారు తమ మాట నిలబెట్టుకోదలచి అకాడమీవారి ఆర్థిక సాయంగూడ తీసుకొని ప్రింటు చేయించి వీరి సోదరులగు శ్రీమాన్ యాదగిరి స్వామిగారి సమక్షమున అగస్టు 1968వ సం॥లో ఆవిష్కరణ నిర్వహించి ఆచార్యులవారి ఆత్మకు తృప్తి కలిగించినారు.

ఆనువాద విధానానికి ఒకటి రెండుదాహరణలు—

Where the mind is without fear and the head is held high
.... .... .... .... .... .... ... .... .... let my country awake.
గీతాంజలిలో (35)వ అనువాద గీతమిది.

"బెదరు లేకుండునెచ్చట హృదయమునకు
నెచట తలయెత్తుకొని చరియింప నౌను
.... .... .... .... .... ....
నరగనట్టి స్వతంత్రతా స్వర్గ సీమ
నలిపి నాదేశమున్ మేలుకొలుపు తండ్రి"

The gifts to us mortals fulfil all our needs
and, yet run back to thee undiminished.
.... .... .... .... .... .... .... .... .... ....
From the words of the poet men take
what meanings please them, yet their last
meaning points to thee.

"ఈ వుమర్త్యులమైన మాకిచ్చు కానుక-
లెల్ల మాయక్కరల్ దీర్చి చెల్లిపోక
మరలనీ జాడలరయుచు బడుగ లెత్తు"

.... .... .... .... .... ....
"తలపనెల్లరు సుకవి గీతమ్ములందు
దమమనోభీష్ట భావ చిహ్నములుగాంత్రు
కానియవ్వాని చరమలక్ష్యమ్ము మాత్ర
మొక్క నీదగు సంగీతమొనగు నోయి"

ఇందలి (50)వ గీతము 1968లో పదవ తరగతికి ప్రత్యేక పాఠ్యాం శముగ తెలుగు పుస్తకంలో ఎన్నుకోబడినది.

ఇందలి ప్రతి గీతము మూలాతిక్రమణం కాకుండా స్వతంత్ర భావాన్ని వీడకుండ కొన్ని యెడల మూలానికి వ్యాఖ్యాన రూపకంగా వెలసిన చిలుకమర్తి వారి తెలుగు గీతాంజలి సాహిత్యోద్యానంలో ప్రత్యేకతను సంత రించుకొన్నది.

16 సం॥ వయస్సు నుండే పద్యరచన ప్రారంభించిన ఆచార్యుల వారు ఆశు కవితాధారయందును అసమానశక్తిని సాధించి అష్టావధానం నిర్వహిం చినారు. మంతనలో వీరు చేయుచున్న అష్టావధానాన్ని సఫలం కానీయదనే

ఉద్దేశ్యంతో అచటి పండితులు సమస్యలలో ఎంతో కష్టం కలిగించినారు. వాట న్నిటిని గట్టెక్కి సఫలీకృతులైనారు.

నాటి సమస్య ఇది. ఎంత క్లిష్ట ప్రాసయో గమనించండి.

"పుంస్త్వము లేని పురుషుడు పుంసవన క్రియజేసె కాంతకున్"

వరంగల్లులో చేసిన రెండష్టావధానాలు వీరి కీర్తిని దిగంతముల నింపినవి. ఒకటి 1964న వరంగల్లు యస్.టి.ఓ. వారు. వరంగల్ మున్సిపాలి వారు నిర్వహించినవి. అవధానాల్లోని పద్యాలలో ధారాళత, భావుకత, భావగాంభీ ర్యత కొరవడకపోవడమే గాక భుజంగ ప్రయాతం; పంచచామరం మున్నగు వృత్తాలలో పూరణగావించడం అవి గూడా మాలికారూపంలో సాగడం చదువ రులకు ఆనందాశ్చర్యాలను కల్గిస్తుంది. 1965లో హన్మకొండ బి.ఇడి. కళాశాలలో అవధానం చేసివారు.

ఒకటి రెండు సమస్యలనుటంకించి యీ నా వ్యాసాన్ని ముగిస్తాను.

'మ్రొక్కితి వేడికొంటి ననుముట్టకుమంటిసి దూరముండరా'

"చక్కనివాడ నీ వలపుచందమెరుంగనిదానగాను వి
న్మొక్కటి మూడునాళ్ళు మనకుండదు పొందిపుడే నెరింగితే
యెక్కడి కొంటె వీవెరుగవేమి యదేమిటొచీరెమాసెరా"
'గటాగ్రచూలికి సీత చెల్లెలటరా కామయ్యవిన్నావటోయ్'

"ఇటాగ్రప్రాసమునన్ వచించుటకు నాకేలా విచారంబిదే
భ ట్రాజైనను జెప్పగాగలడు, శుంభద్వాణియే యెందునే
కుట్రల్ సుద్దులు లేక గాధవినియున్ కుట్టండు తానిట్లనెన్''
'కలువల్ విచ్చెను తెల్లవారెను గదే అక్కా బావరాడాయెనే'

ఇట్లు సరస భావాల జల్లులు కురిపించుటే గాక దేశభక్తితో బాటు మానవతా విలువను, ధర్మాచరణ అవసరాన్ని, భౌతికతతో బాటు ఆధ్యాత్మికత అవసరాన్ని ప్రబోధించిన యీ సరస మహాకవి భగవదాజ్ఞను తలదాల్చి 24-10-1967వ సం॥న పరమపదమునలంకరించినారు.

అయితే మాత్రం ఏమి "జయన్తితేసుకృతినః"

# ఇతర వ్యాసములు

1. చిలుకమర్తి వారి మధురవేదనలో రస సంభరిత సాంఘికావేదన
13-4-1986 జనధర్మ పత్రిక

2. చిలుకమర్తి వారి కళ్యాణ రాఘవం
1-6-1986 జనధర్మ పత్రిక

3. మంజువచః ప్రసూనగుచ్ఛమ్ముల కావ్యహారము-కళ్యాణ రాఘవము
26-10-1986 జనధర్మ పత్రిక

4. చిలుకమర్తి రామానుజాచార్యుల వారి అష్టావధాన వైదుష్యం
25-1-1987 జనధర్మ పత్రిక



# కోవెల సంపత్కుమారాచార్యులు

డా॥ కోవెల సంపత్కుమారాచార్యులు

జననం : 26-6-1933

చిరునామా :

ఇ. నెం. 15-9-65,
రామన్నపేట, వరంగల్లు-506 002

ముద్రితాలు :

హృద్గీత
ఆనందలహరి
మనపండితులు, కవులు, రచయితలు
తెలుగు ఛందోవికాసం
తెలుగు ఛందః పదకోశము
ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ-సాంప్రదాయకరీతి
పూర్వకవుల కావ్య వైభవము
కల్హణుడు

## డి. భిక్షపతి


దోమల భిక్షపతి

యం.ఏ., యం.ఫిల్.

జననం : 15-7-62

ముప్పారం, నారాయణగిరి

మడికొండ, వరంగల్లు-506 142


అముద్రితములు :

భావ కవిత్వ విమర్శ–వాఙ్మయ సూచికా సమీక్ష

# కోవెల సంపత్కుమారాచార్యులు

"దేశ కాల సమాజాల త్రిపుటి
అన్నిటి కీ కేంద్రమైన వ్యక్తి
అనంత వైవిధ్యం గల మనః ప్రవృత్తి
అన్ని దశల్లో మానవ సమగ్ర వికాసం
ఆధునిక భావ చైతన్య విన్యాసం
వినాదాడంబరాలు లేని విధానం
ఇజాల విషవలయం చీల్చి వచ్చే నిజం
ఉభయంలోనూ ఏర్పడే సామీచీన్యం
అంతర్బహిరంగ సమన్వయాల సమాలోచన
........అనంత జగచ్చైతన్యావగాహన".

ఇవి శ్రీ సంపత్కుమారగారు తమ విషయంలో చెప్పుకొంటున్న మాటలు వారి రచనలను జీవితాన్ని తెలుసుకొంటే పై మాటల్లోని నిజాయితీ, నిష్ఠ, గాఢత్వం మనకు అర్థమవుతాయి. చేతనావర్తన కవితా సంపుటిలో తమ కవితలకు భూమికగా వారు వ్రాసుకొన్నదిది. వారి కవితలన్ని 'సంప

త్కుమార' అనే పేరుతో వెలువడినవి. వారి విమర్శ మొదలైన రచనలన్నీ 'సంపత్కుమారాచార్య' అనే పేరుతో లేదా ఇంటి పేరుతో కూడా కలుపుకొని 'కోవెల సంపత్కుమారాచార్య' అని వెలువడినవి. వారు శ్రీవైష్ణవ కుటుంబములో జన్మించినందుకు మాత్రమే కాక వారి రచనలు, అధ్యాపన విధానం బట్టి కూడా వారి పేరుకు చివరి ఆచార్య శబ్దాన్ని సార్థకంగా గ్రహించవచ్చు. కోవెల అన్నది ఇంటి పేరుతో బాటు ఇంటిలోని పవిత్రతను కూడా సూచిస్తున్నది.

తెలుగులో అటు కవిత్వంలోనూ ఇటు విమర్శలోనూ స్వయం వ్యక్తిత్వాన్ని సాధించుకొన్న వ్యక్తులు మనకు చాలా అరుదు. ఈ రెండింటికి చుక్కెదురు అని సామాన్యంగా భావించబడుతుంది. కాని ఈ రెండు సంపత్కుమారాచార్యుల వారిలో ఏ విరోధం లేకుండా సమన్వయమైనాయి. వారి సాహిత్యాన్నంతా గమనించినప్పుడు ఈ సమన్వయంలోని ఔచిత్యం మనకు స్పష్టమవుతుంది. జీవితంలోనూ సాహిత్యంలోనూ కనిపించే ఈ సమన్వయం వారికి పైతృకమైనఆస్తి.

సంపత్కుమారగారి తండ్రిగారు శ్రీమాన్ కోవెల రంగాచార్యుల వారు, తల్లి చూడమ్మ. వీరిది తెలంగాణాలోని సాంప్రదాయకమైన శ్రీవైష్ణవ కుటుంబం. తండ్రి గారు ఉభయ వేదాంత నిష్ణాతులు, ఉపన్యాసకేసరి, "సుబోధక సుధీమణి" అన్నవి వారికి సార్థకమైన బిరుదులు. ఆంధ్ర దేశంలో వారు ఉపన్యసించని పెద్దనగరం లేదంటే అతిశయోక్తి కాదు, త్రిమతాలను సమన్వయదృష్టితో స్వీకరించిన ఆచార్యులు వారి ఉపన్యాసాల ధాటి, విషయాన్ని అందించడంలోని స్పష్టత వారికా బిరుదులను సంపాదించినవి. తర్క-వేదాంతాలు వారి అభిమాన విషయాలు. ఈ విధమైన ఉత్తమ వ్యక్తిత్వం గల చూడమాంబారంగాచార్యుల వారి సంతానంలో వీరు చివరి వారు, సంపత్కుమారాచార్యులు శ్రీముఖ ఆషాడ శుద్ధ చవితి (26-6-1933) నాడు వరంగల్లులో జన్మించినారు. బాల్యమంతా తండ్రిగారి వెంట తిరుగుతూ సంస్కృతాన్ని అభ్యసించడంలోనే గడిచింది. కాని డిగ్రీలు లేని పాండిత్యం పనికిరాని కాలం కాబట్టి వరంగల్లులోని సంస్కృతాంధ్ర కళాశాలలో తండ్రిగారు సంపత్కుమారాచార్యులను చేర్పించారు. అక్కడ శ్రీ గుదిమెళ్ళ వరదాచార్యులు గారు, జుజ్జూరు నరసింహశాస్త్రిగారు, భాస్కరశాస్త్రిగారి వంటి పండితుల సన్నిధిలో తర్క వ్యాకరణ, సాహిత్యాలలో అభ్యాసం సాగింది. అక్కడి నుంచి మద్రాసు

విశ్వవిద్యాలయపు ఎంట్రెన్స్ పరీక్షలో ఉత్తీర్ణులై, 1949లో బందరు సమీపంలోని చిట్టి గూడూరు సంస్కృత కళాశాలలో చేరినారు 1953 దాకా అక్కడ అధ్యయనం సాగింది. శ్రీ కరి రామానుజాచార్యులుగారు, బ్రహ్మశ్రీ మల్లంపల్లి వీరేశ్వరశర్మ గారు, శ్రీ తట్టా రంగాచార్యులుగారు, శరభయ్యగారు కళాశాలా అధ్యక్షులైన శ్రీమత్ తిరుమల గుదిమెళ్ళ వరదాచార్యులు గారి సన్నిధిలో సంస్కృతాంధ్రాలలో అధ్యయనంచేసి "భాషాప్రవీణ"గా ఉత్తీర్ణులైనారు. ఆ తరువాత తిరిగివచ్చి ఉపాధ్యాయ ఉద్యోగంలో ప్రవేశించినారు. ఉద్యోగం సాఫీగా సాగుతూనే వుంది.

సంపత్కుమార గారికి మామూలుగా మనం అనుకొనే స్కూలు ఎడ్యుకేషన్, కాలేజీ ఎడ్యుకేషన్ లేదు. ఆంగ్లం వారి అన్నగారు లక్ష్మీనరసింహాచార్యుల వద్ద నేర్చుకోవడం ప్రారంభించి స్వయం కృషితో అవసరమైనంత మేర సాధించుకొన్నారు. ప్రైవేటుగానే 1963లో తెలుగులోనూ, 1966లో హిందీలోను ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి ఎం.ఏ. డిగ్రీలు సాధించినారు. ఆ తర్వాత సాంకేతిక పరమైన ఆటంకాలను అధిగమించి 1978లో కాకతీయ విశ్వ విద్యాలయం నుండి డాక్టరేటు పట్టా పొందారు. వారి పరిశోధన విషయం 'ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ-సాంప్రదాయక రీతి', కాకతీయ విశ్వ విద్యాలయపు తొలి స్నాతకోత్సవంలో తొలి డాక్టరేటు సంపత్కుమారాచార్యులు గారిది.

ఈ డిగ్రీలతో నిమిత్తం లేకుండానే వారి సాహిత్య కృషి సాగింది. పరిశోధక విమర్శకుడుగా వారు రచించిన "తెలుగు ఛందో వికాసం" 1962లో వెలువడింది. ఆ రోజుల్లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి తెలుగు ఛందస్సును గూర్చి బహుమతి ప్రకటించి పోటీ గ్రంథాలను ఆహ్వానించింది. ఈ పోటీకి శ్రీ గిడుగు సీతాపతిగారు, రావూరు దొరసామి శర్మ గారు, సంపత్కుమారాచార్యులుగారు తమ గ్రంథాలను సమర్పించారు. మొదటి ఇద్దరు ఆనాటికే భాషా, ఛందోరంగాల్లో ప్రసిద్ధులు, వయస్సులో కూడా చాలా పెద్దవారు. బహుమతి సీతాపతిగారి గ్రంథానికి లభించింది. సీతాపతిగారు అంతకు పూర్వం ఛందస్సుకు సంబంధించి వ్రాసిన కొన్ని వ్యాసాలు కొన్ని పీఠికలు కలిసి ఈ గ్రంథమైంది. శర్మగారి గ్రంథంలో యతిప్రాసలకు సంబంధించిన విషయాలే ఎక్కువ ప్రాధాన్యం పొందాయి సంపత్కుమారగారి గ్రంథంలో

చారిత్రకంగా తెలుగులో ఛందస్సు యొక్క వికాసం ఒక క్రమ పరిణామ రూపంలో ఆధునిక కాలంలో వచన పద్యం దాకా ఎన్నో వివరాలతో చిత్రించింది. తెలుగులో ప్రసిద్ధమైన ఛందో గ్రంథాల్లోని విషయాలన్నీ ఇందులో చర్చించబడినాయి ఈ గ్రంథ ప్రణాళిక రచనా విధానం బహుమతి నిర్ణయించినవారిలో ఒకరైన శ్రీ అబ్బూరి రామకృష్ణరావుగారిని ఎంతో ఆకర్షించింది ఈ గ్రంథం కూడా తప్పకుండా రంగంమీదికి రావలసిందే అని అకాడమీలో వాదించి, ఒప్పించి దీని ముద్రణకు కూడా ఆర్థిక సహాయం చేయించారు. అనాటికి రామకృష్ణరావుగారికి సంపత్కుమారగారితో ముఖ పరిచయం కూడా లేదు. కేవలం గ్రంథ స్వరూపమే అక్కడ పనిచేసింది.

ఈ గ్రంథం ఆవిష్కరణ విశ్వనాథ సత్యనారాయణగారి అధ్యక్షతలో హైదరాబాదులో జరిగింది. ఆవిష్కర్త అప్పటి ఉత్తర ప్రదేశ్ గవర్నర్ డా॥ బూర్గుల రామకృష్ణారావుగారు, వక్తలు అబ్బూరి రామకృష్ణరావుగారు ఖండపల్లి లక్ష్మీరంజనంగారు. గ్రంథాన్ని ఆవిష్కరిస్తూ బూర్గుల వారు "మహాభారతంలో ఇద్దరే ఇద్దరు మహా వీరులున్నారు ఏక్ బుడా ఏక్ బచ్చా, భీష్ముడు అభిమన్యుడు. తెలుగులో ఛందోరంగంలో సీతాపతిగారు, సంపత్కుమార గారు అట్లాంటి వారు" అని అన్నారు. సీతాపతి గారు ఆ సభకు వచ్చి సంపత్కుమారగారిని ఆశీర్వదించారు, అది వారి మంచితనానికి గుర్తు.

ఛందస్సును గూర్చి ఈనాడు ఏ విషయాన్ని గూర్చి అయినా సంప్రదించాలంటే సంపత్కుమారగారే ప్రముఖంగా కనిపిస్తారు. ఇది జగమెరిగిన విషయం. వీరికి ఇంతటి ప్రామాణికతను కలిగించింది తెలుగు ఛందోవికాసమే. ఛందోరంగంలో పరిశోధకులకు, విద్యార్థులకు, ఉపాధ్యాయులకు కూడా ఈ గ్రంథం ఎంతో ఉపకరించింది. ఈ గ్రంథం మళ్ళీ 1990లో పునర్ముద్రణ జరిగింది.

దాదాపు గత శతాబ్దం చివరి పాదం నుంచి ఒక వంద సంవత్సరాల పరిధిలో వరంగల్లు జిల్లాలోని కవి పండితులను గూర్చి "మన పండితులు కవులు రచయితలు" అనే పేరుతో మరుగుబడిన మహావ్యక్తులు దాదాపు నలభై మంది గురించి సంపత్కుమారగారు వ్రాసిన వ్యాసాలు జనధర్మ (వరంగల్) పత్రికలో ధారావాహికంగా వెలువడినాయి. వీటిలో నుంచి పాతిక వ్యాసాలు గ్రంథ

రూపంగా జనధర్మ వారే వెలువరించారు. వీటిలో ఒక్కొక్క వ్యక్తి ఆయన జీవన రేఖా సాహిత్య కృషి, అందులోని విశేషాలు ప్రత్యేకతలు భాషాసాహిత్యలకు వారి సేవలు వివరించ బడ్డాయి. వరంగల్లు జిల్లా వరకు ఇది ఒక అపూర్వమైన గ్రంథం. ఫణికుండలుడువంటి చక్కని కవులు పలువురు ఈ గ్రంథం ద్వారా సాహిత్యలోకానికి పరిచయమైనారు.

తెలుగు ఛందోవికాసం తర్వాత సంపత్కుమారాగారి 'ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ సాంప్రదయిక రీతి' పరిశోధన సిద్ధాంత గ్రంథం 1981 లో వెలువడింది. ఈ గ్రంథం సంపత్కుమారగారికి భారతీయ సాహిత్యశాస్త్రంలో గల గాఢమైన అభినివేశాన్ని అధికారాన్ని నిరూపిస్తుంది. ఇది రెండు భాగాలు. పూర్వ భాగంలో తెలుగులో నన్నయాదులైన ప్రధాన కవుల సాహిత్య సిద్ధాంతాలు నిరూపింపబడ్డాయి. అయితే ఈ భాగం అముద్రితం. ముద్రితమైంది రెండో భాగం మాత్రమే. అందులో ఆధునిక కాలంలో తెలుగు సాహిత్య విమర్శ ఆరంభ వికాసాలు నిరూపించబడ్డాయి. కట్టమంచి రామలింగారెడ్డి గారు ఆధునిక సాహిత్య విమర్శకు ఆద్యులుగా భావించబడుతున్నారు. కాని అంతకు పూర్వమే 1892లో పి. దక్షిణామూర్తి తోనే ఆధునిక గ్రంథం నిరూపించింది. రామలింగారెడ్డి, రాళ్ళపల్లి, అనంతకృష్ణశర్మ, దువ్వూరి రామిరెడ్డి, బసవరాజు అప్పారావు, పురాణం సూరిశాస్త్రి, అక్కిరాజు ఉమాకాన్తం, నండూరి బంగారయ్య, రాయప్రోలు సుబ్బారావు, విశ్వనాథ సత్యనారాయణ, శ్రీశ్రీ గారల సాహిత్య విమర్శను పరిశీలించి ఆ విమర్శల నుండి వారి కావ్య సిద్ధాంతాలను ఈ గ్రంథం నిరూపించింది. ఈ నిరూపణలో సాహిత్య విమర్శ యొక్క క్రమగతి విధానం కూడా స్పష్టమవుతుంది. మనకు అనేక మంది విమర్శకుల విమర్శను గూర్చి వ్యాసాలన్నాయి కాని వారి సాహిత్య సిద్ధాంతాలను పడగట్టి నిరూపించిన గ్రంథం ఇప్పటివరకు ఇదొక్కటే. ఈ ఎన్నుకోబడిన విమర్శకులు ఆధునిక సాహిత్య విమర్శకు ప్రతినిధులు కావటం కూడా గుర్తించవచ్చు. ఈ విమర్శకులు విమర్శ విధానాలకై ప్రాచీన భారతీయ అలంకారిక సిద్ధాంతాలు ఏ విధంగా పనిచేశాయో ప్రేరణ కలిగించినాయో ఈ గ్రంథంలో నిరూపించబడింది. దీనిద్వారా భారతీయ అలంకారిక సిద్ధాంతాల వ్యాపక లక్షణం, లోతులు ప్రదర్శించబడ్డాయి. ప్రాచీన ఆధునిక భారతీయ సాహిత్య సిద్ధాంతాలు సమన్వయం ఈ గ్రంథంలో మనకు కనిపించే ఒక గొప్ప లక్షణం. భరతుని నుండి జగన్నాథ పండిత రాయల వరకు ప్రాచీన

అలంకార శాస్త్రంలో చర్చింపబడి ఈనాడు మనం గుర్తించని అనేకాంశాలు ఈ గ్రంథం ద్వారా మనకు తెలుస్తాయి.

ఇవే కాకుండా సంపత్కుమారగారు తెలుగు అకాడమి కోరిక పై తెలుగు ఛందః పదకోశము రచించారు. ఇందులో ఛందోవికాసం తర్వాత సంపత్కుమారగారి కృషి వ్యక్తమవుతుంది. ఒక నిఘంటువులా, ఒక శాస్త్ర గ్రంథంగా ఇది జిజ్ఞాసువులకు ఉపయోగ పడుతున్నది. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి కోరికపై సంపత్కుమారగారు కూచిమంచి తిమ్మకవి రచించిన లక్షణ సంగ్రహం, కూచిమంచి వెంకటరాయుడు రచించిన సుకవి మనోరంజనం అనే లక్షణ గ్రంథాలను పరిష్కరించి విపులమైన పీఠికలు రచించినారు. వీటిలో ఛందో వ్యాకరణాలకు సంబంధించి అనేక విషయాలు చర్చింపబడ్డవి. ఎన్నో అపూర్వ విషయాలు వెల్లడించబడినవి. ఇవి గాక విద్యార్థుల కోసం వీరు రచించిన లక్షణ దీపిక అన్న వ్యాకరణ గ్రంథం చాలా చిన్నదే అయినా విద్యార్థులకు మిక్కిలిగా ఉపయోగిస్తుంది.

అత్యాధునికమైన వచన పద్యాన్ని గూర్చి చేకూరి రామారావు గారికి, వీరికి భారతి పత్రికలో వాద వివాదాలు ఎంతో ఉదాత్త స్థాయిలో సాగినవి, వీటిలో కేవలం వచన పద్యాన్ని గూర్చే గాక ఛందస్సు, భాష, అలంకారాలకు సంబంధించి అనేక విషయాలు కూడా చర్చింపబడినవి. వీరిద్దరు ఏకాభిప్రాయానికి రాకున్నా కూడా వీరికి పరస్పరం ఎంతో గౌరవం. అందుకే వీరిద్దరూ కలిసి తమ వాదాలను "వచన పద్యం-లక్షణ చర్చ" అనే పేరుతో గ్రంథంగా వెలువరించారు. ఎవరి వాదాలను వారు గ్రంథ రూపంలో వెలువరించుకోవటం సామాన్యమే. కాని ఇద్దరు విమర్శకులు కలిసి తమ వాదాలను సమిష్టిగా ఒకే గ్రంథంగా వెలువరించడం సాహిత్య చరిత్రలోనే అపూర్వమని చెప్పవచ్చు.

ఇవిగాక సంపత్కుమార గారు ఛందో వ్యాకరణ సాహిత్యాలకు సంబంధించి వ్రాసిన వ్యాసాలు అరవై డెబ్బై దాకా వున్నాయి. వాటిలో ప్రణయ కవితారథ్య అనే ప్రధాన శీర్షికతో కృష్ణశాస్త్రి, వేదుల, నాయని, రాయప్రోలు, విశ్వనాథలను గూర్చిన వ్యాసాలు; ప్రగతి వాద కవిత్వం పై తిరుగుబాటు, వసుచరిత్రలో వస్తు నిర్వహణ, చలం పురూరవ ప్రసిద్ధమైనవి. "తిక్కనగారి ఉభయ కావ్య ప్రౌఢి పాటించు శిల్పము-పునః సమీక్ష"– ఉభయ కవి తిక్కన గారి సమన్వయ దృక్పథం అపూర్వంగా పరిశీలించబడినవి.

కమ్మనిలతాంతకమ్మోనని, దేశీయగుణములు - లాక్షణిక మతభేదములు - మొదలైన వ్యాసాల్లో ప్రాచీనమైన లేఖన పద్ధతి సూర్యేంద్ర గణాలకు సంబంధించి విశేషాంశాలు పరిశీలింప బడ్డాయి.

ఇదంతా స్థూలంగా సంపత్కుమార గారి పరిశోధన విమర్శకు సంబంధించిన విషయం.

సంపత్కుమారగారికి చిన్నతనం నుంచీ కవితారచన అలవడింది. వెలుగులోకి వచ్చింది మాత్రం సుప్రసన్న గారితో కలిసి రచించిన "హృద్గీత". ఇది సర్వేశ్వరా! అనే మకుటంతో సాగిన ఆధునిక శతకం. ఇందులో పద్య రచనకు సంబంధించిన అనేక విచ్ఛిత్తి విశేషాలు ఉన్నాయని విశ్వనాథ వారన్నారు, సుప్రసన్న గారితోనే రచించిన మరొక చిన్న కావ్యం 'ఆనంద లహరి' శబరి భక్తి స్వరూపాన్ని, వేదనను ఈ కావ్యం ఎంతో మధురంగా చిత్రిస్తుంది. వీరిద్దరూ కలిసి రచించిన ఒక గేయ కావ్యం 'అపర్ణ' ఇది అముద్రితం ఇందులో మనస్సంఘర్షణ ప్రధానమైన వస్తువు - గేయరచనలో ఎన్నెన్నో రీతులు ప్రౌఢంగా ఇందులో కనిపిస్తాయి.

సంపత్కుమారగారి కవితలు వందకు పైగా వివిధ పత్రికలలో వెలువడినాయి. కాని ఇంతవరకు ఈ కవితలు సంకలన గ్రంథ రూపంలో వెలువడ లేదు. అట్లా వెలువడి ఉంటే వారి కవిత్వంలోని వైవిధ్యం, భావ తీవ్రత, ఆధునిక చైతన్యం, ఆర్జవం ఒక్క చోట మనం చూడగలిగే వాళ్ళం. అయినా సేకరించిన ఖండికలను బట్టి వారి కవితా విశేషాలు కొన్ని తెలుసుకోవచ్చు.

సంపత్కుమారగారికి పద్యం వైపు కొంచెం మొగ్గు ఎక్కువే కాని వారి గేయాలు వచన పద్యాలు కూడా పద్యంతో సమఉజ్జీగా విరివిగానే సాగినవి. పద్యాన్ని ప్రౌఢంగా నడిపించడంలో సుకుమారంగా అందగించడంలో సంపత్కుమారగారి తీరు ఎంతో ఆహ్లాదం కలిగిస్తుంది. సీతాపతి అనే ఒక గొప్ప వీరుడుండే వాడు ఆయనకు షితాబుఖాన్ అను బిరుదు ఓరుగల్లు నగరాన్ని కాకతీయుల అనంతరం అతి కొద్ది కాలమే కావచ్చు సీతాపతి మహమ్మదీయుల నుండి విముక్తం చేసినాడు. ఆయనను తలచుకొంటే సంపత్కుమారగారి మనస్సు ఎంత పొంగిపోయిందో మనం చెప్పలేము కాని ఈ పద్యం చెప్పుతుంది

ఎవరామూర్తి! మహేంద్ర శైలశిఖర హ్రీకారి రూపమ్ము, శౌ
ర్య విలాసోద్ధత పూర్ణ పూరుష మహాహంకారరూపమ్ము, పూ
ర్వ వదాన్యాంధ్ర ధరాతలేశ్వరమహః ప్రౌఢత్వ రూపమ్ము, ది
వ్య విశాలైక శిలాపురీ ప్రథిత సౌభాగ్య స్వరూపమ్మునున్

(భారతి – మే, 1957)

ఈ పద్యరచన ఆ మహా వీరుని యొక్క రూప గుణ క్రియలను ఎంతో గొప్పగా స్ఫురింపజేస్తుంది. ఆయన ఆకారాన్ని చూచి మహేంద్ర పర్వత శిఖరమే సిగ్గుపడి పోయిందట. పూర్ణ పూరుషత్వం వల్ల కలిగే అహంకారమే ఆయన రూపమట. ఆయన గొప్ప దాత ఓరుగల్లు నగరము యొక్క సౌభాగ్యమే ఆయన. ఇక్కడ దీర్ఘ సమాసాలు పద్యపు నడక పద్య రచనలోను భావ వ్యక్తీకరణలోను సంపత్కుమార గారి శక్తిని ప్రదర్శిస్తాయి.

సంపత్కుమార గారి కవితలో ఋతువుల వైభవాన్ని మనసుకు రూపు కట్టించే ఖండికలు కొన్ని ఉన్నాయి. ఆయన ప్రకృతితో మమత్వం పొందటం, ప్రకృతిని ఎన్నో రకాలుగా భావనాశక్తితో దర్శించటం వీటిలో గమనించవచ్చు

జలజములు విచ్చె, నాదు కన్నులును విచ్చె
పూలు వాసన విచ్చె, ఊర్పులను విచ్చె
తరువులెల్ల కదిలె, నాదు తనువు కదిలె
మధురతలు నెల్ల విడిలె ఉన్మనము విడిలె

(వసంతాత్మ– ఆంధ్రపత్రిక 2-4-1958)

ఇందులో పద్మాలు కన్నులు అంటూ పోలికల విషయం అట్లా వుంచి ప్రకృతిలో జరుగుతున్న ప్రతి స్పందన తనలోనూ కలుగుతుండటం ఈ పద్యం లో గుర్తించదగిన అంశం ప్రకృతితో ఏకాత్మ భావాన్ని కవి ఇక్కడ పొందు తున్నాడు కవి వసంతాత్ముడవుతున్నాడు. అందుకే ఈ పద్య ఖండిక శీర్షిక వసంతాత్మ.

జయంతి (జులై 1959)లో వచ్చిన 'మబ్బు' అనే వర్షర్తు వర్ణన ఖండిక సీస పద్యాలతో సాగుతుంది. అందులో మొదటి పద్యమిది.

"పేరాసతో నెల్లి వారుణి యందున్న
అఖిల రసద్రవ్యమాహరించి
ప్రాణులెంతగ గుంజులాడిన రాల్చడు
అట్టి ద్రవ్యస్వామి అంశుమాలి"

"అతని అగారమ్ము నంతయు స్వాధీన
మొనరించుకొని తెచ్చి యొగి సమస్త
బాధిత జీవుల పరము జేసెడి నట్టి
దాతృతా పరముండు తాను మబ్బు"–

ఇందులో మబ్బు ఒక గొప్ప ప్రజాస్వామ్య వాదిగాను, సూర్యుడు ధన స్వామ్య వాదిగాను చేసిన భావన ఎంతో మనోజ్ఞంగా సాగింది. వాస్తవికమైన విషయాన్ని చెపుతూనే ఆధునిక భావనను వ్యక్తీకరించటం ఇందులోని విశేషం. అంశుమాలి అంటే సూర్యుడు వాడు సహజంగానే ధనవంతుడు అయినా భూమి మీది రస ద్రవ్యం అంతా వేయి చేతులతో లాక్కొని శోషణ పొందిన జనులు ఎంత గింజుకున్నా ఒక్క చుక్క కూడా ఇవ్వడు. కాని అయన ద్రవ్య నిధినంతా తాను స్వాధీనం చేసికొని మబ్బు రస ద్రవ్యాన్ని అందరికి అందిస్తున్నాడు. ఇందులో ప్రతి పదము వ్యక్తీకరించవలసిన భావానికి ఉన్ముఖంగా కనిపిస్తాయి. మరి ఈ మబ్బునే రకరకాలుగా కవి భావిస్తాడు. ఈ భావించడంలో లోకవృత్తము, సౌందర్యము మనః ప్రవృత్తి ఈ మొదలైన వెన్నో చిత్రింపబడినవి.

'వాంఛానుమితి' అనే ఖండిక సంపత్కుమారగారి అంతర్వేదనా లక్షణాన్ని వ్యక్తం చేస్తుంది.

"అల సర్వమ్మున నుండి వేరయి తృతీయః పంథలో సాగువాం
ఛలతో సంచలనమ్ము బొందెడి మనస్సౌఖ్యమ్మదేమో! ఇది
ట్టులటంచున్ మరి వేరు వేరు విడిపాటుం గూడ చేయంగ లే
కలి లక్ష్మమతినయ్యెదన్ విధృత లోకమ్మందు నేకాకి తన్"

(భారతి – సెప్టెంబర్, 1959)

వాంఛ తృతీయః పంథలో సాగుతున్నది అంటే లోక పద్ధతికి భిన్నంగా ఉందన్న మాట ఇట్లాంటి వాంఛలతో మనస్సుకి ఏ విధమైన సౌఖ్యం

కలుగుతుంది? ఫలింపని తెలుసు అయినా దాన్ని వదులుకోలేకపోవడం లోకంలో చాలా చోట్ల చూడవచ్చు, అట్లాంటి వ్యక్తులు ఒంటరివాళ్ళైపోతారు. జీవితంలో సుఖం, దుఃఖం, వాంఛ అనే మూడింటిని గూర్చిన విచారణ ఈ ఖండికలో కనిపిస్తుంది. ఈ ఖండికలోని చివరి పద్యం ఉత్తమమైన ఊహా శక్తిని భావనా శక్తిని ప్రదర్శిస్తూ ఖండికలో చర్చింపబడిన విషయానికి పరిష్కారం కూడా చూపుతుంది.

> "ధనుపై సామి మనోజ్ఞ వక్రము వియద్భాగమ్ము, చిన్నారి చ
> క్కని రెక్కల్ విదలించుచున్ జను బలాకాశ్రేణి తానారియై
> సన జల్లుల్ విశిఖమ్ములైన మదిన స్వామీ! ఇదే గుండె వి
> చ్చిన యీ బాడబరీతి వాంఛలను వెచ్చింతున్ వ్యదర్థమ్ముగన్
>
> (వాంఛానుమితి)

వాంఛలను వెచ్చించడమే వాంఛా నివృత్తికి శాంతికి ఒక మార్గమన్న సూచన ఇందులో కనిపిస్తుంది. ఇదిట్లా వుంచి ఆకాశాన్ని ధనస్సుగా, బారు తీరిన పక్షులను నారిగా సన్న జల్లులను బాణాలుగా భావించి మన్మధుడి వర్ణించిన ఈ తీరు ఎంతో అపూర్వం. ఇట్లాగే ఎన్నో ఖండికల్ని ఉదాహరించుకోవచ్చు. గేయాల్లో ఉదాహరణకు 'ప్రోషిత భర్తృక'

> తుడుచుకోవె ఇంక కనులు
> ముడుచుకోవె ఇంక కురులు
> కురులందున పూల సరులు
> తరులపైనను మరులు గొనుసీ
> తడుబడింకిట వచ్చు లే
> గగన మందు నవ జలదము
> కల్పించిన మృదు భావము
> భావములో దరహాసనము
> హదనముంగని రుసులుకొను
> మానస విహారి ఇటొచ్చులే"–

అష్టవిధ శృంగార నాయికల్లో ప్రోషిత భర్తృక ఒకరు. భర్త దూరంగా వున్నప్పుడు అతని రాకకు ప్రతీక్షించే స్థితిలో నున్న నాయికను

ప్రోషిత భర్తృక అని అలంకార శాస్త్రము చెప్తున్నది. మబ్బులు కమ్ముకొచ్చే వేళల్లో దూరాన వున్న ప్రియునితో ప్రియురాలి దగ్గరికి రావాలనే తహ తహ కలుగటమనే మధుర భావము ఇందులో చిత్రింపబడింది. "అమృత పాత్ర దొరకలేదు అంబుధి దోర్లిస్తాను" వంటి ముఖ్యమైన ఉద్వేగకర గేయాలు ''దురాత్త ప్రమాద ప్రదోషాల నీల్గి'' ముఖ్యమైన ప్రయోగాత్మక గేయాలూ సంపత్కుమారగారు ఎన్నో రచించారు. పద్య గేయాల్లోవలెనే వచన పద్యం కూడా ఆయన చేతిలో ఎన్నో నడకలు సాధించింది. వచన పద్య స్వరూపాన్ని గూర్చి ఎంతో గాఢంగా ఆలోచించిన వ్యక్తి కావడం వల్ల వచన పద్యం ఆయన రచనల్లో ఒక విలక్షణ స్వరూపాన్ని వ్యవస్థా లక్షణాన్ని పొందటంలో చిత్రమేమీ లేదు. ఇవి కాక ఇంకా చాలానే వున్నాయి. సంపత్కుమారగారి వచన పద్యాల్లో గాంభీర్యం, వ్యావహారికత, వ్యంగ్యం, ప్రౌఢి కలగలుపుగా మనకు కనిపిస్తాయి. భావాన్ని బట్టి వచన పద్య స్వరూపం కూడా రకరకాలుగా మారుతున్నది.

'అంతర్లయం' అనే ఖండికలో వచన పద్యం తీరు గమనించదగింది. పంచభూతాలతో మానవ శరీరం నిర్మితమైంది. ఈ అయిదింటిని తీసి వేస్తె జీవుడు తాను తానుగానే స్వరూపంతో ఉంటాడు. తాను తనలోనే లీనమవుతాడు ఇది ఒక విధమైన అద్వైత భావన. దీన్ని చిత్రించే ఈ ఖండికలో అయిదు పద్యాలు ఒక్కొక్క పద్యంలో ఐదేసి పాదాలు, ఈ అయిదు పాదాల పద్య నిర్మాణంలోనూ ఒక విశేషముంది. మొదటి రెండు పాదాల్లో పంచ భూతాల్లోని ఒక్కొక్కదాన్ని గూర్చి సంబోధన ఉంటుంది. మూడవ పాదంలో అది చేయగూడనిదాన్ని గూర్చి చివరి రెండు పాదాల్లో చేయవలసినదాన్ని గూర్చి ఉంటుంది. ఇది ఈ పద్య నిర్మాణం— అయిదు పద్యాల తరువాత చివరి (ఆరవ) పద్యం మొత్తం ఖండిక తాత్పర్యానికి ఏక వాక్యత కల్పిస్తుంది. ఉదాహరణకు మొదటి పద్యం.

"అవకాశం ఏ మాత్రం లేకుండా
అంతా ఆవరించుకొన్న ఆకాశమా?
నా చెవులకు పని కల్పించకు
ఒక్క క్షణం అల్లరి మానుకో
నీ గుణాన్ని మార్చుకో

శబ్దం ఆకాశ గుణమని ప్రసిద్ధి 'శబ్ద గుణకమాకాశం' అని తార్కికుల నిర్వచనం. ఇక్కడ ఈ అంశం గమనించాలి, ఇక చివరి పద్యం—

నేను మళ్ళీ నిద్ర లేవదలచుకోలేదు
వ్యర్థ జీవన భాండం నెత్తికెత్తడం కుదరదు
నన్ను నే బాగా పరీక్షించుకొని
నేను కాని దాన్ని దులుపుకొని
నన్ను నాలో లయం కానీయండి.

ఈ పంచ భూతాలన్నీ తాను కానివే, అందుకే తానేదో పరీక్షించుకోవాలె. అప్పుడు ఆత్మజ్ఞత వల్ల తనలో తానే లయమవుతాడు. అంటే తాను ఒక్కడే తాత్త్వికమైన ఈ అంశాన్ని చిత్రించడంలో వచన పద్యం ఒక ప్రత్యేక నిర్మాణాన్ని సంపాదించుకొంది. వచన పద్యాల్లో కూడా 'మబ్బు' అనే శీర్షికతో ఒక రచన వుంది. పూర్వం పద్యంతో కనిపించిన మబ్బు తీరు ఇందులోని తీరు ఎంతో భిన్నంగా ఉంటుంది.

మబ్బును గూర్చి కవి ఇట్లా అంటాడు.

మెఱుపు లాంటి అమ్మాయిని
గాఢంగా కావలించుకొన్నట్టు కాదు
ధారా పాదాలతో నడుస్తున్న ఘనుడా
చూడు
మట్టిని కావలించుకొన్న వాళ్ళని
పారవశ్య బాష్పాలతో కాదు,
వేచిన వాచిన కళ్ళ రక్త బాష్పాలతో
పుడమి బడిసి నింపుతున్న వాళ్ళని
ముప్పూటలు కాదు గదా
పూటకు కూడా గతిలేని వాళ్ళని—

గృహ ప్రవేశ ఖండికలో తానొక ఇల్లు కట్టానని అందులో ప్రవేశించడానికి రమ్మని ప్రియురాల్ని పిలుస్తాడు—

"కాలానికి కట్టిన ఇల్లు ప్రియా ఇది
అదుగో లగ్నం ఆసన్నమైంది
ఇక మనం గృహ ప్రవేశం కావడమే ఆలస్యం"

ఈ పంక్తులతో ఖండిక పూర్తి అవుతుంది. కాలానికి కట్టిన ఇల్లు అనేది ఒక చక్రాని అభివ్యక్తి ఈ ఖండికలో తాను ఇల్లు కట్టించిన తీరు అలంకరించిన తీరు అక్కడి వస్తువులు ఇవన్నీ కూడా మనిషి ఎంత మోసానికి కపటానికి, లోభానికి, లాలసత్వానికి, క్రూరత్వానికి దురాశాపరుడై ఎంత లొంగి పోతున్నాడో చాలా గొప్పగా చిత్రింపబడింది. 'రోజు వారీ'లో ఈ దేశంలోని ఆర్థికావ్యవస్థ ఛిన్నాభిన్నం కావటంలో దొంగ వ్యాపారాలు, దళారీలు, లంచ గొండులు ఎంత బలంగా పనిజేస్తున్నాయో, ప్రభుత్వం కూడా దాన్ని ఎట్లా ఎదుర్కొనలేక పోతున్నదో వ్యంగ్యంగా చిత్రించబడింది. ఇందులోని హాస్య లక్షణము వేదనను రెచ్చగొడుతుంది. అది విశేషం.

'ఆవేశానికి అభ్యర్థన' అన్న రచన తెలంగాణా ఉద్యమ సందర్భంగా రచింపబడింది. ఆవేశం వల్ల ఎంత నష్టపోతున్నది చిత్రించిన తీరు ఎంతో సంవేదనామయంగా ఉంటుంది.

'నాటకాంతం' అనే ఖండిక దిగంబర కవుల తీరును వెక్కిరిస్తుంది.

"ఏండ్లుగా చూస్తున్న ఏకపాత్రాభినయంతో
విసిగింది జనం-చేతికందిన పదిమందిని చెల్లాచెదురుగా
విశాలమైన రంగస్థలం మీదికి
విసిరింది బలం కొద్ది"- అని ప్రారంభమైన ఈ దీర్ఘ ఖండిక
"అలవాటైన హాస్యాన్ననుభవించలేక
హుశారుకైనా నవ్వుదామని
ఎంత చచ్చినా కుదిరి చావక
కూర్చుండ కుర్చీలూ బెంచీలు
చివరకు చింకిచాపలూ....
గుంజి విరిచి.... గుణపాఠం చెప్పి
హాలవతలకు విసిరి పారవేసి
దిమ్మతిరిగి ప్రేక్షక జనం
ఎంతకూ తెగని నాటకం

ప్రహసనంగా మారిన బూటకం

వదుల్దామనుకుంటూనే వదలుకోలేక

అంటుకొన్న మట్టి దులుపుకోలేక

నేల మీదపడి బోర్లగిలి నిద్ర పోయి విసిగింది జనం" – అని పూర్తవుతుంది. మధ్యలో

"సంధులూ సంధ్యంగాలూ విరిగి
ప్రకరులూ పతాకలూ చిరిగి
ఉద్ధత నటులకు ఉద్భట రీతిగా
అనలంకృత నవాలంకారంగా
(లాక్షణికులెవరూ అంగీకరించకున్నా)
భీభత్సాన్ని అంగిరసంగా
భయానకాన్ని అంగరసంగా
కలగాపులగంగా
ప్రదర్శిస్తున్న నాటకాన్ని
చివరంటా సాగకుండానే

మార్చింది ప్రహసనంగా" – అనే వ్యంగ్య ధోరణిలో హాస్యం, వెక్కిరింత ముప్పిరిగొని రూపొందిన రచనలకు ఇదొక ఉదాహరణ. చేతనా వర్తం మొదటి సంపుటంలో "ఈ రాత్రి గడవలేదు" అనే సంపత్కుమారగారి రచన వారి తండ్రిగారు పరమపదించినప్పటిది. తెలుగులోని ఉత్తమమైన "ఎలిజీ"లలో ఇది చెప్పుకోదగింది.

సజీవంగా 'శ్రీభాష్యం' నాయింట్లో తిరుగులాడి
భగవద్విషయం నా ముంగిట్లో పరిభవించి
నా కోసం శాస్త్రాలూ, ఇతిహాసపురాణాలూ
నా కోసమే రామాయణ భాగవతాలూ
గీతలూ, ఉపనిషత్తులూ
కలకల్లాడుతూ గంతులు వేస్తూ
నా సౌభాగ్యం అనుక్షణం పెంచుతూ
ఈ రాత్రి గడుస్తుందనుకున్నాను.

నాన్నా, మీ కోసం
మళ్ళీ సూర్యుడుదయిస్తాడనుకున్నాను..........

ఈ ఖండికలో అమాయకత్వం, ఆర్తం, దుఃఖం మొదలైన వివిధ భావాలు అడుగడుగునా మన మనస్సును ఆర్ద్రం చేస్తాయి—

పర్జన్యుడు పన్నీరు చల్లి దారిని సువాసితం చేస్తే
దివ్యపథాని సాగుతూ అనిలుడు వింజామరం వీస్తే
చుక్క ముందుకొచ్చి రేఖా హస్తం నెమ్మదిగా చాచితే
ఆకాశం బారసాచి ఆప్యాయంగా ముందుకొస్తే
పుడమి విరిసిపోయి ఆర్ద్రత్వం అందిస్తే
ఎందుకోననుకొన్నాను
మీ కోసం అనుకొన్నాను కాదు.
అందుకే
ఈ రాత్రి గడుస్తుందనుకున్నాను
నాన్నా! మీ కోసం
మళ్ళీ సూర్యుడుదయిస్తాడనుకున్నాను.

ఈ పద్యంలో పంచభూతాల లక్షణం దాన్ని తెలుసుకోలేని తన అమాయకత మనస్సును ఎంతో కలచి వేస్తుంది. "ఎన్ని ఉదయాలు మీరు చూడలేదు ఈ వచ్చే సూర్యోదయం మీకు ఎందుకు నచ్చలేదు"— ఇట్లాంటి ప్రశ్న పంక్తులు దుఃఖంలో లోతుగా మగ్నమైన లక్షణాన్ని స్ఫురింప జేస్తాయి.

"ఈ గుడ్డి దీపం మాయ వంటిది
వ్యక్తావ్యక్తాల్ని కలగా పులగం చేస్తుంది"
ఈ నక్క ఎగురందెపుడు?
దానికి ద్రాక్ష గుత్తి అందిందెప్పుడు?
ఈ దారెక్కడికి పోతుంది?
చెప్పేవాడు లేడు
ఈ ముళ్ళల్లో నడవడమెట్లా
చూపేవాడు లేడు
చేతిలో నీళ్ళు పారబోసి

మబ్బు నీళ్ళకెదురు చూస్తే
ఏ గాలికైనా మబ్బు చెదిరిపోవచ్చు
రేపందబోయేది
అదెంత అద్భుతమైందైతేనేం
ఇవ్వాల్టి అవసరాన్ని మాత్రం తీర్చదు''

ఇట్లాంటి క్లుప్తత తీవ్రత భావాలు గల పాదాలు ఎన్నో కనిపిస్తాయి. మనశ్చిత్రం. సమాజం ఎక్కడా కనిపించలేదు అనేవి సుదీర్ఘమైన కవితలు ఈ మొదటి దాంట్లో వర్తమాన కాలంలోని మానవుని అంతర్బహిః సంఘర్షణ, రెండవదానిలో సమాజమౌలిక లక్షణాల్ని కోల్పోయి డొల్లగా తయారైన సమాజస్వరూపం చిత్రింపబడింది. వచన పద్యంలో విసుగు కలిగించకుండా సుదీర్ఘ ఖండిక నిర్వహించడం కష్టమే కాని ఈ రెండు మనల్ని చివరిదాకా చదివిస్తాయి. 'మనశ్చిత్రం' రచనలో రెండు పాదాల పద్యంతో మొదలై ఒక్కొక్క పాదం పెరుగుతూ పదకొండు పాదాల పద్యందాకా మళ్ళీ అక్కడ్నుంచి ఒక్కొక్క పాదం తగ్గుతూ రెండు పాదాల పద్యంతో పూర్తవుతుంది. ఈ మనశ్చిత్రం అనే ఖండిక. ఇది వచన పద్య నిర్మాణంలో ఒక ప్రయోగం 'సమాజం ఎక్కడా కన్పించలేదు'లో —

''ప్రతివాడి నాల్క చివరా నాట్యం చేసే
ప్రతివాడి గుండెలపై కుంపటి పెట్టె
స్వరూప స్వభావాలతో
కరాళ భయంకర ప్రవృత్తితో
నిర్వచింపబడుతున్న - నిరూపించబడుతున్న
సమాజాన్ని చూడాల్నని
దానితో ఒకసారి మాట్లాడాల్నని
అడుగడుగునా వెతుకున్నా
అందర్నీ అడుగుతున్నా
అయ్యా!
ఎక్కడండీ సమాజం?
ఏదండీ దాని చిరునామా? — అని ప్రశ్నిస్తూ సమాజం కోసం అన్వేషణ ప్రారంభించినారు. 'అశల బతుకు' లో

ఎవరో అన్నారని కాదుగాని
అశల బతుకెంతో అందమైంది
అందులో ఎంతో ఆహ్లాదముంది

అందుకే అంతగా ఆకర్షకమైంది'- అని బ్రతుకు పై ఆశా వాదము పెంచుకోవాలన్నారు. ఆధునిక కవిత్వ సమీక్ష చేస్తూ జి. నాగయ్య గారు చేతనావర్త కవులను గూర్చి ఇలా అన్నారు. "వీరు అన్నిటికీ కేంద్ర మైన వ్యక్తిని, అన్ని దశల్లోనూ మానవ సమగ్ర వికాసమును తన కవితకు ప్రేరణములైన భావములలో చేర్చినారు. కాని మానవత ఆదర్శమే కాని ఆచరణ యోగ్యమయిన సిద్ధాంతము కాదని వీరి అభిప్రాయము. చేతనావర్త కవులది బుద్ధి గమ్యమగు కవిత్వము ఆత్మావలోకనము వలన జనించు అనుభూతి విశేషమునకు వీరు ప్రాధాన్యమిచ్చినారు"- (తెలుగు సాహిత్య సమీక్ష-రెండవ సంపుటి- పే. 724)

శ్రీ సంపత్కుమారాచార్యుల వారి చెప్పుకోదగిన ఇతర రచనలు 'వెలుగుబాట'అనే నాటికకు 1962లో ఆంధ్రప్రదేశ్ సమాచారశాఖ బహుమతి లభించింది. ఇది పల్లెటూళ్ళలోని పరిస్థితులనుగూర్చిన నాటిక'కల్హణుడు' కేంద్ర సాహిత్య ఆకాడమి వారికి అనువదించిన గ్రంథం (1983). 'భారతీయీకరణ' అముద్రిత గ్రంథం- ఇది బలరాజ్ మధోక్ రచించిన 'ఇండియనైజేషన్' అనే దానికి అనువాదం. 'మధుర గాథలు' కావ్యం సంపత్కుమారగారి ఆప్త మిత్రుడు హరీంద్రబాబు (ప్రస్తుతం నల్గొండ జిల్లాలో ఆంధ్రోపన్యాసకులు) గారి వివాహ సందర్భంలో కానుకగా ఇవ్వబడింది (1967 ) హాలుని గాథా సప్తశతి నుండి వంద పద్యాలను ఎన్నిక చేసి కోమటి వేమారెడ్డి "గాథా సప్త శతీసారము అనే పేరుతో వ్యాఖ్యానము వ్రాసినాడు. ఆ వంద పద్యాలను 'మధుర గాథలు' అనే పేరుతో గాథల ఛందస్సుకు సరిపోయే చిన్న ఛందస్సు అయిన ఆట వెలది పద్యాలలో సంపత్కుమారగారు అనువాదం చేసినారు. ఇంతకు ముందు గాథా సప్తశతిని రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు అనువదించి నారు. ఈ రెండనువాదాలను పోల్చిచూసుకుంటే సంపత్కుమారాచార్యుల గారి అనువాదంలోని విశేషాలు స్పష్టపడతాయి. సాహిత్య జగత్తులో కథానికను కూడా వీరు చేపట్టినారు. చెట్టు మొక్కలు, అనుప్రాస, అణ్వానంతర శాంతి, నిర్భాగ్యురాలు మొదలైన కథానికలు వివిధ పత్రికలలో ప్రచురితమైనవి. వీనిలో సమకాలీన సమాజంలోని సంక్షోభ చిత్రీకరణ కనిపిస్తుంది.

## సాహిత్యం, వ్యక్తిత్వం :

సంపత్కుమారాచార్యులు గారి కవిత్వం ప్రౌఢంగా, ధారాళంగా ఉంటుంది. కవిత్వంలో మానవతా ఆర్తి కనిపిస్తుంది. సున్నితమైన హృదయం వీరిది. ఏ విమర్శ చేసినా ఏ వ్యాసం వ్రాసినా ఊహా పోహలు కాకుండా తార్కికంగా అనేక ఉపపత్తులతో ప్రతిపాదనలు చేయడం వీరి ప్రత్యేకత. వీరి కవిత్వం పరిశీలించగా ఒక ప్రత్యేక ధోరణి స్ఫురిస్తుంది. కవితలలో వెలిబుచ్చిన భిన్న భిన్న భావాలు వారిపై అస్తిత్వవాద ప్రభావం, అభ్యుదయ, సాంప్రదాయిక ప్రభావాలు కలగలుపుగా పనిచేసినట్లు కన్పిస్తాయి. నిజ జీవితంలోని అనేక సంఘటనలు వారిని ప్రభావితుల్ని చేసినట్లు గమనించ గలము.

సంపత్కుమారాచార్యులుగారు మనకు సముద్రమంతటి గాంభీర్యంతో కనిపిస్తారు. వారిని చూసినపుడు దగ్గరకు వెళ్లాలంటే ఏదో జంకు మనను నెట్టేస్తుంది. కాస్త సాన్నిత్యం కల్పించుకొన్న తర్వాత సముద్ర గర్భంలో దాగిన మణుల్ని ఎలా చూడగలమో వారు అందించే అమూల్యమైన ప్రసంగాలే నిదర్శనం, ఎత్తైన విగ్రహం, ఆరోగ్యవంతంగా ఎప్పుడూ మందహాసంతో పలుకరించే మృదువైన భాషణ, నిండుగా కన్పించే వాత్సల్య సంపద వారి నుండి దూరము కానీదు. ఎంతటి కోపం తెప్పించే పరిస్థితి కలిగించి నాగాని హృదయానికి కించిత్ కఠినత్వం కలిగించే భాషణ చూడలేదంటే ఆశ్చర్యపడ కుండా వుండలేము. అసాధారణమైన విశేష కృషితో అత్యంత భావుకత్వంతో ఒక విషయాన్ని స్పష్టంగా నిరూపించగల ఉద్దండులు. ముఖ్యంగా వారిలో కనిపించే నిరాడంబరత్వం మనల్ని ముగ్ధుల్ని చేస్తుంది. వారి సతీమణి యైన శ్రీమతి లక్ష్మి నర్సమ్మగారు వారి భావాలకి అనగుణమైన ఇల్లాలు కావడం చేతనే వారి విశేష పాండితీ కృషికి మరింత వన్నె తెచ్చింది అని చెప్పవచ్చు.

1950 నుండి విశ్వనాథ సత్యనారాయణగారితో [అనుబంధం చిట్టి గూడూరులో ఉన్నప్పటి నుండి, ఎప్పుడూ కలుస్తూ సాహిత్య విషయంలో ప్రసంగములు చేయడం "ఆనందలహరి", "ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ సాంప్రదాయికరీతి" అనేవి విశ్వనాథ వారికి అంకితమివ్వడం వారి సాహితీ

జీవనంలో మధుర ఘట్టాలు. విశ్వనాధ సత్యనారాయణ గారంటేనే వారు అన్నిటినీ మర్చిపోతారు. అంతటి సాన్నిహిత్యం వారిది.

"మనసులో మాటలో నిండి ఆత్మ సంపత్ప్రసన్నముగ
తనిసికృష్ణాగౌతమీ తరంగ సంతతగాన కలిత
మనితరమౌ విశ్వనాధ సత్యనారాయణ కావ్య
ధుని చాలు నీ బ్రతుకెల్ల చైతన్యధునిగా స్రవింప"

అంతటి పారవశ్యం వారిది- (ఆ.తె.సా.వి.సా. అంకిత పద్యం)

వివిధ సాహితీ సంస్థలతో సంబంధం- కులపతి సమితి, సాహితీ బంధు బృందం సంస్థలతో సంబంధం. ముఖ్యంగా కులపతి సమితితో ప్రధాన అనుబంధం కలిగి వున్నారు. ఇవికాక జాతీయ సాహిత్య పరిషత్తు వరంగల్లు విభాగం అధ్యయన వేదిక, విశ్వనాధ పీఠం వీరి ఆలోచనా సరళికి రూపాలే.

ఈనాడు వరంగల్లులో మనకు కన్పిస్తున్న కొంత మంది ప్రముఖులు ఆయన శిష్యులనే చెప్పవచ్చును. వీరికి తెలియకుండా వీరి వ్యాసాలకు ఆకర్షితులై ఏకలవ్య శిష్యత్వం వహించిన వారు మరికొందరు.

# దేవులపల్లి రామానుజరావు

దేవులపల్లి రామానుజరావు

జననం : 25-8-1917

దేశాయిపేట, వరంగల్లు.

చిరునామా :

ఆంధ్ర సారస్వత పరిషత్తు
బొగ్గులకుంట, హైదరాబాద్.

ముద్రితాలు :

పచ్చతోరణం
సారస్వత నవనీతము
తెలుగు సీమలో సాంస్కృతిక పునరుజ్జీవనము
తెలంగాణాలో జాతీయోద్యమాలు
ఉపన్యాస తోరణము
వేగు జుక్కలు
తెనుగు సాహితి
యాభై సంవత్సరాల జ్ఞాపకాలు
తలపుల దుమారము మొ॥గునవి

# టి. శ్రీరంగస్వామి

టి. శ్రీరంగస్వామి
యం.ఏ.

జననం : 16-7-1950

ఇం.నెం 5-11-114/4
విద్యారణ్యపురి, వరంగల్లు 506009

ముద్రితములు :

మధుర (కవితా సంపుటి)
శిఖరం (కవితా సంపుటి)
మానస సంచరరే ... (కవితా సంపుటి)
విపంచి వ్యాస సంపుటి
వరంగల్లు జిల్లా రచయితల వాఙ్మయ జీవిత సూచిక
దేవులపల్లి రామానుజరావు - రేఖా చిత్రం
కోవెల సుప్రసన్నాచార్యులు వాఙ్మయ జీవిత సూచిక

అముద్రితాలు :

కొజరాటు ఏః శిలగ్రియుగోస్లావియాకవితలకు అనువాదం
20వ శతాబ్దపు ఉత్తరార్థ శతక సాహిత్య వికాసం
శ్రీ కాట్రగడ్డ సాహిత్య సమీక్ష

# దేవులపల్లి రామానుజరావు

"ప్రియ మిత్ర కళాభిజ్ఞః సాహితీరసికం సుధీః
రామానుజో గుణాబోధః జయమేతు శతం సమాః

— డా॥ దివాకర్ల

ఈ వ్యాసాన్ని మీకు అందించే ముందు, శ్రీ దేవులపల్లి రామానుజ రావుగారు అభిమానించే అప్పుడు, భావ కవితా ఉద్యమానికి ఆద్యుడు అయిన శ్రీ రాయప్రోలు సుబ్బారావు గారి కమనీయ పద్యమును ఒక దానిని ఇక్కడ చెప్పి వారి గురుత్వభావనకు ప్రతీకగా ఉంటుందనీ, అది సమంజసం అని కూడా భావిస్తున్నాను.

"మామిడి కొమ్మ మీఁద కల మంత్ర
పరాయణుడైన కోకిల
స్వామికి మ్రొక్కి యీ యభినవ
ధ్వని ధారణకుద్యమించితిన్
ఈ వికసించిన శ్రావణ
నిశీథమున గానబడిన నాదరసుతకు—

ప్రశమితమతినై యీ ప

ద్య శుభాంజలి నొసంగితి ప్రణయాద్యమసంచున్

శాశ్వత నవ్య స్ఫురణల

నశ్వర లావణ్యమై యెనయు కావ్య కళా

విశ్వమునందానందర

సైశ్వర్యములేలు కవితకంజలి యిత్తున్."

శ్రీ రామానుజరావుగారిది బహుముఖ ప్రజ్ఞ. ఇంగ్లీషు, తెనుగు ఉరుదూలలో నిగ్గయిన పాండిత్యం, న్యాయవాద పట్టభద్రుడు, మంచి రచయిత, కవి కలుపుగోలుతనము సరసత ఈయన కార్య నిర్వాహణ దక్షతకు పదను పెట్టినవి. ఈ కార్యాచరణ కౌశల్యం, ఆయన చేపట్టిన పనులకు, సంస్థలకు సుస్థిరతను గూర్చి, వాటి కీర్తిని పిండి ఆరబోసినట్లు పండు వెన్నెల గాయించినది. కాబట్టే తెలంగాణా సాంస్కృతిక సాహిత్య ఉద్యమాలలో రావుగారు ఒక ప్రముఖ పాత్ర అయినారు.

గోలకొండ పత్రికకు ఇరవై ఏండ్లు సంపాదకీయాలు వ్రాసినారు. చాలా ఏండ్లు ఉస్మానియా యూనివర్సిటి సిండికేటు, సెనేటులలో పలుకుబడి గలిగిన సభ్యుడిగా పనిచేసినారు. మధ్య మధ్య వైస్ ఛాన్సలరుగా పనిచేసినారు. రాజ్య సభలో సభ్యుడిగా ఉండినాడు. కొంత కాలం తెలంగాణా గ్రంథాలయ ఆంధ్రోద్యమాలలో చాలా లోతుగా దిగి పనిచేసినారు. జంటనగరాలలో ఒక ప్రతిష్టాపూర్ణ సంస్థ అయిన ఆంధ్ర సారస్వత పరిషత్తును నాటి, నీరుబోసి, పెంచి వివిధ శాఖలలో ఒక పెద్ద మ్రాకి చెట్టుగా చేసిన కార్యకర్తలలో వీరు తలమానిసి ఈ పని సేర్పరి ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ పుట్టినది మొదలు ప్రధానకార్యదర్శియై నేటి వరకు సమగ్ర ఆంధ్రావనిలో అభిమానానికి పాత్రులై దాని పేరు ప్రతిష్టలకు ఒక ఓగుపును సమకూర్చినారు. కేంద్ర సాహిత్య అకాడిమీలో రెండు తడవలు పదేండ్లు కార్యనిర్వాహక సంఘం సభ్యుడిగా కార్యసరణిలో తన ముద్రను అద్దినారు. నగర గ్రంథాలయ సంస్థ అధ్యక్ష పదవి ఈయనను వరించడంలో వింతలేదు. ఆయన రాణింపచేసిన గౌరవ పదవులలో ఇవి కొన్ని మాత్రమే.

కుల మత వర్గ భిత్తికలు విభాగించని విశాల హృదయం శ్రీ రావు గారిది. మాడపాటి హనుమంతరావు, బూర్గుల రామకృష్ణారావు, సురవరం ప్రతాపరెడ్డి మొదలగు పెద్దల అభిమానం పొందినవారు. వనపర్తి రాజా రామేశ్వరరావు, నూకల నరోత్తమరెడ్డి, ఎం. రామప్ప (రిటైర్డు కలెక్టరు) బొమ్మకంటి సత్యనారాయణ, గడియారం రామకృష్ణ మొదలగు ఆప్తులకు నోటిలోని నాలుక వంటాయన. ఇన్ని పదవులు పరిచయాలు చేకూర్చిన పలుకుబడిని, ఇతరుల సేవలకు సహాయాలకు వినియోగం చేసిన స్వార్థరహితుడు.

"మీజాన్" పత్రిక ద్వారా ''ఏకశిలానగర శిలాఫలక కలికల శోభా విభావరి" అన్న బిరుదాంకితుడూ, ఆంధ్ర సారస్వత పరిషత్తు పేరు, దేవులపల్లి రామానుజరావు పేరు కాకుండా రెండూ రామానుజరావుగారే అయి పరిషత్తు మే, 1943 సంవత్సరంలో స్థాపించిన నాటి నుండి నేటి వరకు సభ్యుడు, కార్యవర్గ సభ్యుడు పరోక్ష కార్యదర్శి, ఉపాధ్యక్షుడు, అధ్యక్షులుగా అనుబంధాన్ని అనురక్తిని పెంచుకుంటూ కొన్ని లక్షల మందికి (ఆంధ్ర సారస్వత పరిషత్తు ద్వారా పరీక్షల నిర్వహించి) ఉపాధిని కలిగించడమే ఆయన ధ్యేయం తను నమ్మిన సిద్ధాంతానికి నిరంతరం పోరాడుతూ దానిని సాధించుకోవడం ఆయన కర్తవ్యం 'పిట్టకొంచెం-పట్టు ఘనం'-"పొట్టివాడు-గట్టివాడు" అన్న నానుడిలకు నిదర్శనంగా ఈ నాడు వటవృక్షంలా నిలిచిన ఆంధ్ర సారస్వత పరిషత్తు వారి నిస్వార్థ సేవకు ప్రతీక- అందుకు ఆయన ప్రతిబింబం. అంతేకాదు శ్రీ రామానుజరావు గారి జీవన ప్రతిబింబానికి ఓ మచ్చుతునక.

శ్రీ రామానుజరావుగారు 25 ఆగస్టు 1917లో వరంగల్లు పట్టణానికి 8 కిలో మీటర్ల దూరములో నున్న దేశాయిపేట గ్రామంలో వేంకట చలపతిరావు, అండాళమ్మల ప్రథమ సంతానంగా జన్మించారు. వంగపాడుకు దత్తతగా వచ్చారు. వీరి నివాస స్థానము వరంగల్లులోని ఎల్లమ్మ బజారు. నాలుగవ ఫారం వరకు ఆయన విద్యాభ్యాసము ఇంటివద్దనే గడిచింది. నాలుగవ ఫారం చదువుకొనే నిమిత్తం ఆయన హన్మకొండలోని "కాలేజ్ ఏట్ హై స్కూల్''లో చేరారు. (ఇదే తర్వాత మల్టీపర్పస్ హైస్కూలుగాను, ప్రస్తుతం ప్రభుత్వ జూనియర్ కాలేజీగాను రూపాంతరం చెందింది.) ఆయన పాఠశాలలో చదువుకునేటప్పుడు ఆయన కొరకు పెద్ద గుర్రం టాంగా (జట్కా) ఒకటి ప్రత్యేకంగా మట్టెవాడ నుండి హనుమకొండకు వచ్చేదిపట. వీరు చిన్న నాటి

నుండే వయార్ద్రహృదయులు, మృదువుగా మెత్తగా మాట్లాడేవారు. (మాపేటి రాపుప్పగారు ఒకచోట అంటారు) వీరికి ఒక కుమారుడు, ఇద్దరు కుమార్తెలు. ఈనాటికీ ఆయనతో పరిచయం ఉన్నవారికి ఈ విషయం బోధకంగానే అగుపడుతుంది. శ్రీ రామానుజరావుగారు కుదుమట్టమైన మనిషి, సన్నగా చామన చాయ కలిగి, మధ్య పాపట కలిగి, కళ్ళద్దాలతో ముఖం కళకళలాడుతూ ఉంటుంది ఆ హసోన్ముఖునిలో కొంచెం హాస్య ప్రియుత కూడా కలదు. ఆ సహృదయుడు నవ్వుతూనే మాట్లాడిస్తాడు. ఆయన మాటల్లో హృదయ సంస్కారం కనబడుతుంది. కావ్యభాషలో మాటాడుతాడు. ఆయన యువకులలోనే లెక్క. ఆయన సాహిత్య పదసారం ఒక స్వర్ణోత్సవం. అంతేకాదు ఆయన ప్రాచీన కాలపు పండితుల శ్రేణిలో చేరని నవీన కాలపు పండితుడు. అంత మెత్తని వాడూ కాదు. అంతగడుసరీ కాదు. మొత్తానికి మెత్తగా ఉన్నట్లు కనిపించిన స్వీయభిప్రాయాలను వీడని ధీరచిత్తుడు. ఇంతైనా ఆయన కార్యవాదిగాని ఉద్గవాది మాత్రం కాదు. ఆయన వ్యవస్థాపకుడు, కార్యకర్త కూడా.

ఈయనను మనం పొట్టివాడుగా భావిస్తే మాత్రం, పొట్టివాడే అయినా తన కంటే చాలా పొడుగైన వారి ఎదుట నిటారుగా నిలబడే శక్తి ఈయనకుంది. నిలబడి ధైర్యంగా మాట్లాడగలడు అని ఆయన యాభై ఏళ్ళ జ్ఞాపకాలు పరికించినప్పుడు మనకు తెలుస్తుంది. నిలబడటం అంటే ఊరికే నిలబడటం కాదు, మనిషి పెరగగలడు ఎంత ఎత్తుకు కావాలంటే అంత ఎత్తుకు పెరగగలడు. ఈయన దగ్గర ఇంకో విచిత్రం ఉంది. ఎదుటనున్న వ్యక్తి ఎంత ఎత్తో అంత ఎత్తుకు మాత్రమే పెరిగి ఊరుకోడు. ఆయన కంటే పైకి ఎదిగి, అక్కడ నుంచి క్రిందికి చూస్తాడు చిరునవ్వులు కురిపిస్తూ.

శ్రీ రామానుజరావుగారు మద్రాసు విశ్వవిద్యాలయము నుండి పట్టభద్రులైనారు. తరువాత నాగపూర్ విశ్వవిద్యాలయం నుండి ఎల్.ఎల్.బి. పట్టాను పొందినారు. నాగపూరులో డా॥ నటరాజ రామకృష్ణ తదితరుల చేత పరిచయం కలిగింది. ఆ కాలములోనే తెలుగు సాహిత్యం మందు అభిలాష కలగడంతో వరంగల్లులో "శోభ" పత్రికను స్థాపించి నడిపించినారు. విద్యాభ్యాసం తర్వాత కొంత కాలం గ్రంథాలయోద్యమమునకు తన సేవలను అందించినారు. 1941 సంవత్సరంలో వరంగల్లు పట్టణములో శబ్దానుశాసన ఆంధ్ర భాషానిలయమునకు కార్యదర్శిగా ఉండి దాని రజతోత్సవమును జరిపిం

చినారు. 1942 ప్రాంతంలో తెలంగాణా పత్రికకు సాహిత్య వ్యాసములను పంపుతుండేవారు. 1945-46లలో వరంగల్లు యువజన కాంగ్రెసునకు అధ్యక్షులుగా ఎన్నుకొనబడినారు. వీరి ఆధ్వర్యములో నిర్వహిస్తున్న సాహిత్య పత్రికను రాజకీయ విషయాలకు ఉపయోగించుటకు ససేమిరా అంగీకరించలేదు.

గోలకొండ పత్రికలో ఉప సంపాదక పదవికి సురవరం ప్రతాపరెడ్డి గారు ఆహ్వానించినారు. ఆయన తన అభిప్రాయాలను నిర్భయంగా ఇందులో ప్రతిబింబింపచేస్తూ, కర్తవ్య నిర్వహణను సాగించినారు. 1949-50లందు హైద్రాబాద్ రాష్ట్ర కాంగ్రెస్ ఎలక్షన్ ట్రిబ్యునల్ సభ్యులుగా పనిచేసిరి. 1955లో అలంపూరు తాలూకా కాంగ్రెసు ఎన్నికలకు రిటర్నింగు ఆఫీసర్‌గా నియమితులైనారు. 1960-62 సం॥లలో సాహిత్య ప్రతినిధిగా రాజ్యసభ సభ్యులుగా పనిచేసినారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో 1950 నుండి 1979 వరకు సెనేటు సభ్యుడుగా, సిండికేటు మెంబరుగా, ఎగ్జిక్యూటివ్ కమిటీ మెంబరుగా, ఆక్టింగు వైస్ ఛాన్సలర్‌గా 3 సార్లు పదవులను నిర్వహించినారు. ప్రస్తుతం ఆంధ్ర ప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం ( A. P. Open University ) ఎగ్జిక్యూటివ్ కమిటీ సభ్యులుగా కూడా ఉండినారు. తెలుగు విశ్వవిద్యాలయం సిండికేటు సభ్యులుగా ఉన్నారు రెండు మూడు సంవత్సరాలు. కేంద్ర విశ్వవిద్యాలయం (హైద్రాబాద్ సెంట్రల్ యూనివర్శిటీ) ఎగ్జిక్యూటివ్ కమిటీ సభ్యులుగా 1974-77 ప్రాంతంలో పనిచేసినారు.

వీరి మొట్టమొదటి గ్రంథం ఖండకావ్యం. అది ''పచ్చతోరణం'' శ్రీ రామానుజారావుగారి భావుకతకు అది ప్రతీక. 'సంక్రాంతి' ఆయన వర్ణించిన తీరు అమోఘం.

"కుంకుమంబులు చల్లి గొబ్బి ముద్దలు పెట్టి
పగడాల సొగసును పరిహసింప
పక్షి వ్రాలిన భంగి పసుపు ముగ్గులు దీర్చ
పుష్యరాగంబుల పొలుపుమీర
రంగారదీర్చిన రంగవల్లిక గుంపు
కన్నెతీగలవోలె వన్నె గుల్క
జడలోని పూవులు జారి యుండినచోటు
ముత్యాల ముగ్గుతో ముచ్చటాడ

చీరకుచ్చిళ్ళు పసిమల చిందులాడ
తెనుగువాకింట్ల దిరిగెడు తీగబోండ్లు
సరస సల్లాపములుసేయు సమయమందు
పుట్టినింటికి వచ్చెను పుష్యలక్ష్మి"

ఆయన సంక్రాంతి లక్ష్మిని ప్రతిబింబించిన తీరు అది. ఆస్వాగతం లోనే లలితమాధుర్యమైన పదసంఘటనను మనం పరవశంతో చదువుకొన వచ్చును.

వీరి పుస్తకాలలో చెప్పుకొనదగినది, మణిపీఠం అలంకరించిన గ్రంథం "సారస్వత నవనీతము'. వీరి ఉత్తమ సాహిత్య విమర్శకు ఆధారం గాను, వీరి తులనాత్మక శక్తిని, వీరిలోని విమరకుడ్నిని ఆయనలోని నిశితమైన పరిశీలనాధోరణి ఇందులో ద్యోతకము అవుతుంది. ఈ పుస్తకం ఆధారం నే అని అనుకున్నప్పటికిని వీరిని కేంద్ర సాహిత్య అకాడమీ కౌన్సిలు సభ్యులుగా ఎన్నుకొనుటకు కారణభూతము అయినది. శ్రీ కృష్ణదేవరాయల వారి "దేశ భాష లలో తెలుగులెస్స" అన్న వాక్యానికి పరమార్థంగా తెలుగు భాషలోని తియ్య దనమును గుర్తించి ఉర్దూలో 'తెలుగు సాహిత్య చరిత్ర'ను ప్రచురించినారు. వీరి సాహిత్యాభిలాష కారణముగా రవీంద్రనాధ ఠాగూర్ శతవార్షిక జయంతి సంఘటనకు కార్యదర్శిగాను, గురజాడ శతవార్షిక జయంతి సంచిక సంపాదకు లుగాను వ్యవహరించి వాటిని దిగ్విజయము చేసి 1974-75లో ప్రపంచ తెలుగు మహాసభకు కోశాధికారిగా, వాటికి ఎంతో గణతను చేకూర్చినారు. కేంద్ర సాహిత్య అకాడమీ తెలుగు సలహా సంఘంలో 20 సం॥లు Genral Council త ర్వాత 15 సం॥లు Executive Council లలో పనిచేసినారు.

శ్రీ రామానుజరావుగారు బమ్మెరపోతన కేవలం భక్త కవియే కాదు సహజసిద్ధమైన శృంగార కవి అనియు, శృంగార నైషధమును రచించిన శ్రీనాదుడు కూడా పోతనామాత్యుడితో సరితూగ లేడని (సారస్వత నవనీతము పుట 230)లో విమర్శనాత్మకముగా వివరించి చూపినారు. అంతేకాక సూరన అయిదు తరాల శృంగారమును చిత్రించితే, పోతన ఆరువది తరాల శృంగారమును చిత్రించినాడు అని నిర్మాణాత్మకమైన మనోరంజకమైన విమర్శన గావించి ఉన్నాడు. పోతన భక్తి రసములో నుండి శృంగారంను వెలికి తీసి వారి శృంగార భావనను అందించిన వారిలోని పరిశీలనకు, భావనకు మనం

జోహార్లు అర్పించాలి. భాగవతమును నూత్న దృష్టితో పరికించడానికి అవకాశ మిచ్చినందులకు ఆయనకు ధన్యవాదాలు చెప్పాలి..

ఒక చోట రామానుజరావు గారు 'ఒక జాతి సారస్వతము ఆ జాతి జాతీయ జీవనమునకద్దము వంటిదని' అంటారు. రావుగారు పుట్టి పెరిగిన కుటుంబంలో ఉన్న వసతినీ, ఆనాటి అవకాశాలనూ, చదివిన చదువునూ, ఈనాడు వారు ఆంధ్ర సారస్వత పరిషత్తు ఆవరణలో ఓ చిన్న గదిలో కూర్చునే తీరునూ తలచుకుంటే కొంత ఆశ్చర్యము కలుగకమానదు. వీరు పుట్టింది భూస్వామ్య వర్గానికి చెందిన కుటుంబం కాబట్టి భూ వసతి బాగా ఉన్నది ఆ వసతి చూసుకొని అక్కడే స్థిరపడితే ఈనాటికి సిరిసంపదలతో తులతూగే భూస్వామిగా కనిపించేవారు. వాటికి ఆయన లోభపడ లేదు. 1939 నాటికే పట్టభద్రుడు అయిన వీరు ఆనాటి అవకాశాలు సరి చూసుకొని నిజాం ప్రభుత్వంలో ఉద్యోగిగా చేరినా పించన్ పుచ్చుకొనే నాటికి తప్పకుండా అత్యున్నత కార్యదర్శి హోదాలో ఉండేవారు. ఉన్నతోద్యోగ భవిష్యత్తును కూడా వారు ఆశించలేదు. వకీలు వృత్తిలో స్థిరపడినా నేటి సుసంపన్న న్యాయవాదుల్లో ఒకరుగా కనిపించేవారు. చదివింది న్యాయ శాస్త్రం అయినా మీరు సాహిత్య విమర్శకు మంచి మెరుగులు దిద్దారే? ఏ ప్రభావం వల్ల? అని ఎవరైనను అడిగితే ఆయన నుండి వచ్చే సమాధానం ఇది. సాహిత్యం, ముఖ్యంగా నవ్య సాహిత్యం అంటే నాకు మొదటి నుంచీ ఇష్టమే. పూర్వ పద్ధతిలో వ్యాకరణం, అలంకార శాస్త్రం వంటివి నేను చదువలేదు, వాటి సంగతి నాకు తెలియదు. కాని చిన్నప్పుడు "ఆంధ్ర ప్రచారిణి" నవలలు బాగా చదివాను. అవి చదవడం వల్లనే నాకు తెలుగు సాహిత్య పఠనాభిరుచి, క్రమంగా రచనాభిరుచి కూడా పెరిగింది. అంతే, ఇదంతా నాయంతకు నేనే తీరిక సమయాల్లో నేర్చిన తెలుగేనని నిర్మొహమాటంగా, నిస్సంకోచంగా చెప్తుతారు.

అంతేకాదు "ఆ రోజుల్లో ఆంధ్ర – తెలంగాణాల మధ్య సేతువు నిర్మించిన నాటక ప్రదర్శనలు, అవధానాలు, గ్రంథాలయాలు, నవలలు, పత్రికలు మొదలైనవి. నా మట్టుకు నేను చిన్నతనంలోనే తెలుగు సాహిత్యము వైపు ఆకర్షితుడనుకావడానికి ఇవీ కారణం. మైలవరం కంపెనీవారి నాటకాలను చూచి, అందులో కపిలవాయి రామనాథశాస్త్రి, ఉప్పలూరి సంజీవరావు, వేమూరి

నగ్గయ్య మొదలైనవారు ఆడిన నాటకాలను చూచి, అవధాన సభల్లో పద్యాలు విని, గ్రంథాలయ వార్షికోత్సవాలలో సాహిత్యోపన్యాసాలు విని. ధర్మవరం, చిలకమర్తి, పానుగంటి ప్రభృతుల నాటకాలు కొన్ని చదివి విజ్ఞాన చంద్రికా మండలి, ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాలలు నవలలు కొన్ని పఠించి, ఆంధ్ర కృష్ణా పత్రికలను అప్పుడప్పుడు చదువుతూ, నీలగిరి, తెనుగు, గోలకొండ పత్రికలను చదువుతూ తెలుగు సాహిత్యంవైపు అభిముఖుడైనాను. చిన్న వయస్సులో సాహిత్యంతో కలిగిన ఆ సంబంధం నాటికీ, నేటికీ తెగిపోక దృఢంగా ఉన్నది'' అని యాభై సంవత్సరాల జ్ఞాపకాలు (1929 నుండి 1979)లో రామానుజరావు గారొక చోట చెప్పినారు.

శ్రీ రామానుజారావు గారు ''మా ఊరు ఓరుగల్లు'' అనువ్యాసములో వరంగల్లు నగరమును ఇలా వర్ణిస్తాడు.

"కాబోలు నియ్యది కాకతీయులొకప్డు
కరకు నెత్తుట కత్తి కడుగు చోటు
కాబోలు నీద్వార కళ్యాణ వేదిక
అలికి ముగ్గులు పెట్టె తెలుగు పడుచు
కాబోలు నీజీర్ణకమనీయ సౌధాన
సుకుమార శిల్పముల్ సొంపులొలికె
కాబోలు నీవీధికాపురంబొనరించె
పైడి మేడలలోన భాగ్యలక్ష్మి
ఇచటనే నిల్చి కాబోలు నిందుముఖులు
ఆయుధంబులు పూజించియరుగుదెంచు
ఆంధ్ర సేనకు కప్పురంపుటారతులను
ఇచ్చి వారల శౌర్యంబు మెచ్చినారు,

(పచ్చతోరణం పుట-17)

ఈ పద్యం చదివినపుడు శిథిలావస్థలోనున్న వరంగల్లు పురా చరిత్రను మన ముందు ప్రతిబింబింప చేసినారు. ''కదనరంగమే కాక మా ఊరు కళాక్షేత్రము కూడా. సంగీతం, సాహిత్యం, చిత్రలేఖనం, శిల్పం మొదలైన కళలు మా ఊరిలో కాకతీయ ప్రభువుల ఆధ్వర్యాన వేయి ముఖాలుగా విస్తరించినవి. కాకతీయ ప్రభువుల పోషణలో ప్రోత్సాహముతో తెలుగు భాష,

తెలుగు సాహిత్యము, తెలుగు కళలు అద్వితీయముగా అభివృద్ధి చెందినవి. నాడు తెలుగు భాష దాదాపుగా అధికార భాషగా అమలులోనికి వచ్చినది. కాకతీయ ప్రభువులు తెలుగులో శాసనాలను వ్రాయించినారు. వరంగల్లు కోటలో కట్టడాలు, వేయి స్తంభాల దేవాలయము, పద్మాక్షీ దేవాలయము మొదలైన ఆలయాలు యీ రోజు శిథిలమైనప్పటికినీ నాడు శిల్పము, సంగీతము, చిత్రలేఖనము నృత్యము వంటి కళలు సాధించిన అత్యున్నత స్థాయికి సాక్షీభూతంగా సజీవ నిదర్శనాలుగా నిలిచి ఉన్నవి అని (నా రేడియో ప్రసంగాలు పుట-81) 'మా ఊరు ఓరుగల్లు' వ్యాసంలో అంటారు. మాతృభూమిని, మాతృ భాషని మరచినవాడు, మరణించినవాడితో సమానము. రామానుజరావుగారికి తాను పుట్టిన గడ్డపై ఎంత మమకారమో "గడిచిపోయిన ఆనాటి చరిత్రలోనే కాదు, జరుగుతున్న ఈనాటి చరిత్రలోను. రేపు జరుగనున్న చరిత్రలోను మా ఊరు వరంగల్ గణనీయమైనది" (నా రేడియో ప్రసంగాలు పుట - 86) అని సగర్వంగా చాటుచున్నారు. సాహిత్య సంపదలో తెలంగాణా వెనుకబడిన ప్రాంతమనే కొందరి అభిప్రాయాన్ని రామానుజరావుగారు "తెలంగాణాలోని గ్రామాలలో తాళపత్రి గ్రంథాలు లేని ఊరు లేనేలేదని చెప్పితే అతిశయోక్తి కాజాలదు" అని సహేతుకంగా వివరించారు. (సాహిత్యోపన్యాసాలు పుట - 7)

శ్రీ రామానుజరావుగారు కేవలం సాహిత్య వికాసమునకు మాత్రమే తన సేవలను పణం పెట్టకుండా సాంస్కృతిక పునరుజ్జీవనంకు కూడా ఆయన ఎంతగానో సేవ చేసారు. శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం నిలద్రొక్కుకొనుటలోను, ఆంధ్ర సారస్వత పరిషత్తు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ భవనాలు, వాటి ఉనికి స్థిరంగా ఉండటంలోను ఆయన ప్రతిక్షణం అవిరళకృషిని మనం ఒకమారి వెనుతిరిగి చూడాల్సి ఉంటుంది. అంతేకాదు ఆయనలోని అంకితిత సాధనా పటిమకు అవి మూల స్థంభాలుగా నిలుస్తాయి. అంతేకాదు ఉస్మానియా విశ్వవిద్యాలయంను హిందీ విశ్వవిద్యాలయంగా మార్చివేయడానికి జరిగిన ప్రయత్నాలను వమ్ము చేయడంలోను, అందులోనూ తెలుగు భాషను నిర్బంధ భాషగా ప్రవేశపెట్టడంలో ఆయన సాధించిన ఫలితం, అందుకు ఆయన సమిష్టిగా సాధించిన ఫలితం ఈనాడు మనమందరం అనుభవిస్తున్నది అయినప్పటికిని, ఎంతమందికి అది తెలుసు. అప్పటి విద్యాశాఖ మంత్రి శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారు పరిషత్తు కృషిని గూర్చి ఇలా ప్రశంసించారు "సూర్యుని వెలుతురు వలె పరిషత్తు ఉద్యమము పల్లపల్లెకు వ్యాపించి అజ్ఞాన

తమస్సును నివారించుచున్నదని" దేవులపల్లి రామానుజరావు గారికి, మాడపాటి హనుమంతరావు, సురవరం ప్రతాపరెడ్డి, కొమర్రాజు లక్ష్మణరావుగారల సహకారం దొరకడం, నిప్పుకు గాలి తోడైనట్టుగా ఆంధ్రోద్యమం తెలంగాణాలో మొత్తం వ్యాపించి తెలుగు సాహిత్య వీథులలో వీరవిహారం చేస్తూ, పునరుజ్జీవనమునకు అది నాందిపలికింది. దీనికి తోడుగా ఆంధ్ర సారస్వత పరిషత్తు కృషిని కేంద్ర సాహిత్య అకాడమీ వారు గుర్తించి ప్రోత్సహించడం దానికి మరింత వన్నె తెచ్చింది. రామానుజరావుగారు ఒకచోట అంటారు నైజాం ప్రభుత్వం కాలంలో సభలు పెట్టుకోవడం ఇబ్బందికావడం, డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ గారిని రాష్ట్ర ప్రభుత్వం అనుమతి లేకుండానే ఆహ్వానించడం ఆయన అంగీకరించి ఆలంపురం సభలకు వచ్చి కొంతసేపు ఆంగ్లంలోను, తెలుగులోను మాట్లాడి మా అందరిని ఆశీర్వదించి, మా ఆంధ్ర సారస్వత పరిషత్తు సప్తమ వార్షికోత్సవంను జయప్రదం చేసినారని అన్నారు ఈ సంఘటన 1953లో జరిగినది. (యాభై సంవత్సరాల జ్ఞాపకాలు- పుట 29)

శ్రీ రామానుజరావుగారికి కలిగిన అదృష్టాలలో మరొకటి వీరు భారతకోకిల శ్రీమతి సరోజినీనాయుడు గారితో హైద్రాబాద్‌లో ప్రత్యక్షంగా, సన్నిహితంగా గడపడానికి అవకాశం కలిగింది. ఆమె చేసిన ఎన్నో ప్రసంగాలను ఆయన చెవుల్లో గింగుర్లు తిరుగుతున్నాయి అని అంటారు ఆమె చెప్పిన ఒక ఉర్దూ ఖండికను వారు ఉపహరించారు.

"బుల్ బుల్‌కు గుల్ ముబారక్
గుల్ కూ చమన్ ముబారక్
రంగీన్ తబీయతోంకు
రంగీన్ సుఖున్ ముబారక్"

ఈ ఖండికను ఆమె హైదరాబాద్‌లో హోలీ పండుగ సందర్భంగా చెప్పినారట. ఆ గతస్మృతులను తలచుకుంటూ, మహానాయకులను గుర్తుచేస్తూ తమ జ్ఞాపకాలలో ఒక చోట ఇలా అంటారు. "నిజానికది మహోన్నతమైన మహోదాత్తమైన వ్యక్తిత్వము సంస్కృతీ గల నాయకుల యుగం. వారందరూ రాజకీయరంగంలోను, విజ్ఞాన రంగంలోను అతిరథమహారథులైన సవ్యసాచులు త్యాగమూర్తులు, భారతదేశ వైతాళికులు, యువకులుగా, విద్యార్థులు వారి నుండి ఉత్తేజం పొందేవారు'.

"ఆంధ్ర సారస్వత పరిషత్తుతో వివిధ సమస్యలపై భిన్నాభిప్రాయాలు కలవారు. రాజకీయంగా, సాంఘికంగా ప్రత్యేక దృక్పథం కలిగినవారు అందరు సహకరించినారు. కావుననే సారస్వత పరిషత్తు ప్రజల సంస్థ, తెలుగు భాషా సంస్కృతుల పరిరక్షణ కొరకు అంకితమైన సాంస్కృతిక సంస్థ. నాటి నుండి ఈ పరిషత్తు నిరంతరాయంగా అభివృద్ధి పథంలో ముందడుగు వేస్తూ భాషారంగంలో చరిత్రాత్మకమైన కృషి చేసినది' అని అంటారు.

ఈ నాడు విద్యాభ్యాసములో ఉర్దు మాధ్యమికత కేవలం ముస్లిము సోదరులకే పరిమితము అయిపోయినది కాని, తెలంగాణాలో 1950కు ముందు నిజాం రాష్ట్రపాలనలో ఉర్దు మాధ్యమికంగాను, ప్రథమ భాషగాను దానికి ప్రాధాన్యత ఉండేది, దానితో పాటుగా ఫారసీ భాష కూడా ప్రముఖంగా ఉండేది. ఈ ప్రాచుర్యమును గమనించే ఆయన తెలుగు సాహిత్య చరిత్రను ఉర్దులో రచించినారు. అంతే కాకుండా అనాటి తెలుగు భాషపై ఫారసీ. ఉర్దు భాషల ప్రభావము గాఢంగా ఉందని చెప్పుతూ, శ్రీనాథుని కాలంలో కూడా శ్రీనాథుడు, జక్కన, గోగులపాటి కూర్మనాథ కవుల కవిత్వంలో కూడా ఈ పదాలు చోటు చేసుకున్నాయని చెప్పుతూ కొన్ని పద్యాలను పేర్కొన్నాడు కూడా. శ్రీనాథుడు వాడిన ఒక పద్యం.(నా సాహిత్యోపన్యాసాలు- పుట-36)

"పూజారి వారి కోడలు
తాజాపగ బిందె జారి దబ్బున బడియెన్
మైజారు కొంగుదడిసిన
బాజారే తిరిగి చూచి ఫక్కున నవ్వెన్",

ఇక్కడ 'బాజారు' అనే పదం గమనించాల్సి ఉంటుంది. ఇక్కడ ఈ విషయం ప్రస్తావించడం ఎందుకంటే ఆయనలోని నిరంతర పఠనం, విమర్శక ధోరణి, సునిశిత పరిశీలనను మీ ముందుంచడమునకే ఇక్కడ చెప్పడం జరిగింది.

శ్రీ రామానుజరావు గారి ప్రోత్సాహ ప్రచారములను పొంది మహాకవులుగా, గ్రంథకర్తలుగా, కళాప్రపూర్ణులుగా, ఆస్థాన కవులుగా, ఉత్తమోత్తమ బహుమతి గ్రహీతలుగా వెలసిన యువ కవులు, రచయితలు ఎందరో ఉన్నారు. దేశ సౌభాగ్యమే తన సౌభాగ్యమని భావించి అడిగిన ప్రతివ్యక్తికి

సహాయము చేసిన ఉదారహృదయుడాయన. ప్రతి కవి వ్రాసిన కావ్యమునకు ఆవిష్కరణోత్సవ సౌకర్యం కలిగించుటకు పరిషత్ ప్రణాళికలో చేర్చిన అయన సౌహార్ద్రము మెచ్చదగినట్టిది. ఆయన స్వయముగా కవి, విమర్శకుడు, కృతి భర్త. ఆయనకెందరోకవులు, రచయితలు తమ కావ్యములను అంకితం చేసి ధన్యులైనారు (శ్రీలేఖ సాహితి కూడా తన వంతు కర్తవ్యంగా శుక్ల కవితా సంకలనం చంద్రునికో నూలు పోగులా 1989 ఉగాదినాడు అంకితంఇచ్చింది) అంతేకాదు పరిపాలనా దక్షుడైన ఆయన సన్నిధిలో అలసత్వమునకు, నిర్లక్ష్యమునకు, ఏమరుపాటుకు, వ్యక్తి విమర్శకు తావులేదు. బి.ఏ., ఎల్.ఎల్.బి. పట్టము వహించి, రాజకీయవేత్తయైన ఇట్టి మనీషి దొరకుట చేతనే ఆంధ్ర సారస్వత మందారము వికసించి పరిమళించినది. జీవితమును సారస్వత సేవకే ధారబోసిన శ్రీ రామానుజరావుగారు ఎంతో ధన్యులు. అంతేకాదు ఈయన కర్మయోగి.

"దిన పూర్వ పరభాగజనితమైన ఛాయ పోలిక నుండు

కుజన సజ్జనుల మైత్రి"-అన్నట్లుగా జాతి మత కుల వివక్షతల నెరుగని ఈ తెలంగాణా తెనుగు బిడ్డ మైత్రి అట్టిది: ఈయన హృదయం స్నేహ మగ్ధ పూర్ణము. తెలంగాణాలో శ్రీ రామానుజరావుగారు పాల్గొనిదీపింపచేయని ఉద్యమము లేదు, పాలించి పెంచని సంస్థలేదు. విశాలాంధ్ర ఏర్పడిన తర్వాత సమగ్ర ఆంధ్ర జీవిత చీనాంబరానికి ఓతప్రోతయై ఉభయ ప్రాంతాల మధ్య స్నేహసేతువైనారు. ఈయన కీర్తి, యీయన మూర్తిని మించినది అని డా॥ మడుపూరు కోదండ రామరెడ్డిగారు ప్రశంసించారు.

తన జాతి సంస్కృతీ సంపదను తన వారికి ప్రదర్శించి, వారిలో ఆత్మ గౌరవాన్ని కలిగించి, ఉత్తేజాన్ని కలిగించటమే రామానుజరావుగారు తమ సాహిత్య కృషికి లక్ష్యంగా పెట్టుకున్నారు.

శ్రీరామానుజరావుగారు వెలువరించిన గ్రంథాలు ఇవి.

1) పచ్చతోరణం (ఖండకావ్యము)
2) సారస్వత నవనీతము
3) తెలుగు సీమలో సాంస్కృతిక పునరుజ్జీవనము
4) తెలంగాణాలో జాతీయోద్యమాలు

5) నా రేడియో ప్రసంగాలు
6) ఉపన్యాస తోరణము
7) నా సాహిత్యోపన్యాసాలు
8) వేగుజుక్కలు
9) తెనుగు సాహితి
10) యాభై సంవత్సరాల జ్ఞాపకాలు (1929 నుండి 1979 వరకు)
11) తలపుల దుమారము
12) పంచవర్ష పత్రికాశికలు
13) బంకించంద్ర ఛటర్జీ జీవితము
14) హైద్రాబాదులో స్వాతంత్ర్యోద్యమం
15) ఆక్స్‌ఫర్డ్ డిక్షనరీ (బాలుర కొరకు–సచిత్రంగా)
16) మనదేశం – తెలుగు సీమ (బాలల కొరకు ఉద్దేశించినవి)
17) జవహర్‌లాల్ నెహ్రూ ”
18) గౌతమ బుద్ధుడు ”
19) కావ్యమాల–II – సంపాదకుడు కేంద్ర సాహిత్య అకాడమీ ప్రచురణ (ఇది కేవలం స్వాతంత్ర్యానంతరం వచ్చిన కవితల సంకలనం)

సంపాదకత్వం వహించినవి :–

1) శోభ సాహిత్య మాస పత్రిక (1945-46 & 50-52)
2) గోల్కొండ దినపత్రిక సహాయ సంపాదకుడు (48-64)
3) గురజాడ శతవార్షికోత్సవ సంచిక (తెలుగు–ఆంగ్లం) (1962-64)
4) రవీంద్రనాధ ఠాగూరు శత వార్షికోత్సవ సంచిక (1960-61)
5) రెండవ ప్రపంచ తెలుగు మహా సభల ప్రత్యేక సంచిక (1981)

శ్రీరామానుజరావుగారు అంకితము తీసుకున్న గ్రంధాలు దాదాపుగా 30 కృతులు. వీటిలో డా॥ దాశరథి, మునిమాణిక్యం, నరసింహారావు, గుంటూరు శేషేంద్రశర్మ, డా॥ సి. నారాయణరెడ్డి, శివశంకరస్వామి, తూమాటి దోణప్ప, డా॥ పల్లా దుర్గయ్య. డా॥ బోయి భీమన్న, తదితర శ్రీలేఖ సాహితి ప్రచురించిన 'ఋక్కు' కవితా సంకలనం దీనికి సంపాదకుడు టి. శ్రీరంగస్వామి పుస్తకాలు కూడా చోటుచేసుకున్నాయి.

శ్రీ రామానుజరావుగారు ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి, ఆంధ్ర సారస్వత పరిషత్తు ద్వారా ఎంతో మంది రచయితలతో ప్రత్యక్ష పరిచయం, సన్నిహితత్వం ఉన్నందు వలన వారి మనస్తత్త్వములను పరిశీలించినాడు కాబట్టే ఆయన "నల్లగొండ జిల్లా రచయితల ప్రారంభోపన్యాసములో" ఇలా అంటాడు. 'రచయితకు సలహా ఇవ్వడం, ఉపదేశం ఇవ్వడం నా ఉద్దేశం కాదు, ఒక అభిప్రాయాన్ని రుద్దటం కూడా నా అభిమతం కాదు. అయినా రచయితలను గురించి చాలామందిలో వినవస్తున్న అభిప్రాయాలను మీముందుంచడం అసమంజసమూ, అప్రస్తుతము కాదనుకుంటాను. సమకాలీన వ్యక్తుల ఆలోచనలలో, చిత్తవృత్తులలో వస్తున్న మార్పు వేగాన్ని అందుకొనడానికి రచయితలకు సాధ్యం కావడంలేదు. అతనికి పరిశీలనా శక్తి లేదు. దానికి కావలసిన ఓపిక, ఓర్పూ అతనికి లేదు. సామాజిక స్పృహతో సరియైన సంబంధంలేదు. వారి రచనలకూ, వారు నివసిస్తున్న జీవితానికి మధ్య పెద్ద అఖాతం ఉన్నది. రచయిత తాను సామాన్య జనానికి అతీతుణ్ణని భావిస్తున్నట్లు తనకు సమాజంలో ప్రత్యేకమైన స్థానం ఇవ్వాలని ఆశిస్తున్నట్లు కనిపిస్తుంది. రచయిత ఉపదేష్ట మాత్రమే కాదు ఆదర్శమూర్తి కావలె- చేతలకూ, మాటలకూ గల అఖాతాన్ని ఎంతగా తగ్గించే ప్రయత్నం చేస్తే అంతగా రచయిత జనానికి సన్నిహితం అయ్యే అవకాశం ఉంది. రచయిత తాను కట్టుకున్న గూడు నుంచి బయటపడాలె. తాను గీసుకొన్న పరిధిని దాటి వచ్చి జనం జీవనాడిని పట్టుగలగాలె. రచయిత పరస్పర మాత్సర్యాన్ని వదిలి పెట్టాలె. అప్పుడే జనము తన్ని గుర్తిస్తారు''. అంతేకాదు ''రచయితలు చాలా మంది స్వేచ్ఛను ఏరించి మాట్లాడుతుంటారు. ఈ రోజు చాలా మంది రచయితలు తమకుతామే బానిసలు. అవకాశాలకు బానిసలు. కొందరు రాచరికపు వ్యవస్థలోని వందిమాగధులకు ఏమాత్రం తీసిపోరనే అభిప్రాయం కూడా ఉన్నది. సమాజం బాధ్యతను స్వయం సేవకుడిగా స్వీకరించవలసిన రచయిత తన అవకాశాలకు తన వ్యక్తిత్వాన్నే పణం పెట్టినప్పుడు తనకే కాదు, తన భాగస్వామి అయిన సమాజానికే అన్యాయం చేసుకున్న వాడౌతాడు, రచయిత స్వేచ్ఛకు తానే శత్రువు కాగలడు'' అని నిస్సంకోచంగా ఆయన తమ అభిప్రాయాలను వెలిబుచ్చారు.

శ్రీ రామానుజరావుగారు సారస్వత నవనీతము (పుట-62)లో రచయితల గురించి ఒక చోట ఇలా అంటారు ''అధర్మములకు, అన్యాయములకు సుకుమార హృదయాలు సాధారణ మనుజులకన్నా నెక్కుడు క్షోభింతురు.

అయా వేదన, ఆయుద్వేగము మహాగ్రంథ రచనగా ప్రత్యక్షమగును. విశ్వ సాహిత్యము ఒకమారు వీక్షించితిమేని గ్రంథ రచయితలెల్లరు క్షోభించి, కుమిలి కృషించినవారే, సమకాలిక సంఘమునందలి యక్రమములనెదుర్కొన్న వారే, తత్ఫలితముగా ననేక కష్టములననుభవించిన వారేనని".

పత్రికలకు నిర్వహణ చేసే వారిగురించి, దానిని నిర్మోహమాటంగా ఏ విధంగా ఉండాలో వారు చెప్పినారు ఈ క్రింది మాటలలో ప్రస్తావించారు "దేశాన్ని, ప్రజల జీవితాన్ని సినిమా చూసినట్లు చూడవలెనంటె అందుకు సాధనమొక్కటే అదే మన పత్రికలు. ఆశయ శుద్ధితో నిర్భయముగా స్వతంత్రముగా పత్రికలను నిర్వహించవలెను. దేశానికి స్వరాజ్యము రాకముందు పత్రికలు ఎంత నిర్భయంగా నిర్వహించినారో, ఈనాడు కూడా అంత నిర్భయముగా నిర్వహించవలెను. ఈ విషయములో నాకు ఆశాభంగం కలిగింది" అని ఉపన్యాస తోరణములోని(100వ పుట) "ఆంధ్రప్రదేశ్‌లో స్వాతంత్రోద్యమం" వ్యాసం నందు.

శ్రీ రామానుజరావుగారు ఒక చోట నిస్సంకోచంగా తను ఇలా చెప్పుకున్నారు "జీవితములో నాకు కల్గిన అదృష్టాలలో మిత్రుల సహకారం ఒకటి" అంటారు. ఆనాటి నుంచి యీనాటి వరకు కాలానుగుణంగా సాహితీ సేవ చేస్తున్న రామానుజరావు గారు అందరికీ ఆప్తమిత్రులు-అజాత శత్రువులు ఆయన ఒకచోట ఇలా అని వాటిని సాదృశ్యంగా సాధించిన మహోన్నతుడు కూడా "నా రచనల్లో చూపిన ఆదర్శాలను, నా చేతనయినంతవరకు నా జీవితములో అనుష్టించిన వాటినే నా రచనల్లో వ్రాసినాను"

శ్రీ రామానుజరావుగారు సంఘ సంస్కరణాభిలాషి, నిష్కళంక జాతీయవాది. సంస్కృత ఆంధ్రములతో పాటు ఇంగ్లీషు, పారసీ, ఉర్దూ భాషలలో ప్రావీణ్యం కలిగిన పండితులు. అనేక విషయాలను గూర్చి సంపూర్ణమైన విజ్ఞానము సంపాదించిన మేధావి. మంచి వక్త, విమర్శకుడు, పరిశోధకుడు. ఎంతటి ఉద్గ్రంథమైననూ వేగంగా చదువగలిగి అందులోని సారాంశాన్ని గ్రహించగలిగిన మేటి పాఠకుడు. నిరంతర గ్రంథావలోకనంలో నిమగ్నుడైయుండే సంస్కృతిపరుడు. అన్నిటికన్నమిన్నగా దవ్వనుభయతరుడుగా కనిపించినప్పటికీ, దాపునకు వచ్చిన తరువాత పరమాప్తుడు కాగలిగిన అమృత మూర్తి. ఇన్ని సుగుణాలు కలిగిన శ్రీ రామానుజరావుగారు సాధించిన

కృషి ఏమిటి? అందువలన జరిగిన భాషా వికాసం ఏమిటి? రచయితగా ఆయన ప్రతిభావ్యుత్పత్తులు ఏమిటి? తెలుగు సారస్వతంలో ఆయన విశిష్టత ఏమిటి? అను ప్రశ్నలు సహజంగా ఉత్పన్నం అవుతున్నవి. ఈ ప్రశ్నలకు మనం ఇచ్చే సమాధానాలు తెలుగు పైతాళికుడుగా ఆయన స్థానాన్ని నిరూపించగలవు. "ఆంధ్ర వాఙ్మయానికి ఆయన అనుపమానమైన భక్తితో సేవలందించి, అందిస్తున్న భాషా భక్తుడు.

ఆంధ్ర ప్రదేశ్ ఓపెన్ యూనివర్సిటీ 1990 మే 19వ తేదీనాడు వీరికి డాక్టరేట్ పట్టాను ఇచ్చినది.



# పల్లా రామకోటార్య

పల్లా రామకోటార్య

జననం; 1911
పోలంపల్లి, నందిగామ, కృష్ణా జిల్లా

చిరునామా;-

విజయ ప్రెస్, గిర్మాజీపేట,
వరంగల్ 506002

ముద్రితాలు :

వినగదప్ప వెట్టి వెంగళప్ప
వైదిక శిష్టాచారము
విష నివారణము

# డి.వి. శేషాచార్యులు

దర్భశయనం వేంకట శేషాచార్యులు
యం.ఏ.

జననం : 4-9-1964
వనంవారి కొండాపురం
రాయిపర్తి, వరంగల్లు

ఇ. నెం. 6-3-112/1
బ్రాహ్మణవాడ, హన్మకొండ
వరంగల్లు-506 011

ముద్రితాలు :

వ్యాసాలు, కవితలు

# పల్లా రామకోటార్య

ఎల్లవారు తెలియ నల్లిన కైతయే
గణుతికెక్కె నేడు – కాదయేని
వెఱ్ఱివాని చెంత వేదాంత గోష్ఠిరా!
వినగదప్ప! వెఱ్ఱి వెంగళప్ప!

"విశ్వదాభిరామ వినురవేమ" అనగానే మహాకవి వేమన గుర్తుకొచ్చినట్లుగానే "వినగదప్ప! వెఱ్ఱి వెంగళప్ప" అనగానే వద్దన్నా గుర్తుకొచ్చే మహానుభావులు పల్లా రామకోటార్య గారు.

రామయ్య, కోటమ్మ గారల ఏకైక పుత్రులు పల్లా రామకోటార్య గారు. వరంగల్లులో స్థిరపడిన రామకోటార్య గారు నందిగామ తాలుకా పోలంపల్లి గ్రామంలో 1911 సం॥లో జన్మించారు. వీరి తండ్రిగారైన రామయ్యగారు ఉపాధ్యాయులుగా పనిచేసేవారు. ఉద్యోగరీత్యా వారు మారుతు ఉండడం వల్ల రామకోటార్య గారి విద్యాభ్యాసం పోలంపల్లి, జగ్గయ్యపేట మొదలగు ప్రాంతాల్లో జరిగింది.

ములుగు వియ్యన్న శాస్త్రిగారు వీరి తొలి విద్యా గురువు. అమ
ఆంధ్రనామ సంగ్రహం, శబ్దాలు మొదలగు వాటిని వీరివద్ద చదువుకున
ఎవరింటిలోనో సిద్ధ నాగార్జునుని "కచ్ఛపుట తంత్రశాస్త్రం" తాళపత్రి
దొరికితే ఆసక్తితో దానిని అధ్యయనం చేసారు.

ముత్యాల రాజావారు తమపై వ్రాయబడిన పుస్తకాల ప్రచురణప
గాను స్వంత ప్రెస్ ఏర్పాటు చేసుకున్నారు. తర్వాత ఈ ప్రెస్ జగ్గయ్యపే
మార్చబడింది. రామ కోటార్యగారు ఈ ప్రెస్సులోనే పని నేర్చుకున్నా
ఇక్కడే ప్రెస్సులో పనిచేసే సిరికొండ సత్యనారాయణ రాజు అనే మిత్ర
కలిగించిన ప్రోత్సాహంతో కవిత్వం వ్రాయడం, ప్రబంధాలు, కావ్యాలు చ
డం ప్రారంభమయ్యింది. ఈ ప్రెస్సు 1929 ప్రాంతంలో విజయవా
మార్చబడింది. రామకోటార్యగారు కూడా విజయవాడకు మారడం జరిగి
అక్కడ సుమారు రెండు సంవత్సరములున్నారు.

విజయవాడ నుండి రామకోటార్య గారు 1931 ప్రాంత
హనుమకొండకు చేరుకున్నారు. హన్మకొండ నాగుల సందులో వున్నట్టి కొ
సీతారామ శర్మగారికి చెందిన ప్రెస్సు వ్యవహారాలు చూసేవారు. ఇక్క
ఆటలు, వ్యాయామశాలలు, వీటిమీది ఆసక్తి చేత శరీరాన్ని దృఢం చేసుకోవ
ఆర్యసమాజం పట్ల ఆకర్షింపబడటం జరిగింది. ఆ తర్వాత వరంగల్
కొన్ని ప్రెస్సులలో పనిచేసి, రెండుమూడేళ్ళలో వరంగల్‌లో స్థిరపడిన
ఈ రోజుల్లోనే ముదిగొండ శంకరశాస్త్రి గారి వద్ద వ్యాకరణం కొంత చ
సంస్కృత, ఆంధ్ర కావ్యాలు అధ్యయనం చేసినారు. "పోలీసు చ
తర్వాత ఆంధ్ర ప్రింటింగ్ ప్రెస్‌లో కొంతకాలం భాగస్వామిగా వు
1953లో "విజయ ప్రెస్సు" పేరుతో స్వంత ప్రెస్ ఏర్పాటు చేసుకున్నా

రామకోటార్యగారు చిన్నతనం నుండే సాహిత్యం పట్ల ఆసక్తి
వారగుటచే సాహితీ సమావేశాలకు వెళుతూ వుండేవారు. 1952 ను
శ్రీ గార్లపాటి రాఘవరెడ్డి, శ్రీ ఉదయరాజు శేషగిరిరావు మొ॥గు విద్వత్క
లతో వీరికి సన్నిహిత పరిచయం కలిగింది. ఫలితంగా వీరి ప్రెస్సు
సాహితీ ప్రియులెల్లరికి కేంద్రమయ్యింది. క్రమంగా శ్రీ భాష్యం విజ
సారథి, శ్రీ సంపత్కుమార, శ్రీ భండారు, శ్రీ పే.న. రెడ్డి వంటి ప్రముఖ
ఈ కేంద్రంలో కలుసుకోవడం జరిగేది. ఇలా ఎప్పుడూ శబ్దార్థముల చర్చ

చమత్కార పద్యములు, సమస్యలు సాగుతూ వుండేవిచ్చట. రామకోటార్య గారు ఎంతో మందిని తమ పుస్తకాలు ప్రచురించుకోవడానికి ప్రోత్సహించినారు

రామకోటార్య గారు కవిత్వానికి సంబంధించి ఎవరివద్దా నేర్చుకోలేదు వీరికి ప్రాచీన కవుల కావ్యాలూ, ప్రబంధాలు చదువడమంటే ఎంతో ఇష్టం. వీరి మిత్రులు మంత్రిప్రగడ వేంకటేశ్వరరావుగారి పుత్రులు వీరి కవితలను రేడియోలలో చదవడం ద్వారా ప్రసారమైనవి.

రచనా విషయకంగా వీరు 1940కి ముందే వరంగల్ నగరం బ్యాక్ గ్రౌండ్‌గా ఒక శృంగార ప్రబంధం ఏకశ్వాసంగా రచించారు. ఇదే వీరి తొలి రచన కావచ్చు. దీని తర్వాత రసికానంద శతకం రాసారు. నానార్థ పదనిక్షేపం అనేది వీరు వ్రాసిన మరొక చిత్రమైన నైఘంటికరచన. ఈ రచన తథ, దధల వరకే ఆగిపోయింది. కానీ ఈ రచనలన్నీ పోలీసుచర్యకు ముందటి గొడవల్లో నష్టపోయినవి. 1952 నుండి వీరు రాసిన పద్యాలే ''వెఱ్ఱి వెంగళప్ప శతకం''

రచన చేయడం వీరి వృత్తికాదు. కీర్తి కోసం ప్రాకులాడరు. తెలుగులో గొప్ప పాండిత్యం గల వీరికి హిందీ, ఇంగ్లీషు, ఉర్దు భాషలు సుపరిచయములు. ఆర్యకుమార, మానవ శతకాలు వ్రాయాలనుకున్నారు గానీ వ్రాయలేకపోయినారు. విషనివారణము, వైదిక శిష్టాచారము అనునవి వీరు ప్రచురించిన అనువాద గ్రంథాలు.

ఇక వీరి గ్రంథాలలో మిక్కిలి పేరు వడసినది 'వినగదప్ప! వెఱ్ఱి వెంగళప్ప' ఇందులో 603 ఆటవెలది పద్యములున్నాయి. ఆటవెలది ఛంద స్సులో వేమన తర్వాత తిరిగి అంతటి ప్రజ్ఞావంతులు మన రామకోటార్యగారే. వేమన కవిత్వంలో వలె వీరి కవిత్వంలో కూడా చురుకుదనమెక్కువ. అవినీతి అధర్మము, దురాచారములపై వీరు తీవ్రంగా దాడి చేసినారు. విమర్శించినారు. కాలప్రభావం చేత మనుషులకు పుట్టుకవచంగా వంటికతుక్కొనివచ్చిన మూఢ విశ్వాసాలు, మూర్ఖపుపోకడలు అనే చర్మాన్ని, మాటల చురకత్తుల భావదారలతో కర్కశంగా తరగివేస్తూకూడా, నెత్తురు బొట్టు నేల రాలటం ఓర్వలేని మానవతా వాదిగా వెర్రి వెంగళప్ప కనిపిస్తాడు.

రామకోటార్య గారి కవితయందు సహజత్వము, గాంభీర్యము, హాస్యము, సత్యము, నిర్భయము కనపడుచు. సామాజిక, ఆర్థిక రాజకీయ రంగములందలి కుళ్ళును పఠితల ఎదుట కన్పింపజేయును.

వీరి మకుటము విన్నంతనే విసిరివేతగా, కసురుచున్నట్లు గోచరించును కాని విసిరివేయుటగానీ, కసరుటగానీ వీరి ఉద్దేశ్యంగాదు. "వెర్రి వెంగళప్ప" అనగా 'ఒరే! పిచ్చి తండ్రీ!' అని సమాజ వ్యక్తిని సంబోధించును 'వినగదప్ప' అనగా 'నేను చెప్పిన మాట వినవా' అని ఆవేదనతో, ఆప్యాయతతో, లాలనగా, బుజ్జగించుటగా భావింపవలయును గాని, హేళనగా భావించు కోరాదు.

వేమన కవిత్వంలోనూ, రామకోటార్యగారి కవిత్వంలోను కన్పించే సమాన లక్షణం వక్రత. అందువల్ల వీరి పద్యాలు వినగానే చదువగానే వేమన్నగారి పద్యములు గుర్తుకు వచ్చును.

స్వార్థపరులు, మూర్ఖస్వాములు, తమ పొట్ట నింపుకొనగ జేయు నీచ వృత్తి విన్నది మరియు కన్నది వినిపింతునని వీరు ఆరంభముననే హెచ్చరిక చేసినారు. గతితప్పి, మతి లేకుండా పోయిన ఫ్యాషన్ల గూర్చి చెబుతూ చెవులు కప్పుకొని పోయేట్లుగా కేశ శృంగార మొనరించుకున్నట్టి చెలినిచూచిన వృద్ధ వనిత 'చెవులు లేనిదేమి చిత్రమీవిడ కనె' నంటూ వెక్కిరించారు.

ఉపాధ్యాయుడు విద్యార్థులకు ఆదర్శప్రాయుడుగా ఉండాలి. విద్యార్థులకు ఏవేవో చెప్పడం మాత్రమే కాదు. వాటిని ముందు తాను కూడా ఆచరించాలి. లేకున్న ఎలా వుంటుందో రామకోటార్యగారు తమ పద్యంలో ఇలా వివరించారు.

> క్లాసు టీచరొకడు క్యాప్స్టను సిగరెట్టు
> కాల్చజూచినట్టి గడుగుగాయ
> ఇల్లు జేరు వెనుక ఇమిటేటు చేసెరా
> వినగదప్ప! వెర్రి వెంగళప్ప!!

ఇక పాఠ్య పుస్తకాల్లో ఒక్కొకసారి విచిత్రమైన పాఠాలు పెడు తుంటారు. ఆ పాఠాల వల్ల ఎవరికి ప్రయోజనం కలుగుతుందని ఆశిస్తారో అర్థంకాదు. అందుకేనేమో "సంపదలను దోచి, సంస్కృతి సభ్యతల్ వమ్ము చేసి, మానవతుల జెరచు బందిపోట్ల కథలు పాఠ్య భాగంబులు" అని చురక వటించారు.

బడుపేదల గూర్చి చెబుతూ తిండిలేక, నిద్రరాక, బాధపడుతున్న పేదవానిపై ఆ వాడలోని సేటు రేడియోకు జాలి కలిగి జోల పాట పాడిందం టారు. అలాగే సినిమా తారలొచ్చి చిందాడుతారన్న పదులు వెచ్చ బెడుతాడు కాని, పైస బిచ్చమియ్యడానికి పదిసార్లు ఆలోచిస్తాడంటారు.

రాజకీయ నాయకుల గూర్చి చెబుతూ అస్తి నాస్తి చేయనట్టి చాతుర్యం తిమ్మిని, బమ్మి చేయు తెలివిగల వాడే రాజకీయ వాదిగా రాణిస్తాడంటారు.

ప్రజల్ని ప్రార్థించి, ఓట్లు సంపాదించుకున్న తర్వాత మరిచిపోయే వారిని గూర్చి, విపరీతంగా పెరిగిపోయిన లంచగొండితనం గూర్చి, బిడ్డ పెండ్లి అనో, పెరుమాళ్ళ సేవ అనో అన్నదానమనో యాత్రలు అనో చెప్పి పొట్ట నింపుకొనే జనుల గూర్చి, నాగరికత ముదిరి నైలాను వస్త్రాలు కట్టి వీధిలో తిరిగే కామినులను గాంచి కన్నులు మూసి జపించే ప్రవరగణమును గూర్చి, తన ముందు వెళ్ళుచున్న వనిత అందాలను మిత్రులతో వర్ణించే ఓ చవట, ఆ వనిత తన చెల్లెలే అని తెలుసుకుని తలబట్టుకున్న విధానాన్నిగూర్చి చూపు వుండి కూడా కళ్ళజోడు, ఓనమాలు రాకున్నా జేబుకు కలమునూ, గడి యారము చూడరాకున్నా, చేతికి గడియారం పెట్టుకొని తిరిగే వారిని గూర్చి "చెరువుకాలెనేని చేపలేమగునన్న, చెట్లనెక్కు వహ్వా చెట్లనెక్కు గేదెలా? అనటంచు వాదించు మూర్ఖాళిని గూర్చి, దుకాణంలో నౌకరుపై కారుకూతలు కూసే సెట్టి, పెండ్లాం ఎదుట పిల్లికూన అయ్యే విధం గూర్చి, దొరల ఇంటి కుక్క మరణింపగా, అయ్యో పాపమని చింతపడ్డ జనులు. ఆ దొరవారే మరణించిన నాడు ఎంత మాత్రం బాధపడని "లోకం పోకడ"ను గూర్చి తెలుగు పొత్తములకు ఆంగ్లములో కనిపించే తొలి పలుకుల గూర్చి, శర్మగారి బాబు కాన్వెంటు చదువును గూర్చియూ రామకోటార్య గారు ఎంతో గొప్పగా, వ్యం గ్యంగా, చమత్కారంగా వివరించారు.

మన ప్రక్క దేశాలైనా పాకిస్తాన్, చైనా లను గూర్చి చెబుతూ,

పాకు భాయిగాడు ప్రక్కబల్లెంబయ్యె
చీని భాయిగాడు చిట్టగొట్టె
మంచి నేస్తగాండ్రె మన భాయి గాండ్రెల్ల!
వినగదప్ప! వెర్రి వెంగళప్ప!!

అని అన్నారు, అలాగే అమెరికా, రష్యాలను గూర్చి చెబుతూ,

ఆత్మరక్ష పేర నణ్వస్త్ర ఖరపేరి
నధివసించి, శాంతినఖిలశించి
అలమటించసాగె-అమెరికా రష్యాలు
వినగదప్ప! వెర్రి వెంగళప్ప!!

ఇంటనున్న చెంబు నిటుదటు పెట్టకున్నా పొరుగు పెంటనెత్తబోయె దేశ సేవకుల గూర్చి, ప్రజల డబ్బుతో పరదేశ యాత్రలు చేసే మంత్రులను గూర్చి, అణువును చీల్చి, దాని నపమార్గమునబెట్టి మృత్యులోకానికి మెట్లుగట్టిన భౌతిక విజ్ఞానమును గూర్చి, శాంతి పేరనో, జపం పేరనో పైసలు లాగే జ్యోతిష్కులను గూర్చి, గోల్డు కంట్రోలును గూర్చి, కుటుంబ నియంత్రణ కృషిని గూర్చి, స్వధర్మ నిర్వహణమును గూర్చి, రామకోటార్య గారు నిర్భయంగా ఉన్నదున్నట్లుగా వర్ణించారు,

సుప్రసన్నగారన్నట్లు వీరికున్న సామాజిక చైతన్య లక్షణం ఈ దేశపు మట్టిలో పుట్టినవానితోడది. దానికి మానవ కళ్యాణ భావన, కుదురైన జాతీయ దృష్టి ఆలంబము. అది మన సంప్రదాయ జీవనంలోని మంచిని ప్రశంసించినట్లే చెడును తులనాడును. ఆధునికత పేర అర్థ రహిత వ్యామోహముల తిరస్కరించినట్లే, సంస్కృతి పేర జరుగు కుతంత్రముల నెలుగెత్తి చాటుతుంది.

ఇక వైదిక శిష్టాచారము, విషనివారణము అనునవి వీరి అనువాద గ్రంథములు.

విషనివారణము అనునది యోగీశ్వర నిత్యసాధకకృతము. వీరు వ్రాసిన ఈ గ్రంథము నందు సాధారణముగా అందరికి అందుబాటులో ఉన్న వస్తువులే చికిత్సలో వ్రాయబడినవి. ఇందువల్ల ఈ గ్రంథము ఎక్కువ ఉపయుక్తమైనదనే తలంపుతో రామకోటార్య గారు 1952లో తెనిగించారు, పాము, తేలు, ఎలుక, కుక్క, జేవ, కప్ప, బల్లి, ఉడుము, పులి, పురుగులు మొ॥ వాని విష నివారణోపాయములు ఇందు గలవు.

హరిశ్చంద్ర విద్యాలంకార్ గారిచే సంగ్రహితమైన వైదిక శిష్టాచారమును రామకోటార్య గారు అనువదించారు.

ఇందులో ఆధ్యాత్మిక, కర్తవ్య సంబంధములు, శారీరకారోగ్య సంబంధములు, వ్యాయామము, ఆహారపానీయములు, నడవడిక, నిద్ర, పరస్పర వ్యవహార సంబంధములు, సాధారణ వ్యవహార సంబంధములు, సాధారణ వ్యవహార సంబంధములైన విషయములు చాలా చక్కగా, అందరికీ అర్థమయ్యే రీతిలో చెప్పబడినవి. ముఖ్యంగా చిన్నపిల్లలకు సదాచారములను నేర్పుటకై ఇది ఎంతో ఉపయుక్తమైనదనుటలో సందేహం లేదు.

రామకోటార్యగారి చిత్ర కవిత్వ పటుత్వానికి ఉదాహరణ ఈ క్రింది పద్యం

సీ॥ శ్రీగిరికన్యకా భోగానుభవరూప । భువనరక్షనిరీక్ష । భుజగహార ।
దక్షశిక్ష । లలాటాక్షియ । విషధర । నటనాధురంధర । నాగహార ।
భుజగరాడ్భూషణ । యజగర్వసంహార । పురహర । యోర్గల్లుపురసపాల ।
మునికోటినుతభాషి । ముక్తి కన్యాతోష । సంతతాననహాస । కంతుహంత ।

గీ॥ జయగణాధ్యక్ష జితయోగిచయదళాయ
"అనెడి పద్యంబు కోరిన యక్షరంబు
నిచ్చురీతిగ చెప్పితి నేమమలర
కొరుకొనుమిదే తెల్పెద కొర్కెలలర"

| శ్రీ | శి | వు | డు | ప | ల్లా | రా | మ | కో | టి |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |

ని సు భా ష హా శి చే దా క్షి ణ్య

11 12 13 14 15 16 17 18 19 20

చే యు గా త

21 22 23 24

పై పద్యములోని ఏదేని ఒక అక్షరమును ఎవరినైనా మనస్సులో కోరుకొనుమని చెప్పవలెను. వారు కోరుకున్న అక్షరము మనకు చెప్పకూడదు. పిదప వారు రుకున్న అక్షరము మొదటి పాదంలో ఉందా? రెండో పాదంలో ఉందా? మూడవ పాదంలో ఉందా? నాలుగవ పాదంలో ఉందా? ఐదవపాదంలో ఉందా? అని వరుసగా అడుగవలెను. వారట్లు చెప్పిన సమాధానమును బట్టి వారు ఏ అక్షరమును కోరుకున్నారో మనం చెప్పవచ్చు.

ఎలాగంటే పద్యంలో ప్రతి పాదానికి ఒక విలువ ఇవ్వబడింది. మొదటి పాదమునకు 1, రెండవ పాదమునకు 2, మూడవ పాదమునకు 4, నాలుగవ పాదమునకు 8, ఐదవ పాదమునకు 16, ఇక కోరుకోబడిన అక్షరము ఏ,ఏ పాదాల్లో ఉందని చెబుతారో, ఆయా పాదముల విలువల మొత్తాన్ని కలుపవలెను. అట్లు కలుపగా వచ్చిన సంఖ్య, పద్యం క్రింద యివ్వబడిన వాక్యంలోని ఏ సంఖ్య క్రింది అక్షరమో చూడవలెను. ఆ అక్షరమే వారు కోరుకున్న అక్షరం.

ఉదాహరణకు: ఈ పద్యంలోని 'భ' అనే అక్షరం కోరుకున్నారనుకొండి ఈ అక్షరం మొదటిపాదంలో ఉంది. 3వ పాదంలో ఉంది, 4వ పాదంలోనూ ఉంది. మొదటి పాదం విలువ 1, 3వ పాదం విలువ 4, నాలుగవ పాదం విలువ 8 కలిపితే $1+4+8=13$ పద్యం క్రింది వాక్యంలోని అక్షరం కూడా 'భ'

ఎనభై సంవత్సరముర వయస్సు గల రామకోటార్య గారు నేటికీ చక్కని శరీర దారుఢ్యంతో సుమనస్కులుగా, చిరునవ్వుతో. ఓపికగా అందరినీ పలకరిస్తూ ఉంటారు.

## బి. రామరాజు

బిరుదురాజు రామరాజు

జననం: 1925
దేవునూరు, వరంగల్

చిరునామా:

చిక్కడపల్లి, హైదరాబాదు 500020

ముద్రితాలు :

తెలుగు జానపద గేయ సాహిత్యము
మరుగుపడిన మాణిక్యాలు
తెలుగు వీరుడు
వీరగాధలు
అల్లూరి సీతారామరాజు
ఉర్దు తెలుగు శబ్దకోశము
శ్రీ సత్యసాయి విన్నపాలు మొ॥నవి.

## జి. బిక్షపతి

గోనె బిక్షపతి
యం.ఏ., యం.ఇడి.

జననం : 10-3-1943
శాయంపేట జాగీర్, వరంగల్

చిరునామా :

ఇం.నెం. 7-3-108/1
మచిలీబజార్
హన్మకొండ, వరంగల్ 506011

ముద్రితాలు :

వ్యాసాలు, కవితలు

# బిరుదురాజు రామరాజు

పాండితీ శిఖరాగ్రాన నుండి గూడ
జానపదుల చెరువవి జ్ఞాన పరుడు
పల్లె జనుల మాటల నెల్ల మల్లెలటుల
ఒడిని నింపిన సవ్యుదభ్యుదయ మూర్తి

సూర్యోదయము తోడనే కమలములు వికసించినటుల ఆచార్య రామరాజుగారి దృక్ ప్రసరణమను సూర్యోదయమున తెలుగు జానపద వాఙ్మయమను కమలము వికసించి, విస్తరించినదనుటలో అతిశయోక్తి యిసుమంతయును లేదు. మన భారతావని దేశభక్తులకు దైవ భక్తులకు పుట్టినిల్లు. ఏ దేశభక్తుడెచ్చట జన్మించినను అతడు జాతి యావత్తుకు సన్నిహితుడే, ప్రియతముడే పూజ్యనీయుడే, కాని అతని జన్మస్థానమునకు మాత్రమే యతని కీర్తి, సేవలు పరిమితములు కావనునది జగమెరిగిన సత్యము. అయినను అతని జన్మస్థానం ఆదరణీయము. అతని జన్మస్థానము వారు తమ వారని గర్వించెదరు, అభిమానించెదరు. అయినంత మాత్రాన యతడు కేవలము ఆ ప్రాంతానికే పరిమితుడు కానట్లు ఆచార్య బిరుదురాజు రామరాజు గారు జన్మించినది

దేవునూరు వరంగల్లు జిల్లా పెంపకమునకు వచ్చినది మడికొండకు. అయినను అతడు సాహిత్య రంగమున ఎదిగి విస్తృతమై విశాలతను సంతరించుకొని ఆంధ్రరాష్ట్రమంతటికిని కీర్తి ప్రతిష్ఠల ప్రసాదించినారు. రామరాజు గారు స్థానికముగా ఓరుగల్లులో నివసించుచున్నను అతని సేవలిచట వినియోగింప బడు చున్నను రాష్ట్ర స్థాయి కెదిగిన వారైయున్నందున జిల్లాస్థాయిలో ప్రప్రథముగా కాకతీయ వైతాళికులుగా పరిగణింపబడుటలో అతిశయోక్తిగాని అసమంజసము గాని సూతయును లేదు.

ఆచార్యులకు ఆచార్యుడైన రామరాజుగారు వరంగల్ జిల్లాలోని మడికొండ గ్రామమునకు దగ్గరలో గల దేవునూరు గ్రామములో లక్ష్మీదేవి-నారాయణరాజు దంపతులకు 1925లో జన్మించినారు. లలితమ్మ-రాఘవ రాజు దంపతులు వీరి పాలక మాతా పితరులు. వీరి భార్యామణి శ్రీమతి సూర్యాదేవిగారు. రామరాజుగారికి నలుగురు సోదరులు, ఐదుగురు సోదరీ మణులు. వీరి సంతానము ఒక కుమారుడు, ఐదుగురు కుమార్తెలు.

రామరాజుగారు దేవునూరి వీధి బడిలో, ప్రాథమిక విద్యను మడి కొండలో, ఉన్నత పాఠశాల విద్యను హన్మకొండలో, కళాశాల విద్యను (1949) నిజాం కళాశాలలోను, స్నాతకోత్తర విద్య (1956) ను ఉస్మానియా విశ్వవిద్యాలయములో నభ్యసించినారు. 1966 సంవత్సరములో ఆచార్య ఖండవల్లి లక్ష్మీనిరంజనము నాటి ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగు శాఖాధ్యక్షుల పర్యవేక్షణలో జానపద వాఙ్మయములో అపూర్వ పరిశోధన చేసి డాక్టరేటు పట్టమునకు తెలుగులో శ్రీకారము చుట్టినారు.

"పరిశోధన పరిశీలన, పరమ లక్ష్యమని తలంచు" బిరుదురాజు రామరాజుగారు వైతాళికులు-చరిత్రకారులు కూడ. వీరు వెలువరించిన గ్రంథ ముల కన్న చేసిన సాహిత్య కృషి ఎనలేనిది.

పండితులకు సాధారణముగా పదవీ వ్యామోహముండదు. అందుచేతనే కాబోలు పండితులు సమర్థులనిపించుకోరు. కాని రామరాజు గారు ఉపన్యాస కునిగా ఉస్మానియా విశ్వవిద్యాలయములో పాదమిడి, ఉపన్యాసకుడి నుండి తెలుగు శాఖాధ్యక్ష పదవి వరకు గల పలువిధములు ఉన్నత పదవులధిష్ఠించి ఉత్తమ అధికారిగా వాసిగాంచి, తమ పదవికి న్యాయము చేకూర్చుటయేగాక

అభ్యాసకులకు ప్రయోజనములనందించి యున్నారు. రామరాజు గారు బహుముఖ ప్రజ్ఞశాలి. వీరు తమ ఉద్యోగ కాలమున పెక్కు మహాసభలు విద్యా గోష్ఠులు మొదలగు వానికి ఉపస్థితులై కార్యభారమును నిర్వహించి కర్తవ్య పరాయణులై భాషా, సాహిత్య, సాంస్కృతిక, మత సంస్థలకు సేవచేసినారు. వీరు పెక్కు సంస్థలకు సభ్యులుగా, కార్యదర్శిగా, సంయుక్త కార్యదర్శిగా, కార్యనిర్వాహక సభ్యులుగా, సలహాదారుగా, అధ్యక్షులుగా కూడ సేవ చేసినారు.

రామరాజుగారు రక్షణ సంగ్రామ రాజు కూడ. వీరు కౌమార దశయందు (విద్యాభ్యాసదశయందు) స్వయంసేవకుడుగా జాతీయ ఉద్యమాలలో కీలకపాత్ర వహించి ఇతరుల జాగృత పరచిన దేశభక్తి పరాయణులు. చిన్న వయస్సు నుండియు ఇతనికి సాంప్రదాయమునందు అభిమానము. కావున డిగ్రీ చదువుతున్నప్పుడు "నిజామురాజు" నెదిరించి తెలంగాణా విద్యార్థి సంఘమునకు అధ్యక్షులై నిజామునకు వ్యతిరేకముగా ప్రజల సమాయత్తము జేసినారు. చురుకుగా రాజకీయములందు పాల్గొను రామరాజుగారిని వీరి రాజకీయ గురువైన సురవరం ప్రతాపరెడ్డిగారు "విద్యాంసుడవయ్యా నీకు రాజకీయాలెందుకు? ఈ కల్మశాన్ని నీవు భరింపలేవు" యనగా ఆ మాటల యాజ్ఞగా స్వీకరించి వెంటనే రాజకీయాలకు స్వస్తి చెప్పిరి.

రామరాజుగారు వరంగల్ జిల్లా చారిత్రికులు కూడా. వీరు జన జీవనములో వంశపారంపర్యముగా కొనసాగుతూ వచ్చుచున్న చారిత్రిక, సాంస్కృతిక విషయములను సమాజ శ్రేయస్సునకై బహిర్గతపరిచి వాటి విలువలను అపురూపముగా తీర్చిదిద్దిన మహామనిషి. వరంగల్ జిల్లా గీసుకొం మండల పరిధిలోని శాయంపేట (హవేలి)లో నున్న పాంచాలరాయ దేవాలయ నాగార్జున సాగరములోని రంగనాధ దేవాలయము దగ్గర గల రామలింగేశ దేవాలయముల పునరుద్ధరించి, సంస్కృతీ విలువలను పరిపోషించి; సాంస్కృతిక విలువలతో పాటు చారిత్రిక విలువలు కూడా జనులకు అ బాటులోనికి వచ్చినవి. వీరు సామాజిక స్పృహతో రచించిన 'తెలుగు పీ ఉత్తమ చారిత్రిక గ్రంథము ఇంతే గాక చారిత్రిక ప్రాముఖ్యత గల శిలాశాసనముల వెలికి తీసి వీరు తమ చారిత్రి జిజ్ఞాసను గలదని జేసినారు.

సాహిత్యం సౌభాగ్యం
సౌశీల్యం సమభావం
దేహమంత పులుముకున్న
దేశికోత్తముండు సుమ్మ

రామరాజుగారు మన ఆంధ్ర సాహిత్యమునకు గావించిన సేవ ఇంతింతనరానిది. వీరువరంగల్ స్నాతకోత్తర కేంద్రములో ప్రధానాచార్యులుగా ఉన్నప్పుడు విశ్వనాధ వాఙ్మయ జీవిత పరిశోధనా కార్యక్రమము పేర బృహత్తర పథకమును ప్రవేశ పెట్టి 'విశ్వనాధ సూచిక' వెలువరించుటకు ప్రోత్సాహ మిచ్చినారు. వీరు విశ్వనాధ పథకమును ప్రారంభించి విశ్వనాథుల వారి సాహితీ సేవను జనుల దృష్టికి తీసుకొని వచ్చిన మహనీయులు.

రామరాజుగారు ఉస్మానియా విశ్వవిద్యాలయములో పని చేయుచున్నప్పుడు తెలుగు శాఖ యందు అధ్యయన కేంద్రమును మరియు "వివేచన"యను వార్షిక పత్రికను ప్రారంభించిరి. ఇవి రెండును నేడు నిర్విఘ్నముగా కొన సాగుచున్నవి. తెలుగు సాహిత్యమునందు వివేచన ఒక కలికితురాయి.

ఏటి కేతంబట్టి ఎయి పుట్లు బండించి
ఎన్నడూ మెతుకెరుగనన్నా – నేను గంజిలో మెతుకెరుగనన్నా

---

వానల్లు కురువాలి వానదేవుడా
వరిచేలు పండాలి వానదేవుడా

---

సుబ్బి గొబ్బెమ్మా సుఖమూ లియ్యావే
తామర పువ్వంటే తమ్ముణ్ణియ్యావే
చేమంతి పువ్వంటి చెల్లెల్నియ్యావే

---

'జానపదము' అనగానే మనకు రామరాజుగారి గ్రంథమే చటుక్కున మన మనస్సులలో మెదలుతుంది. రామరాజు గారు నాడు విశ్వవిద్యాలయాధికారులతో పోరాడి "జానపద సాహిత్యము" పై (1956) ఉత్తమ పరిశోధన

చేసినారు. ప్రాథమికమైన అంశములన్నీ "తెలుగు జానపద గేయ సాహిత్యము" లో సిద్ధాంత గ్రంథములో ఉండుట వలన తెలుగు జానపద వాఙ్మయములో ఇదే ప్రథమ సిద్ధాంత గ్రంథము. వీరి పరిశోధనా దీక్ష అపారమైనది. అమూల్యమైన పరిశోధన గ్రంథమును తెలుగులో జానపద విజ్ఞానముపై వీరు పరిశోధించి వ్రాయుటకు వెనుక కృషిలో వారెదుర్కొన్న సాధక బాధలను జ్ఞప్తికి తెచ్చుకొనుటయు కొంత అవశ్యకమే. రామరాజుగారు తెలంగాణములోని ఊరూరా తిరిగి తాను జానపదులు పాడిన పాటలను వ్రాసుకొనెడి వారు. కొండకచో తాను పాడి వారిని పాడింపజేసెడివారు. ఐనను కొందరు పాడెడు వారు కాదట. అట్టితరి వారికి ధనాశ చూపి లోబరుచుకొన్నారట. ధనాశకు లోబడనివారిని చివరకు అధికారుల సహాయమున వారిని బాధించియైన ఆ పాటకు లిపి రూపమిచ్చెడి వారట. వీరు కేవలము పాటల సేకరణయే చేయలేదు. జానపదుల వాయిద్యములు, కళాకారుల ఇక్కట్లు, జానపద కళాకారుల జీవన విధానమును తదితరాంశములను కూడా రామరాజుగారు పరిశీలించినారు.

సామాన్యముగా పరిశోధనా వ్యాసంగము Ph.Dతో ముగిసిపోతుంది. కాని రామరాజుగారు దీనికి వ్యతిరేకులు. కాని నేడు జానపద విజ్ఞానము మీద వీరు అనేకులకు ఆసక్తి కలిగించి వారి వలన ఎంతో మందిని జానపద సాహిత్యాభిమానులుగా పెంపొందించిరి. వీరి పరిశోధనా దీక్ష అపారమైనది వీరు తెలంగాణ అంతా తిరిగి తాళపత్రములను సంస్కృతాంధ్రాంగ్లాలలో సంపాదించినారు.

ఆచార్య రామరాజుగారి చలువ వలన ఆంధ్రప్రదేశ్‌లో జానపద విజ్ఞానమునకు గౌరవము, విశ్వవిద్యాలయములలో సమున్నత స్థానము లభించినది. సమాజమునందు అట్టడుగున ఉండే ప్రజానీకముకూడా తమ బాధలను సాహిత్య రూపములో అభివ్యక్తి పరుస్తుందని గుర్తించు విశ్వవిద్యాలయాచార్యులు అరుదుగా ఉంటారు. పామరులు చదువుకొనే లొల్లాయి పదాలుగా అనాదృత సాహిత్యముగా తీసిపారేసే జానపద సాహిత్యముపైన రామరాజుగారి చూపుపోకినది. అంతే.... అది విప్పారినది.

ఐతే ఇక్కడొక ముఖ్య విషయము గమనించవది యున్నది. రామరాజుగారి కంటె ముందుగా నేదునూరి గంగాధరము గారిచే జానపదవాఙ్మయ సేకరణ జరిగినది. నేదునూరి గంగాధరము గారు సేకరించిన జానపద గేయ

యములను శ్రీ రామరాజుగారు, శ్రీ పట్టికోట అళ్వారుస్వామిగారు కలిసి "సెలయేరు" పేరుతో గేయాల సంపుటిని వెలువరించారు. దీనికి విశాల వ్యాప్తిని విశ్వవిద్యాలయ స్థాయిలో పరిశోధనాంశముగాను మరియు ఈ నాడు సాహిత్యములో జానపద సాహిత్యమునకు ఒక రూపును గుర్తింపును తెచ్చిన వారు బిరుదులేని శ్రీ బిరుదు రామరాజు గారు. అందుకే వీరు వైతాళికులు.

రామరాజుగారు ఆంధ్రుల అసలైన సంస్కృతి, జానపదములోనే యున్నదని ఘోషించినారు. జానపద సంబంధమైన వ్యాసములు గ్రంథములు రచించి, ఉపన్యసించి, విశ్వవిద్యాలయములలో జానపద సాహిత్యమునకు ప్రాముఖ్యము సంతరింపజేసినారు. శ్రీనాధుని శివరాత్రి మహాత్మ్యమును సంపూర్ణముగా ఆంధ్రులకందించిన ఖ్యాతి కేవలము రామరాజుగారికే దక్కుతుంది. రామరాజుగారు తెలుగు వాఙ్మయములో చూపిన జానపద సాహిత్యపు వెలుగు పొరుగు రాష్ట్రాలకు ప్రాకినది. వీరి ప్రేరణ వలన ఉస్మానియా విశ్వవిద్యాలయములో జానపద విజ్ఞాన క్షేత్రములో చేయబడిన పరిశోధన ప్రపంచములో మరే విశ్వవిద్యాలయములో చేయబడలేదంటే అతిశయోక్తి కాదు. ఇది ఆంధ్రుల కందరికి గర్వకారణము.

శాస్త్రీయముగను సక్రమముగను అనాదృత వాఙ్మయమును గూర్చి పరిశోధన చేసి పెక్కు ఉత్తమ గ్రంథములను వెలువరింప జేసిరి. తెలుగు జానపదగేయ సాహిత్యము ఒక అపూర్వ గ్రంథ రాజము. ఆంధ్ర ప్రదేశ్ పలుప్రాంతముల నుండి సేకరించి సంకలనపరచిన త్రివేణి (1950) నాటికీ నేటికీ ఉత్తమ జానపద గేయ సంకలనము. పిల్లల పాటలు (1960) తెలంగాణా పల్లె పాటలు (1968) ఇవి రెండును జానపద గేయ సంకలనములు. వీనిని రామరాజుగారు వెలువరింప జేసినారు. తాళపత్రి గ్రంథముల సేకరించి పరిశీలించి అపూర్వ విషయములను సంగ్రహించి "మరుగుపడిన మాణిక్యాలు" శీర్షిక పేరుతో గోలకొండపత్రికలో అష్టాదశ కవులను తొలుతగా సాహిత్య లోకమునకు పరిచయము చేసినారు. ''మొహర్రం'' (1964) అను జానపద గేయములను ఆంగ్లములో వెలువరింప జేసినారు. వీరి ఫోక్ టేల్స్ ఆఫ్ ఎ.పి. (1974)ను స్టెర్లింగు పబ్లిషర్స్ ప్రచురించినారు. దీని వలన తెలుగు జానపద కథలు ఆంగ్లానువాదముతో రాష్ట్రేతరుల చేరినవి. "ఫోక్ ల్హోర్ ఆఫ్ ఎ పి'' అను ఉత్తమ గ్రంథము ఇతర భాషాభిమానులు ఆంధ్రుల జానపద విజ్ఞానము తెలుసుకొనుటకు ఆధారమైనది.

తెలుగు వీరుడు, వీరగాథలు, అల్లూరి సీతారామరాజు, మరుగుపడిన
ణిక్యాలు, ఉర్దూ తెలుగు శబ్దకోశము, సత్యసాయి విన్నపాలు, దక్షిణ
రత జానపద గేయములు, చరిత్రకెక్కిన చరితార్థులు మరియు జానపద
థలు మొదలగునవి వీరి గ్రంథములు. గురుగోవిందసింగ్, ప్రేమ్‌చంద్
కక కథాయన్ మొదలగునవి... వివిధ భాషలలో వీరి అనువాదములు.
సాంస్కృతిక వారసత్వకృతులు ప్రసన్న రాఘవ నాట్య ప్రబంధము
965), రాఘవాభ్యుదయము (1965), వసుచరితం (1965),
ంబవతీ పరిణయము (1969), శృంగార శేఖర భాణము (1969),
మాయణ సారతిలకం వీరి అముద్రిత గ్రంథ పరిష్కరణ గ్రంథములు.

'శ్రీ సత్యసాయి విన్నపాలు' ఆర్తి ప్రబంధములలో మేలైన రచన
మరాజు గారు శ్రీ సత్యసాయిబాబా భక్తులై వారి అర్ధశతాబ్ది జన్మదినోత్సవ
దర్భమున శ్రీ సత్యసాయి వచనములు ప్రకటించిరి. ఇందలి పద్యములు
సంపదయందును భాషా మార్దవమునందును భావ నిర్భరత యందును
పాక పెద తిరుమలాచార్యుల వేంకటేశ్వర వచనములు మరియు సింహగిరి
హరి వచనముల సాటిగా పోటిగా నిలువ జాలును.

ఆచార్య రామరాజుగారికి పెక్కు సాహిత్య సాంస్కృతిక సంస్థలతో
సంబంధములు గలవు. రామరాజుగారు 1971లో వరంగల్‌లో నూతనముగా
పింపబడిన స్నాతకోత్తర కేంద్రమునకు ప్రధానాచార్యులుగా నియమితులై
మ కాలంలో స్నాతకోత్తర కేంద్రము అన్ని విధములుగా అభివృద్ధి చెందు
సమర్థవంతమైన చర్యలు గైకొన్నారు. రామరాజుగారు కూర్చిన ఉర్దూ-
లుగు నిఘంటువు వారికి ఉర్దూ భాషపై గల అధికారమును తేట తెల్లము
యుచున్నది.

రామరాజుగారు మొట్ట మొదటి జాతీయ ఉపన్యాసకులుగా గౌరవము
ందినారు. భారతదేశములోనే విశ్వవిద్యాలయముల్లో మొట్ట మొదటి వేసవి
శాలను ఉస్మానియా విశ్వవిద్యాలయములో నడిపిన ఘనత రామరాజుగారికే
క్కినది.

గీర్వాణాంధ్ర భాషలలో పండితులై ప్రాచీన సాహిత్య సాంప్రదా
క శాస్త్రాధ్యాభిమానులై, వేరొక వైపు మట్టె మనసుల నిసర్గ సాహిత్యము

నకు వెలకట్టి చూసుకొనేవారు మరి అరుదుగా ఉంటారు. రామరాజుగారు అట్టి కోవకు చెందిన వారే. రామరాజుగారి విజ్ఞత, ముందుచూపు ఎంతేని పొగడ దగినది. కారణము వీరి పరిశోధనాకాలము నాటికి అటు అమెరికాలో కాని, ఇటు మన దేశంలో కన్నడ ప్రాంతములోకాని, ఆనాటికి జానపద విజ్ఞానమును ఒక పరిశోధనా యోగ్యమైన అంశముగా పరిగణింపబడుటలేదు. ఆ కాలానికే వీరు ఉస్మానియా విశ్వ విద్యాలయాధికారులచే పరిశోధనాంశముగా స్వీకరింప చేసిన మేరునగధీరులు.

రామరాజుగారు పంచభాషా కోవిదులు. వీరు నేర్చిన సంస్కృ తాంధ్ర ఆంగ్ల ఉర్దూ హింది (పంచ) భాషలలో రచనలో, అనువాదములో లేక పరిష్కరణములో ఏదో ఒకటి చేసి యున్నారు.

రామరాజుగారి వ్యక్తిత్వము హిమనగము. మాటలు పరుషములు మనసు అమృతము వర్షించును. వీరు మూర్తీభవించిన జానపద విజ్ఞానము. ఒక వ్యక్తి తాను కృషిచేస్తూనే ఇతరుల చేత కూడా అదే ప్రమాణములో కృషి చేయించు వ్యక్తియే ప్రామాణిక పరిశోధకుడు. అట్టికోవకుచెందిన వారే ఆచార్య బిరుదురాజు రామరాజు గారు. తెలుగు జానపద విజ్ఞానాభివృద్ధికి ఆత్మ శుద్ధితో పరిశ్రమించిరి. రాజు గారు తెలుగువారిని జాగృత పరుచుటకు యు. జి. సి. వారి ద్రవ్య సహాయముతో జానపద విజ్ఞాన పరిశోధన పద్ధతుల గురించి ఒక సదస్సును సమర్థవంతముగా నిర్వహించిరి. అఖిలభారతీయ జానపద విజ్ఞాన సంఘము వార్షిక సమావేశము హైదరాబాదులోనే జరుగునట్లు చేసి తెలుగు వారిని మరింత చైతన్య వంతుల జేసిరి.

ఆచార్య రామరాజు గారు శిష్ట సాహిత్యమునకు తోడుగా జానపద కళాసరస్వతికీ సరిగద్దె వేయించి రత్నకిరీటము తొడిగించిన విద్వద్వతంసులు.

రామరాజుగారు ఇతః పూర్వము సాహిత్యకుల దృష్టిలోనే కాక పామరజన పర్యాప్తమై ప్రవహిస్తూ కాలసముద్రములో కలసి పోనున్న జానపద సాహితీ స్రవంతిని పైకిపొంగించి మీగడ తరగల తరచి నిగ్గు తేల్చి, ఆ సుధను ఏక పంక్తిలో విబుధులకు, పామరులకు సమంగా పంచిన మోహనమూర్తి. వీరు ఊరురా తిరిగి సేకరించి బండ్లకెత్తించిన తాళపత్ర గ్రంథములు ప్రాచీన సాహిత్యశక్తికి, తదుద్ధరణదీక్షకు తార్కాణములు.

# పల్లా దుర్గయ్య

కీ॥ శే॥ పల్లా దుర్గయ్య

జననం: 1916

మడికొండ, వరంగల్లు.

ముద్రితాలు :

గంగిరెద్దు (కావ్యం)
ప్రబంధ వాఙ్మయ వికాసం
పాలవెల్లి

# టి. ఉదయవర్లు

టి. ఉదయవర్లు

జననం: 12-9-1947
నుస్తులాపురం, కరీంనగర్

చిరునామా :
సీనియర్ రిపోర్టర్
ఆంధ్రజ్యోతి
బంజారాహిల్స్, హైదరాబాదు 500034

ముద్రితం :
లోకాలోకనం (వ్యాస సంపుటి)
తారాతోరణం (సినిమా వ్యాస సంపుటి)

# పల్లా దుర్గయ్య

శ్రీ పల్లా దుర్గయ్యగారు ప్రతిభా సంపన్నుడైన మహాకవి. వాస్తవానికి ఆయన వ్రాసిన "గంగిరెద్దు" కావ్యం ఒక్కటే చాలు ఆయనను మహాకవుల సరసన కూర్చోపెట్టడానికి. కాని శ్రీ దుర్గయ్యగారికి రావలసినంత గుర్తింపు రాలేదు. దీనికి ప్రచారమంటే గిట్టని ఆయన మనస్తత్వమొక కారణం కాగా రెండో కారణం బహుశా కలుపుగోలుగా పలువురితో కలిసే చొరవతనం లేక ఒదిగి ఒదిగి ఉండే ఆయనలోని అమాయకత్వము.

వరంగల్ జిల్లా మడికొండ గ్రామంలో 1916లో జన్మించిన శ్రీ పల్లా దుర్గయ్యగారు ఉస్మానియా విశ్వవిద్యాలయం నుంచి 1942లో ప్రథమంగా తెలుగులో యం.ఏ. పట్టం పొందారు. "ప్రబంధ వాఙ్మయ వికాసము" అన అంశంపై శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం గారి పర్యవేక్షణలో నిపుణంగా సిద్ధాంత వ్యాసం వ్రాశారు. దీనిని 1959 మార్చిలో ఉస్మానియా విశ్వవిద్యాలయంలో పి.హెచ్.డి. కోసం సమర్పించగా 1960 ఏప్రిల్ మాసంలో డాక్టరేట్ కొరకు అంగీకరించడం జరిగింది. దీన్నే 1973లో ప్రచురించారు.

ఈ సిద్ధాంత వ్యాసానికి ముందుగానే వీరు "మనుచరిత్ర"పై వ్రాసిన పరిశోధనాత్మక వ్యాసాలు శ్రీ దుర్గయ్య గారి విమర్శనా పాటవానికి ప్రతీకలు. వీరి సిద్ధాంత వ్యాసంలో ఆంధ్ర వాఙ్మయ సుక్షేత్రమున 'ప్రబంధము' పండిన బంగారు పంటగా ఆయన అభివర్ణించారు.

ప్రాచీనాంధ్ర వాఙ్మయ రచనా కాలమును చారిత్రికులు పురాణయుగమని, ప్రబంధయుగమని విభజించారు. పురాణయుగానికే అనువాదయుగమని మరో పేరుందని, ప్రబంధ యుగాన్ని కూడా కొందరు ఇలాగే రెండు విభాగాలు చేశారని వివరించారు. వాటిలో మొదటి భాగాన్ని కృష్ణరాయల యుగమన్నారు. అది క్రీస్తు శతకం పదునారవ శతాబ్ది. రెండోది క్రీస్తు శకం 1600 నుండి 1800 అనంతర ప్రబంధయుగమన్నారు. దీనిని క్షీణయుగమని కూడా కొందరు వ్యవహరిస్తారు. ఈ యుగంలో వ్రాసిన ప్రబంధాలు దాదాపు అన్నీ పూర్వయుగ ప్రబంధాల అనుకరణాలు. వాటిలో "క్రొత్తపోకడలు" కానరావు. అందుచేత క్షీణయుగమని పేరు పడసిందన్నారు.

పదునారవ శతాబ్ది ప్రబంధాలు ప్రతిభావంతమైనవి. అష్టదిగ్గజాలుగా పేరుగాంచిన అల్లసాని పెద్దన ఇత్యాది ఎనమిది మంది మహాకవులు కొంచెమించుమించుగా ఈ కాలంలోనే వున్నారు. వారు స్వతంత్ర ప్రతిభతో ఒక్కొక్కరు ఒక్కొక్క నూతన మార్గానికి ప్రతినిధులు. ప్రబంధ వాఙ్మయం మొత్తంలో "మనుచరిత్ర" లాంటి సృజనాత్మక రచనలదే పై చేయి ముఖ్యమైన ఈ కొన్ని కావ్యాలను చదవడం దాదాపు ప్రబంధ వాఙ్మయాన్ని అంతగా చదవడంగా శ్రీ దుర్గయ్యగారు తెలిపారు.

అష్టదిగ్గజాలు కాకుండా ఈ యుగంలో వున్న మహాకవులలో పేర్కొనదగినవాడు పొన్నగంటి తెలగనార్యుడు. అతడు అచ్చ తెలుగు ప్రక్రియకు మార్గదర్శి. బోతే వస్తు నవ్యతను పాటించినవారిలో ఈశ్వర ఫణిభట్టు, రాధామాధవ కవి మొదలగు వారు కొందరున్నారు. అందుచేత ఈ సిద్ధాంత వ్యాసంలో పదహారవ శతాబ్దికి (రాయల యుగం) చెందిన గుణవిశిష్టత కల ప్రబంధములను మాత్రమే ఆయన గ్రహించారు. ప్రబంధ శబ్ద విచారం నుండి ఇతర భాషా కావ్యాల్లో ప్రబంధ లక్షణాలు. ఆంధ్ర వాఙ్మయంలో ప్రబంధ వికాసం, ఆంధ్ర కవుల అనువాదము, అనువాద సాహిత్యంలోని

శృంగార కథలు, అనువాద కవులలోని ప్రబంధ వర్ణనలు, అనువాద యుగంలోని సాహిత్యోద్యమాలు, నష్టసారస్వతము, ప్రబంధ ప్రాయకృతులు, రాయల ఆస్థానములో దిగ్గజాల సమీకరణ, పదునారవ శతాబ్ది ప్రసిద్ధి ప్రబంధ కవుల గ్రంథాల పట్టిక, పదహారవ శతాబ్ది ప్రబంధ యుగము, ప్రథమాంధ్ర ప్రబంధము, మనుచరిత్రము, అందులోని పాత్రలు, రసపోషణ, ప్రబంధ వర్ణనలు నాటకరీతులు, అల్లసానివాని అల్లిక జిగిబిగి, అన్యదేశ్యములు, పెద్దన లోక జ్ఞానము, మనుచరిత్రము, ఉపదేశము, పెద్దనామాత్యునిపై పూర్వ కవుల ప్రభావం ఇత్యాది అనేక శీర్షికలతో విమర్శనాత్మక చర్చను ఎంతో నైపుణ్యంతో శ్రీ దుర్గయ్యగారు చేశారు.

ఇకపోతే వీరు ప్రచురించిన తొలికావ్యం "పాలవెల్లి" మన్మథ చైత్రములో ప్రచురించబడినపుడు కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు "నేటి తెలంగాణాలో చక్కని భాషా జ్ఞానము కలిగి గొప్పకోవలో కవితా సంచారము చేయు కొద్ది మంది కవులలో శ్రీ పల్లా దుర్గయ్యగారొకరని" కీర్తించారు.

అంతేకాదు కవిత్వంలో పలుమార్గములు పోగలిగిన శక్తిశాలి, అర్థవంతంగా శబ్దమును ప్రయోగించగల శక్తిగలవాడు శ్రీ దుర్గయ్య అని ఆయన ప్రశంసించారు.

పాలవెల్లి కావ్యంలో మొదటి భాగంలో అన్ని పద్యాలు చేర్చారు. రెండో భాగంలో గీతాలను ప్రచురించారు. ఏమైనా ఈ కవితలన్నీ వైవిధ్య పూరితమైనవి, భావనా పూర్ణములైనవి. ఈ కావ్యములోని 'ఏమి', 'దివ్వెల పండుగ', 'స్మృతి' 'కుబేరుడు', 'వర్షాది' మొ॥గు శీర్షికతో శ్రీ దుర్గయ్యగారు వ్రాసిన కవితలలో కమనీయతను, కవితాత్మను, సమకాలీన వ్యవస్థను, కవి చాతుర్యాన్ని దర్శించవచ్చు.

ప్రస్తుతం తెలుగు విశ్వవిద్యాలయం వైస్‌చాన్సలర్‌గా ఉన్న డాక్టర్ సి. నారాయణరెడ్డి, తెలంగాణ రచయితల సంఘం కార్యదర్శిగా ఉన్నప్పుడు తొలిసారిగా వీరి కావ్యఖండికలను ప్రచురించింది. తమ రచనలను సంపుటీకరించి ప్రచురించడానికి అంగీకారం తెలిపిన శ్రీ దుర్గయ్యగారికి 'కృతజ్ఞతలు' తెలుపుతూ డా॥ సి, నారాయణరెడ్డి ఇలా అన్నారు.

"పద్యాన్ని ఎంత ప్రౌఢంగా నడపగలరో, గీతాన్ని అంత కమనీయ రీతిలో రచిస్తారు. కవిత్వానికి కావలసిన ప్రతిభావ్యుత్పత్తులు సమాన ప్రమాణంలో గల దుర్గయ్యగారి కావ్యఖండికలు అటు ప్రాచీనులకు, ఇటు అర్వాచీనులకు ఆనందోల్లాసం కల్గిస్తాయి."

"తెలంగాణ జనపదాల్లో వాడుకలో వున్న పలుకుబళ్ళను సందర్భోచితంగా కూర్చి కావ్యహారానికి సౌందర్యం అందించడంలో దుర్గయ్యగారికి విశిష్ట స్థానమున్నది".

ఇక పోతే నాకు ఎంతగానో నచ్చిన కావ్యం 'గంగిరెద్దు' వాస్తవానికి ఈ కావ్యం నా మీద వేసిన ముద్రవల్లనే తెలుగు అంటే తేనెలూరే భాషగా నేను అనుభూతిపొందాను. తెలుగునేల, తెలుగు వారి ఆచార సంప్రదాయాలు, పండుగలు, పబ్బాలు, తెలుగు నుడికారం పట్ల అవ్యాజమైన అనురాగం నాకు కలగడానికి ఈ కావ్యమే దోహదం చేసింది.

ఈనాటికి నేను వందలు, వేల శంఖ్యలో వ్యాసాలు, సమీక్షలు, తదితర రచనలు చేశాను. సుమారు ఇరవై సంవత్సరాల క్రితం 'గంగిరెద్దు' ఆంధ్ర సంస్కృతికి అద్దంపట్టిన కమనీయ కావ్యం. శ్లోకాన నేను వ్రాసిన వ్యాసం మొట్టమొదటిసారిగా పత్రికలో ప్రచురితమైన నా రచన.

అప్పటి నుండి విడువకుండా నేను రచనలు చేస్తున్నా ఇప్పటికీ నాకు ఆ కావ్యమంటే ఎంతో మక్కువ 'గంగిరెద్దు' కావ్యం ప్రస్తుతం నా దగ్గర ఒకటి మాత్రం ఉంది. సుమారు డజను సార్లు నేను ఈ కావ్యంను కొన్నాను ప్రతిసారి ఎవరో ఒకరు తీసుకోవడం, దానికి నేను నీళ్ళు వదులుకొని మరొటి కొనుక్కోవడం. ఇలా డజనుసార్లు జరిగింది. అయినా కూడా మనవారిలో పుస్తకాలు కొనుక్కొని చదువుకునే అలవాటులేదని నేను బాధపడడంలేదు, ఎందుచేతంటే పనికిమాలిన చిల్లర నవలలు ప్రయాణ సందర్భంగా కొనుక్కొని చదివి పారేసే మన పాఠక మహాశయుల చేత మన జాతి, మన ఆచార వ్యవహారాలు, పలుకుబళ్ళు పొందు పరచిన మహా కావ్యం చదివించి, నా పరిధిలో నేను చేయవలసిన ప్రచారం చేశాననే ఆనందం పొందాను.

పోతే ఆంధ్ర సంస్కృతికి అద్దం పట్టిన కమనీయ కావ్యం "గంగిరెద్దు"తో తెలుగు సాహిత్య లోకంలో ఉషోదయమైంది. నవ చేతన కాలంబనగా, నూతన కాంతి నావిష్కరిస్తూ మకర సంక్రాంతి లక్ష్మి గంగిరెద్దు కావ్యంలో అవతరించిన తీరు సమ్మోహితుణ్ణి చేస్తుంది.

ఈ కావ్యంలోని కథాంశం వైవిధ్యంతో కూడినది. ఇందులో ఒక కరణమయ్య "వడి ఆవును" ఒక కాపు దంపతులు పోషించడానికి తీసుకుని, ఆ ఆవు పాలు, పెరుగు, మజ్జిగ తన వంతుకు రాగా పెయ్యలన్నీ కరణమయ్యకు చెందుననే కట్టుబాటుకు శిరసావహిస్తారు. అదృష్టవశాత్తు తొలిచూలు కరణమయ్యకే దక్కుతుంది. మలి చూలైనా కోడె దూడవుతుందని ఆశించిన కాపుదంపతులు నిరాశా నిశీధి పాలవుతారు. అంటే పుట్టినది కోడెయే అయినా దీని మూపురముపై ఐదవ కాలుతో పాటు రెండు తోకలు వుంటాయి. అదే ఈ కథానీయకము.

"కాకిపిల్ల కోకిలకు ముద్దు కాదుకదా!" అంచేత ఆ వింత కోడెను కాపు దంపతులు, తన తల్లియావు ప్రేమించినా, ఊరిలోని వారందరు ప్రేమింతురా? కొందరు తిట్టుటకు వెనుకాడక పోగా, కొందరు కొట్టుటకు ప్రయత్నించగా, మరికొందరు అల్లరి చేయగా, ఒకనాడు ఆ కోడె ఇల్లు విడిచి వెళ్ళిపోయింది.

ఇల్లు విడిచి వెళ్ళిన కోడె ఒక అరణ్యం చేరుతుంది. అక్కడ కొలది దినముల వాసము. ఆ అరణ్యంలో ప్రత్యక్షమైన తల్లియావు దారి చూపుతూ ఒక పల్లె ప్రాంతానికి తీసుకువస్తుంది. ఆ ప్రాంతంలో ఆటలాడుతున్న గంగిరెద్దులవాడి దృష్టి నాకర్షిస్తుంది. ఫలితంగా మచ్చిక చేసుకుని, విద్యలు నేర్పిస్తాడు.

ఒక సంక్రాంతినాడు ఆ పల్లెలో తాను నేర్చుకున్న విద్యల నైపుణ్య ప్రదర్శన జరుగుతుంది. ఈ కథా నాయకునికి ఆ సంక్రాంతి పర్వాన విపులమైన బహుమానాలు, ఆదరాభిమానాలు లభిస్తాయి. చివరకు తను పుట్టిన పల్లెకే వచ్చి, తనను తూలనాడిన వారి చేతనే కొలువబడుతుంది. తనను పెంచిన కాపు దంపతులను గుర్తించి, మిక్కిలి సంతోషపడడం ఇత్యాదులు ఇందులో మనోజ్ఞంగా కూర్చబడిన విశేషాలు.

సంక్రాంతి సంక్రమణం అంటే మారడం అని అర్థం. దినకరుడు మేషాది ద్వాదశ రాసులందు క్రమంగా పూర్వ రాశి నుంచి ఉత్తర రాశిలోకి ప్రవేశించడం సంక్రాంతి అందుచేత సంవత్సరానికి 12 సంక్రాంతులు ఉంటాయి అయినా పుష్య మాసంలో సూర్యుడు మకర రాశిలో సంక్రమించగా వచ్చే "మకర సంక్రాంతి"కి కడు ప్రాముఖ్యం ఉన్నది. ఇది నెలరోజులు 'సంక్రాంతి పండుగ' రూపంలో ఆధిక్యత గడించుకున్నది.

ఆ వైభవాన్నే తమ కావ్యంలో సమ్మోహనంగా ప్రతిబింబింప జేసింది. పల్లా దుర్గయ్య గారు ఆంధ్ర సంస్కృతికి నీరాజనం పలికారు. శరతల్పాని శయనుడైన భీష్మ పితామహుడు స్వేచ్ఛా మృత్యుకాంతా స్వయం వరుడైన పుణ్యకాలమిదే. ఈ ఉత్తరాయన పుణ్యకాలం కోసమే కురురాజ న్యుడు నిరీక్షించాడు.

"మూయబడెన్ యమాలయపు ముఖ్య కవాటము ప్రాణికోటికిన్, తీయబడెన్ సురాలయపు దివ్య కవాటము. దక్షిణాయనాధ్యాయా సమానవనాంతర మనంతవిహార సంచారి సూర్యనారాయణుడుత్తరాయణ పరాయణుడైన శుభహామందునన్" అని ఆరభించి మకర సంక్రాంతి రామాయణిని ఆద్యంతం సహజ రమణీయమైన కల్పనా చమత్కృతులతో వర్ణించారు పల్లా దుర్గయ్య గారు. ప్రతి పుష్యం హృద్యంగా రూపొందించబడిన ఈ 'గంగిరెద్దు' కావ్యంలో గంగిరెద్దు కాకుండా కేవలం పల్లెలోని సంక్రాంతి వర్ణన 20 పద్యాలలో చెప్పారు. పట్టణాలలోను ఈ పండుగను ఆచరించు తున్నా, సంక్రాంతి అసలు స్వరూపం చూడాలంటే పల్లెటూర్లే నెలవులు. ఈ సంక్రాంతి పర్వం బల్లెపట్టులలోని ప్రజలను నిలువెల్లా పులకరింపజేస్తూ, దోసిలినిండా తెచ్చిన ఆనంద సుమాలను ప్రతివాడి ఎదలోనూ గుమ్మరిస్తుంది. ప్రతి పల్లె అలంకరణతో నిండి పురివిప్పిన నెమలివలె కన్నులపండువుగా వున్నట్టే గంగిరెద్దు కావ్యానికై తీసుకున్న యితివృత్తం కావ్యానికి నిండు తనాన్ని, సొగసుతనాన్ని కూర్చి సుమధురంగా సాగింది.

ఈ కావ్యంలో 'గంగిరెరెద్దు' కథారమణీయకము. గంగిరెద్దు అనగానే హృదయమ్మున భద్రపరచిన దాని రూపుఖలు చిత్తరువువలె కన్నులకు కట్టి నట్లు, దాని కింకిణుల ఘల ఘలం ఘలలు చెవులకు గింగిరుమంటూ ప్రతిధ్వనించినట్టు స్ఫురిస్తుంది. లోక హృదయాంతరాలలో అలాంటి విశిష్టస్థానాన్ని

ఏర్పాటుచుకున్న బసవన్న బుద్ధులు నేర్చుకున్న వేదం అంటే ఇది స్వతహాగ కోడె అయినా దీని మూపురంపై అయిదవ కాలుతోపాటు రెండు తోకలు వుంటాయి.

అవయవ సౌష్టవం దృష్ట్యా అవలక్షణ హేతువుగా పరిగణించబడినా అత్యున్నత విద్యాకౌశల్యం దృష్ట్యా మంగళ కరుడైన బసవదేవుడి అవతారమే సుమా, నిండు భక్తితో బసవన్నకు కాళ్ళుకడిగి, నొసటను, గిట్టలకు పసుపు కుంకుమ పెట్టి పల్లీయులు మనస్సుల విశేషంగా పొంగిపోతారు. బసవన్న తెల్లని మేనిపై జేగురు చీరల దుప్పటి, కంఠమున, వీపున, ప్రక్కల ప్రేలా డుతూ ఘల్ ఘల్ న మోగ్రిగు మువ్వలు, గజ్జెలు, గంటలు, ఇత్తడి తొడుగులు గవ్వా గుత్తులు, తళుకుమనే పచ్చని కుచ్చులతో కొమ్ముల ప్రేలాడే పట్టుసెల్లాలు జరీ కండువాల జోళ్ళు, కాశ్మీరపు శాలువాలతో మెరుస్తూ గ్రామీణులను ఎంత గానో ఆకర్షిస్తుంది.

ముఖాన కుంకుమబొట్టు, చేతితోనో లేదా మూతితోనో సన్నాయి వుం చుకుని, చెర్నకోల పట్టుకొని నడుముకు వెండి బిళ్ళల మొలత్రాడుతో, కావి శాలువా, తలపాగు, భుజాన కండువా, సన్నంచు ధోవతి, నల్లని కోటు ధరించి సంపన్నులు బహూకరించిన "నిషానీ" లకు నిలయమైన గంగిరెద్దులవాడు- డోలు డుండుమ్మని కొడుతూ 'ఒహోయి బసవన్న, ఓంకార బసవన్న' అని పదం ఎత్తుకుని చెవులు గింగురు మనగా ఇంటి ముందు తన ప్రతాపం, గంగి రెద్దు నైపుణ్యం ప్రదర్శిస్తాడు ఊరంతా తిరుగుతూ కొత్తగా వచ్చిన ధాన్యాన్ని అడుక్కుంటూ వుంటాడు. తాను కోరబోయే ప్రతిఫలం ఏతమైనా గొప్పగా చెప్పుకుంటాడు.

'ఘనమైన ప్రభువులు కనిమెచ్చిరేని,
ధనధాన్య సంపదలు మనకితురోయి
కొండలో వరహాలు కొలచి కట్టెదరు
బంగారు సేలువలు ఒత్తి గప్పెదరు.'

అంటూ సంబరమున డోలు డుండుమ్మని కొడుతూ అంబరవీధులలో సంచరిస్తున్నట్టుగా ఉత్సాహపడటం, ఉత్సాహం కలుగ చేయడం అత్యద్భు తంగా చిత్రించారు శ్రీ పల్లా దుర్గయ్యగారు. ప్రతీ పద్యం రసవంతంగానూ,

ప్రతిపదం అర్థయుక్తంగానూ శోభిల్లింది అందుకే సులక్షణ శైలిలో నడచిన ఈ కావ్యం సామాన్య పాఠకుడి పాలిట 'తరిగేటి జున్ను'.

సంక్రాంతిలక్ష్మి పల్లెలలో ప్రవేశించడాన్ని ప్రస్తావిస్తూ-' పసిడి గన్నేరు పీతాంబరచ్చవులు దిక్కుల నిండ బౌకళింప' అన్నారు పసిడి గన్నేరు పూలు అని పసుపు వర్ణాన్ని గుర్తుకు తెప్పించడంలో మంగళకర వాతావరణాన్ని ధ్వనింపచేశారు. ఆ గన్నేరు పూల "పీతాంబరచ్ఛవులు" అని ప్రస్తుతించడంలో సస్యశ్యామల వాతావరణాన్ని సూచించారు. ఎంతగానో ముస్తాబయిన ఆ సంక్రాంతి రమారమణి "పొగవన్నె మంచు దుకులాంనుంచి మిసిమి మైఛాయ క్రొమ్మించు లీనుచు" వస్తుందట అంటే తెలుగు సీమలో ఉదయించిన నవ్యవాతావరణంలో అంత స్వచ్ఛతను, చల్లని చూపున ద్యోతకం చేసేందుకు మంచుదుకులాన్ని సంకేతంగా తీసుకుని తేటపదాలతో నిగూఢార్థాలను ఆవిష్కరిస్తూ చెప్పిన పద్ధతి,సమయస్ఫూర్తిగా, ధామ మంజరీ సౌరభాలతో ఘుమఘుమాయితమైన విశిష్టతను చెబుతూ పవిత్ర వాతావరణాన్ని సృష్టించడం ప్రశంసించదగింది.

కళ్ళాపిచల్లి, అలికిన తలవాకిళ్ళందు తెల్లని ముత్తెములు చిదిమి తీరిచినట్టుగా ముగ్గుల దొంతరలు ముచ్చట గొల్పుతున్నాయట, ఆ ముగ్గుల పందిళ్ళలో గొబ్బిదేవర ప్రతిష్టచేసి ఆంధ్రసుందరులు కుంకుమ, పసుపుచల్లి సంవత్సరం పొడవునా కీడులు రాకుండా బ్రతుకు పూలబాటలా ఫలించాలని రేగుబండ్లు వుంచారట.

ప్రతి గృహమందు ఆంధ్రయువతులు కడుశ్రద్ధతో, అత్యద్భుతంగా అమర్చిన లక్కబొమ్మల కొలువు కూటాలను వర్ణించడంలోని కవి ప్రతిభ పరవళ్ళు తొక్కుతుంది. ఒక చిత్రం కన్నులకు కట్టినట్టు అనుభూతి కల్గుతుంది. ఉదాహరణకు-శ్రీకృష్ణుడు గోపికలవచించి వస్త్రాలను అపహరించిన సందర్భాన్ని ఎంత ప్రశంసనీయంగా చెప్పారో చూడాండి.

> "వలువలు గట్టు నన్విడిచి పైచి జలంబుల జోగు గొల్లభా
> మల గికారించి తద్వాసన మండలి గైకొని పొన్న చెట్టుపై
> కిలకిల నవ్వుకొంచు కటికృష్ణుని గన్గొని నాభిదఘ్నవా
> రులగుచు గోపికాంగనలు రొమ్ముల గేలిడి మ్రొక్కు రాకెడన్"

అని తీసుకున్న విషయం ఎంత అస్పష్టమైనదైనా దాన్ని భావన చేయగల రసజ్ఞత, చక్కగా ప్రతిబింబితం చేయగలిగిన కవితాశిల్పం శ్రీ పల్లా దుర్గయ్యగారి కవితలో పుష్కలంగా కన్పిస్తుంది.

ఇంకా రామాయణ గాధలు, భాగవత కథలు, శ్రీ కృష్ణుని లీలామానవవిహారణాలే కాకుండా భారతజాతి స్వేచ్ఛకై ప్రాణముల బలిపెట్టిన మహోన్నత దేశభక్తులుగా యుగంధరుడు నెహ్రూజీ, పొట్టి శ్రీరాములు మొ॥ నాయకాగ్రగణ్యులను ఈ బొమ్మలకొలువులో వుండడాన్ని వర్ణించి శ్రీ దుర్గయ్యగారు అత్యాధునికత ప్రదర్శించారో సమయస్ఫూర్తిగా తెలంగాణా మాండలిక పదాలను వాడుకొని వాటికి రసభావాలంకృతులతో మనువు గావించారు. కడురమణీయమైన శయ్యామార్ధవాన్ని సంతరించి పెట్టారు.

ఇక వీధులలో వింతలెన్నో తిలకిస్తూ తీరుణులు, పిల్లలు ప్రోవులై నిలిచారట అపుడు నాసికపై నుంచి నడినెత్తి వరకు తిరుమణి పట్టెలతో పిడివంటి మెడకు తులసిపూసల మాలతో-కంచుగజ్జెలు ఘల్లుఘల్లుమనగా చిందులు త్రొక్కుతూ, చేతులలోని గండచిదత కొడుతూ కోడిగ్రుడ్డుల్లంటి బోడితలపై రాగి అక్షయపాత్ర కదలకుండా "హరీ . హరీరంగ హరిలోరంగ" అంటూ సాతాని జియ్యరు వస్తాడు.

రుద్రాక్షపూలతో కుట్టిన గోపురాకారపు టోపిదాలిచి-కనురెప్పలకు కూడా కలిపె కణతల వరకు ఫాలమున విభూతి కాట్లు పెట్టుకుని, కాశికా రుద్రాక్షి కంఠమాలిక మధ్య వెండిలింగపు కాయతో-జోలె మీదుగా శంఖ సూత్రాన్ని ధరించి-గంట గణగణమని మ్రోగిస్తూ "హర హరా పాహి! మాంపాహి! శరణు శరణు శంకరా" అంటూ జంగమదేవర ఓంకార శంఖారావంతో వెడలుతున్నాడట.

ఒక పడుచు నడుముకు తగిలించుకున్నడోలు డుండుమ్మని కొడుతుండగా, తన చెవిని చీరుకుని రక్తాన్ని విరజిమ్ముతూ పులితలతో తన ముఖాన్ని కప్పుకుని, చిట్టేళ్ళతో చిటేల్ పెతేల్ మని కొట్టుకుంటూ పెద్దిమలవాడు వచ్చాడట.

డుబు డుబు డుక్కు డుక్కు మని
బుడుబుడుక్కు కొట్టుచు జోస్యపు కబుర్లు

చెబుతూ డుబుడుక్కు వాడొకడు వచ్చాడట
"అంబ బళిబళా జగజ్జనని పల్కుమటంచు"
పంబ కొట్టుతూ పంబలవాడు వచ్చాడట.

"తెప్పలుగ చెరువు నిండిన కప్పలు పదివేలు చేరుగదరా సుమతీ!" అన్నట్టు పాడి పంటలతో ప్రతి గృహం వెలయగా అడుక్కుపోయేందుకు బహువేళలలో బహువృత్తులవాళ్ళు తారసపడతారు.

ఇక సరదాకోసం కోడిపుంజులను పందెములకోసం తీసుకొచ్చినవారు చెప్పుకునే గొప్పలు వారు సైగలు చేస్తుండగా కొక్కొరోకోయని కూస్తూ రోషంతో మెడచుట్టూ జుంజురులు విచ్చుకొనగా ముక్కుతో ముక్కుమ కల్పి జుట్టులు రేగి, కేరింతలుకొడుతూ పోట్లాడుతున్న పుంజులు.

మెలికలు తిరిగిన కొమ్ములతో, పొగరులెక్కిన పొట్టేళ్ళు వాలమ్ముల లేవనేత్తుతూ కాళ్ళ నిర్రదన్ని మొదళ్ళు అదిరిపడేట్టుగా నెత్తినెత్తి దిందిమ్మని కొట్టుకుంటూ తమ బలప్రదర్శన చేస్తున్నాయట.

ఇలా పల్లెపట్టులలోని వేడుకలను సహజ సౌందర్య దీప్తితో కడు రమణీయంగా చిత్రిస్తూ కూడా "కన్నుల జోడవలె జెప్పగా తరంబె" అంటారు శ్రీ పల్లా దుర్గయ్యగారు అంటే ఆ కమనీయమైన అలంకరణల పట్ల, వేడుకల పట్ల కవి హృదయం ఎంతగా ప్రభావితం అయిందో ద్యోతకం అవుతుంది. ఈ వర్ణనలు కవి తనకు గల లోకానుభవం, భావనాశక్తి, సంప్రదాయ వ్యవహారాలు పిండి, ఆ రసంతో చేసిన పండులా గోచరిస్తాయి.

అందుకే ఈ కావ్యాన్ని గురించి ప్రముఖ కవి డా॥ సి. నారాయణ రెడ్డిగారు "ఇదివరకెవ్వరు స్పర్శించని సరికొత్త ఇతివృత్తాన్ని తీసుకుని శ్రీ దుర్గయ్యగారు ఈ కావ్యం రచించారు. పల్లె ప్రజల దైనందిన జీవితంలో అతి సన్నిహితమైన సంబంధం, వారి నుడికారాలు, సామెతలు, వారి వ్యవసాయక జీవనాన్ని బింబించే పలుకుబడులు శ్రీ దుర్గయ్యగారి ఈ రచనలో అడుగడుగునా కన్పిస్తవి" అన్నారు.

ఈ గ్రంథం తొలి ముద్రణ సందర్భంగా పీఠిక వ్రాసిన విమర్శకాగ్రేసరులు శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు "దుర్గయ్యగారిది గొప్ప

సాహసమైన ప్రయత్నం అది ఇంత సర్వాంగీణముగా, ఇంత మధురముగా ఫలించుట సరస్వతీ విలాసపు వింతలో ఒకటి" అన్నారు.

ఈ గ్రంథం ద్వితీయ ముద్రణ సందర్భంగా పీఠిక వ్రాసిన మహాకవి దాశరథిగారు తెలుగువారి జీవితంలో, సంస్కృతిలో భాగం పంచుకున్న "గంగిరెద్దు"కు స్వాగతం పలుకుతూ కరుణరసం కట్టలు తెంచుకుని ఈ కావ్యంలో ప్రవహిస్తుందన్నారు. నిరుపేదయెడ, నోరులేని పసుల యెడ కవి సానుభూతి అడుగడుగునా కనిపిస్తుందన్నారు. ఇందులో వాస్తవ చిత్రాలు, చక్కని నుడికారాలు, సహజ గంభీరమైన పద్య శైలి పాఠకులను చకితులను చేస్తుందన్నారు.

'గంగిరెద్దు' ఆదరాభిమానాలు గడించుకోవడానికి, మిక్కిలి గౌరవించడానికి సంక్రాంతి పర్వాన గంగిరెద్దు విద్యా కౌశలం ఎలా ఉపకరించిందో అలాగే గంగిరెద్దు కావ్యంసమ్మోహనంగా రూపొందడానికి అందులో కవిప్రతిబింబించిన పల్లెపట్టులలోని సంక్రాంతి పర్వదినం వేడుకలు దోహదకారిగా నిల్చాయనుకోవచ్చును.

ఇందులో శ్రీ పల్లా దుర్గయ్యగారి వర్ణనాచమత్కృతులు ప్రతిభావంతంగా కొనసాగినవి. భావం చెడకుండా, శైలి ఔచిత్యశోభితమై విలసిల్లి, కవి శక్తి సామర్థ్యాలకు తార్కాణాలుగా నిలిచినవి.

ఇంత చక్కని, చిక్కని కావ్యం అందించిన శ్రీ పల్లా దుర్గయ్య గారు సర్వత్రా అభినందనీయుడు. ఆంధ్ర సాహిత్య లోకంలో ఆయన అమరుడు.

# అనుముల కృష్ణమూర్తి

అనుముల కృష్ణమూర్తి

జననం: 1924

మడికొండ, వరంగల్

చిరునామా :

ఇం.నెం. 235
ఎక్సైజ్ కాలని. సుబేదారి
హన్మకొండ 506010

ముద్రితాలు :

సరస్వతీ సాక్షాత్కారము
రసలోకము

అముద్రితాలు :

శబరి
శివతాండవము
లఘుపోతన

# యస్. రాజేంద్రప్రసాద్

శివంగారి రాజేంద్రప్రసాద్
యం.ఏ., యం.ఫిల్.

జననం; 17-11-1962

మడికొండ, వరంగల్ 506142

అముద్రితం :

శ్రీ కుమారాభ్యుదయం=ఒక పరిశీలన
మోహనాంగి శతకం

# శ్రీ అనుముల కృష్ణమూర్తి

శ్రీ అనుముల కృష్ణమూర్తిగారు జగమెరిగిన కవులు, పండితులు, రసబ్రహ్మ బిరుదాంకితులు. సొగసైన గడుసరి మాటకారి అనుముల. ఆ గడుసుదనము, ఆ సొగసుదనము తనకు సాక్షాత్కరించిన కవితా సరస్వతికి కాలి అందె. వారి భావనా వైచిత్రి ఆమెకు వజ్రపు కవచ కుండలం. వారి పద్య రచనా కౌశలం మరాళమునే మరిపిస్తుంది. వారి వాక్కులన్ని హృదయోద్గతమైన సహజ సుందరములు. వారి వృత్తాలు, గీతాలు సుందరోద్యానవనాలు.

శ్రీ అనుముల కృష్ణమూర్తిగారు పండితులకు, కవులకు పుట్టినిల్లుగా ప్రసిద్ధిగాంచిన మడికొండ గ్రామంలో శ్యామలాదేవి, పండరీనాథ శాస్త్రిలకు 1924 సం॥లో జన్మించి, అనుముల రుక్మిణమ్మ విశ్వనాథ శాస్త్రి గారలచే దత్తుగా స్వీకరించబడినారు.

శ్రీమాన్ బక్కయ్యశాస్త్రిగారి వద్ద, శ్రీ మంథెన సీతారామావధాని, శ్రీ ఉదయరాజు శేషగిరిరావు, శ్రీమాన్ అమరవాది నారాయణాచార్యుల గారి దగ్గర విద్యాభ్యాసం చేసారు. శ్రీ మౌల్వీ సంయుజము గారి దగ్గర ఉర్దూ, ఫారసీ నేర్చుకొన్నారు.

వీరికి 1955-56 మధ్యన శ్రీమాన్ కోవెల సంపత్కుమారాచార్యులతోను, శ్రీ జువ్వాడి గౌతమరావుగారితోను గాఢ పరిచయమేర్పడింది, అనేకమంది కవుల పరిచయము కలిగి సరస్వతీ సాక్షాత్కార కృతి రచనకు బాహ్య ప్రేరణ జరిగింది.

ఒక అర్ధరాత్రి అకస్మాత్తుగా మనశ్చక్షువునకు గోచరించిన చీరంచు స్త్రీయాకృతిగ రూపొంది, కన్నులనుండి కాళ్ళ వరకు కరుణమయమైన వాగ్దేవతాకృతిగా భాసించినది. అది సర్వ రసాత్మకమై మహాంధ్రజనని యైనది అని కవి 'స్వయం సమీక్ష'లో తెలిపిన ప్రేరణ అంతరమైన జీవుని వేదన. కవుల పరిచయమునకు తోడు ఈ వేదన జోడై కవితా రూపంగా నిలచింది. అదే "సరస్వతీ సాక్షాత్కారము"

'పద్యః ప్రేమ భాగవతానికే కాదు విషాద వేదనా చైతన్యానికి ప్రాణం పోయాలని పరితపిస్తోంది. గులాబి గుత్తుల్లా మెత్త మెత్తని పదాల శోహాళింపుతో పద్యం మెత్తబడి వత్తైపోకుండా వేడి వేడి మాటలతో పద్యం కవోష్ణ రుధిరంలా పొంగాలని ఉత్సహిస్తుంది.' (ప్రస్తావన-సరస్వతీ సాక్షాత్కారంలో ప్రఖ్యాత విమర్శకుడు శ్రీ జి. వి. సుబ్రహ్మణ్యం గారన్నట్లు సాగిన) వీరి పద్య రచనా శైలి మొత్తమాంధ్ర దేశంలో ఏ ఐదారుగురికో అబ్బిందనవచ్చు.

మొత్తమాంధ్ర దేశంలో సాహిత్యోపన్యాసాలకు, రామాయణ ప్రవచనాలకు ప్రసిద్ధులు, వీరి కావ్య పఠనా శైలి మనోరంజకమును చేకూర్చి పాఠకుల హృదయాంతరాళను దోచుకొనునట్టిది.

తెలుగు దేశంలో భావికవిత్వానంతరం అభ్యుదయ కవిత్వోద్యమ మొకవైపు సాగుతుండగానే, మరోవైపు "దేశీయతా ప్రాతిపదికపై అవిచ్ఛిన్న సంప్రదాయార్ధిగా దేశీయమైన ఆలోచనా విధానాన్ని తాత్వికతనూ శక్తిమంతంగా వ్యక్తీకరిస్తూ విశ్వనాథవారు 1934లో వేయిపడగలను రచించటంతో సాహిత్య చరిత్రలో నూతన అధ్యాయం ప్రారంభమయింది. రామయణ కల్పవృక్షం పోతన చరిత్ర, ఆంధ్ర పురాణం, వందేమాతరం లాంటి సంప్రదాయ కావ్యాలు వెలువడినవి. ఈ దశలోనే, దిగంబర కవుల ఆఖరు సంకలనం (మూడోది) వెలువడ్డ (1967) సం॥లోనే శ్రీ అనుముల కృష్ణమూర్తిగారి 'ఖండ కావ్యం, సరస్వతీ సాక్షాత్కారం' వెలువడడం గమనించతగినది.

తన మనశ్చక్షువునకు గోచరించినది చదువులతల్లి. ఆ చదువుల తల్లిని సాక్షాత్కారింపజేసుకొన్న సమయము క్షణకాలము అప్పటి మూర్తిని 'ఓ మహద్దివ్య సౌందర్య భూమికా నఖస్ఫురచ్ఛలత్తటిత్క్షణ ప్రభా' అంటూ రెండు మాటల్లో చూపాడు.

ఆ స్ఫూర్తిని, అనుభూతిని తన సంస్కార బలంతో విశ్వమయం జేసుకొన్నాడు. ఆమెను జగమంతటా దర్శింప ప్రయత్నం జేశాడు. ప్రకృతి అంతటా ఆమెనే భావన జేశాడు. మొక్కలో, జంతువులో, కన్నతల్లిలో, ప్రేయసిలోనూ దర్శించాడు.

ఘల్లు ఘల్లున దిగురాణీ!

చిలికి బొమ్మ పారాణీ! అని ఆ సరస్వతీ దేవిని ఆహ్వానించాడు ఆ ఆహ్వానించడంలో ఒక సొగసు పదాల అల్లిక అనుకోకుండానే పడే అను ప్రాస, అంత్య ప్రాసలు ఎంతో హాయిని గూర్చుతాయి. అన్నింటికి మించి ఆమె స్వరూపాన్ని కన్నులకు కట్టినట్లు చిత్రించాడు.

మనశ్చక్షువునకు గోచరించిన ఆ చీరంచు నిలా కవితా మయం జేసి, నేత పనిలోని నైపుణ్యము నిట్లు ప్రదర్శించాడు.

'లేయుల్లి వారనార లల్లి నేసిన మేలి
పలివంపు హొంబట్టు చెంగావి చీరంచు'

స్త్రీ ఆకృతిగా నొందుటను చక్కని చమత్కారమైన ఉపమానములతో రూపించాడు. ఇంకా ఆమె పాలభాగాన పై అరిగి మెరుగులు జిమ్మిన శంఖమ్ము వలె మెడవంచి ఉండగా, ఆమెడ మీది నుండి మెరుపు తీగవలె 'గిరినాగు దిగినట్లు'గా నున్నదట. ఆ విధంగా ఆ చీరంచు ఆమె చన్గవల మీది వరకుండుటను, నీలి రంగు మంచుతో కూడిన కైలాసగిరి జంటశిఖరాల మీదుగా ఉన్నట్టుగా పోలిక తెచ్చి పాఠకునిలో ఒక అనుభూతిని ప్రసాదించాడు.

కవి ఉపమానమునే కవితామయం జేసి దానికొక చక్కని వర్ణననిచ్చి అదంతా ఆ చీరంచులోనే గాంచుట అడుగడుగునా గోచరిస్తుంది.

ఇంకా ఆమె సన్న నడుము

'పాల కడలికి చిన్ని
ప్రాకారమున: నొప్పుచూ మెత్తని
పసిడి పుప్పొడి చంద
నమ్మందు కలువాన రంగరింపబడి' ఆ సొగసుల వగ
లన్నీ నిగనిగలాడుతున్నవట. ఆ చీరంచు తొడలమీద నడియాడగా నడకతో వయ్యారమొచ్చిందట.

ఈ కావ్యాన్ని ఎంత చదివినా తనివి తీరదు. అన్నీ వర్ణనలే. అంతటా ఉపమానాలే. చీరంచులో సాక్షాత్కరించిన ఆ దేవిని తలనుండి పాద ములవరకు దర్శించినతీరు రమణీయంగా సాగింది, ఇవన్నీ పద్యాలా, గేయాలా మాత్రి ఛందస్సా, గీతమా, వచనమా అని బేరీజు వేయవలసిన పనిలేదు. కాని వీటన్నిటికి అంతర్గతంగా లయ వెంటాడుతూనే ఉంటుంది.

ముందుగా ఆమె స్వరూపాన్ని వర్ణించి ఆ తరువాత ఆమెను కవి దర్శించిన తీరు, భావించిన తీరు ఆ కరుణా స్వభావము క్రిమక్రమంగా గోచ రిస్తున్నది, 'ఓంకార స్వరూపిణీ ఆదినాద మహేశ్వరిగా, రసకళా రాజీవ రాజేశ్వరి'ని గాంచాడు, అందుకు తోడ్పడ్డది అయన జన్మజన్మాల పుణ్యమో, తపనో, పరములో కాని ఆమె మాత్రం సాక్షాత్కరించింది.

సూర్యోదయమవుతుండగా తామరమొగ్గ వికసించుటలో ఆమెను గాంచినాడు. ఇందులో తామరమొగ్గ, సూర్యులకు మానవత్వమారోపించి ప్రేయసీ ప్రియుల్ని చేశాడు.

వేకువనే లోకాన్ని
ఎలుగెత్తి పిలిచేటి
తొలిపుంజు జారవో
వనిధార కంఠాన, గాంచినాడు,

బ్రాహ్మీముహూర్త వేళ జాతి అభ్యుదయాన్ని కాంక్షిస్తూ భస్మోర్ధ్వ పుండ్ర శోభా ప్రాంశు గాత్రులౌ ప్రాభాత వైతాళికోద్గాత్మ కంఠాలలోనూ ఆ తల్లిని చూచుట జాతి అభ్యుదయమే జాతి జాగృతియే కవికి సరస్వతిగా భాసించినట్లుగా భావింప నగును.

పల్లెటూరి వాతావరణంలో పెరిగిన కవి గనుక రైతు గోమాతపాలు
తుకు దృశ్యాన్ని హృదయవిదారకంగా వర్ణించాడు.

'మొరటైన మోకాళ్ళ
నడిమి గిన్నెలలోకి
తిలకించు గోమాత

జాలి కన్నులలోన' అమె సాక్షాత్కరించింది. పాలు
డు అలవాటు వల్ల రైతు మోకాళ్ళేకాదు మొరటు, హృదయం కూడా అంతే
నమన్నది బోధపడగలదు,

అదే విధముగా పక్కనున్న మొక్కకు నీరు పోసి, కలమంద
క్కను పెకలించు మొరటుచేతిని చూడగా, గజగజలాడేడి కలమంద కాడలో
దొడ్డాకులో తల్లినిచూడాడు. ఈ విధంగా ఒకరికిమేలు, అదే సమయంలో
కొకరికి కీడుచేయు మానవ స్వభావాన్ని వ్యక్తీకరిస్తూ, అ దయనీయ స్థితిలో
కన్నులు నిలచుట కన్పిస్తుంది, తోటి జీవులనుండి దుఃఖాన్ని పంచుకునే
నవత్వం గల మనిషిగా కవి గోచరిస్తాడు.

ప్రేయసిగా కన్పించిన అమెను విడుపలేక ఇలా భావించాడు.

జన్మజన్మల ముందొక్క జన్మమందు
రెండు నీడలు పేరుగా లేవు మనకు
ముందు జన్మల మరల అ మునుపటట్లు
లొక్కడే నీడయౌ యోగమున్న దేమొ"

కవి భూత భవిష్యద్వర్తమానములలోనూ, వారి ఏకత్వానికి దృఢంగా
మ్మతున్నాడు. కనుక 'ఒక చక్కిలిగింతకై ఉన్నదంత ముడుపుగట్టితిగాదే
మడుగులందు' అని ఇంత సొగసైన అమె ప్రతి ఒక్కరి నోళ్లలో బడక
ను. అది అమె అందానిదే తప్పుగాని అమెది గాదంటాడు. తాను భావిం
తీరంతా, ప్రేయసిని స్మృతికి తెచ్చుకున్నతీరు కవిత్వమునందె సాధ్యమౌ
నిష్కర్షగా లోకానికి తెలియజేశాడు.

కవి రచనకు పూనుకున్నప్పుడు అమె దగ్గరగాలేదు. ఎంతో వేదన
భవించాడు. అవేదనలోని కాంక్షనిలా వ్యక్తపరచాడు.

"ఓచెలీ! బ్రతుకూ యోగములేదిక నా యెదలో"—
"ఒంటిగాన్నయి నిల్చి కాళ్లూనిలేను"—

పై పదాలు ఆయన స్థిర నిశ్చయాన్ని, వేదనా తీవ్రతను చాటుతున్నాయి.

కావ్యంలో ప్రధానంగా రసజ్ఞమైన కవితా సరస్వతిని సర్వాంతర్యామిగా దర్శించి చివరకు ప్రియురాలిగా ఆమెతో తన యాతన, ఆమెకై పడే వేదన, ఆమెకోసం నిరంతరాన్వేషణ, ఆమెయెడల అనన్య భక్తి ప్రవృత్తులు గోచరిస్తాయి. ఇదంతా రసతీర్థం. ఒక పద్యం ఒక రసరత్నం. ప్రతి భావ సంపుటి ఆనంద సరోవరము. కావ్యమంతటా అమృతము చిలుకబడి కవిని సహృదయులను చిరంజీవులుగా చేస్తున్నది. 'పసరిక పాములల్లురుక పచ్చని చేను' 'ఈ కలిమి కన్నులోసుమీ! అను ఈ పద్యాలు మనోహరమైన దేశీయ వర్ణన కలవి. బ్రతుకుమీది ఆశను వ్యక్తీకరించుటకు ఎన్నుకున్న ఉపమానాలు ఇందులో కిన్నెలకు కట్టి అనుభవంలోకి తెస్తాయి. పల్లియల వాతావరణంలో పెరిగి వాగులు, వ్రయ్యలు, బావులు, గిరులు తిరుగాడిన వారికి పై పద్యములోని భావన చిత్రమై మనస్సు అలరింజేయగలదు.

కావ్యంలో చివరగా తన వేదనను భగవంతునికి నివేదించుకున్నాడు ఈ కవితలల్లుట, పద్యాలు వ్రాయుట భగవదనుగ్రహపగా భావించాడు. ఈ జగత్తును ప్రకృతిని ఎరుగనంటూనే, 'కోట్ల తనువులు కౌగిలించి' 'కోట్ల గుండెల హత్తుకొని' విశ్వజనీన హృదయంతో మహోన్నతుడైనాడు.

'ఉరుము ఉరిమినది మెరుపు మెరిసినది'
'నా కవితా సరస్వతికి నాలుక లేదొక గుండెదక్క'
'నాదు వనాన సాంధ్య గగనాన'
'నన్నయ తిక్కనాదుల పునాదులు వేరు
మనాది లేనివారలున్న దినాలు వేరు'

అను ఈ పదాల్ని కవికి ఆశువుగా, సహజ సుందరంగా నోటినుండి జాలువారిన రమణీయ మాటలే.

ఇంత మంచి కావ్యాన్ని ఎప్పటికప్పుడు భావావేశం కల్గి చెప్పినప్పడల్లా కాగితంపై వ్రాసి భద్రపరచిన వారు రామశాస్త్రిగారు నిజానికి వారి కృతజ్ఞుడను అని అంటారు నిస్సంకోచంగా అసుముల కృష్ణమూర్తిగారు.

శివతాండవము. శబరి, లఘుపోతన రసాలోకముకాక ఇంకా ఎన్నో ఖండకృతులున్నవి. వ్రాయడమేకాని భద్రపరచకపోవడం జరుగుతుంది. వారికి ఏమాత్రం జ్ఞాపకం లేనివీ కలవు,

శివతాండవము రగడ భేదాలలో రచింపబడినది, శివుడు దశావతారములలో తాండవమాడినట్లుగా అద్వైత భావనజేసి వ్రాయుట విలక్షణంగా కనిపిస్తుంది. కవి మొట్టమొదట శివున్ని ధ్యానించినాడు. ఆ శివదర్శన లక్షణము మహా పవిత్రమైనది,

దానిలో నృసింహస్వామి వర్ణన ఉంది. వేదికపై చిందులాడెడు నారసింహ విగ్రహం కవియొక్క కావ్య దృష్టికి దర్శనమిచ్చినాడో ఏమో!

లంఘించు సింహంపు విదలించు జాలుగా
ఝటాజూట మెగసెగసి పురివడ్డ శాఖగా
ముంగాళ్ళ నెత్తెత్తి పుడమిపై మోదంగ
పంజాల వక్షమ్ము జీల్చు కొనగోళ్ళుగా
గుండె రక్తము పీల్చి శిరమూచు సింగమున
పరశించిన ముఖము పంకించు ఘాతమున
అడుగులన్ బడ్డ పసితలన్ దయననిమిరేటి
భీభత్స కరుణారసావిష్ట భూతమై
ఆడెనమ్మా శివుడు
నారసింహుని రౌద్ర
తాండవం బాడెనమ్మా శివుడు
పాడెనమ్మ శివుడు

ఈ రగడ త్రిశ్రగతిలో చతుష్పాదములలో సాగినది. ఇది మహావేశ పూరితమైన సన్నివేశం.

కవి ఇలా దశావతారములను శివతాండవములో భావనజేసి చివరగా ఆనంద, రసతాండవమడినట్లుగా వర్ణించాడు.

గర్జన్మహాంభోధి గర్భ నిర్భేద్యాట
వీ గర్భ మధ్యస్థ బాడ బాకృద్ధ వహ్నిదార్భాటియై
ఘన పవన శకల సంచలిత కుంతల ఝటాజూటమై
చకచకచ్చకితాక్ష మృదుహాస కోటియై
ధగధగద్ధగితాంగ విన్యాస పేటియై

ఆడెనమ్మా శివుడు
కవితా రసానంద
తాండవమ్మాడెనమ్మా శివుడు

శబరి, పోతన, రసాలోకము మున్నగునవి అసంపూర్తిగా మిగిలిపోయినవి.

ఈమె రామాయణాన కాన్పించె కాని
శబరిగోకెన రామదర్శన సుఖమ్ము
చాలదీమెకు ఆత్మవిశ్వాస బహుళ
ఇది ప్రజాస్వామ్య కావ్య సాహిత్య శబరి

అనుటలోనే శబరి కావ్యములోని నవ్యత బోధపడగలదు.

లఘుపోతన కావ్యంలో కేసనగారు తన కుమారుడైన పోతనకు నాటి శ్రీనాధుని పరిచయం చేసే విధము కవియొక్క రచనాశక్తిని స్పష్టపరుస్తుంది,

"నీవొక జీవి జాతిని జ
నించిన హడవు
విస్మరించకీ
భావము నీచరిత్ర బహూ
పౌరుష గాధ — స్మరించుకొమ్ము"

అని తన జాతి జీవ లక్షణాన్ని, జాతి ధర్మాన్ని ప్రబోధిస్తూ ప్రజల్ని చైతన్యోన్ముఖులను గావించిన కవితలు కూడా వ్రాశారు.

శ్రీ అనుముల కృష్ణమూర్తిగారి ఒక్క 'సరస్వతీ సాక్షాత్కారమును ఎంతో గాఢమైన లోతైన భావుకత, పాండిత్యము వాగ్దేవి కృప ఉంటే తప్ప చూడలేని ఈ కావ్యాన్ని కవిగారన్నట్టు "వ్యధలబొగులని మనసు నీయందెగ అని మనసులో ప్రార్ధించియే ఈ సాహసముచేసినాను అ తల్లి కావ్యము యొక్క కొంగుచివరి ముడినిపట్టంగ నిచ్చినదో" లేదో సహృదయులే ప్రమాణము.

"రసబ్రహ్మ" అనుముల కృష్ణమూర్తిగారి పాండిత్య వైచిత్రికి 'శ్రీసరస్వతీ సాక్షాత్కారం" ఉత్తమ కవిత్వంనకు అధ్యము అయి నిలుస్తుంది.

---

# కోవెల సుప్రసన్నాచార్యులు

కోవెల సుప్రసన్నాచార్యులు

జననం: 17-3-1936 యువఫాల్గుణ బ॥ నవమి

చిరునామా :

ఇం.నెం. 3-19, పరిమళ కాలని
వడ్డేపల్లి, వరంగల్ 506370

ముద్రితాలు :

హృద్గీత
ఆనందలహరి
తేజశ్చక్రము–దుఃఖ యోగిని
**ఆధునా**
ఋతంభర
పాండిచ్చేరి పన్నెండు గీతాలు
పాంచాలరాయ శతకము
శతాంకుర
స్తుతి ప్రబంధము
సాహిత్య వివేచన
సహృదయ చక్రము

టి. శ్రీరంగస్వామి
యం.ఏ.

జననం : 16-7-1950

ఇం.నెం 5-11-114/4
విద్యారణ్యపురి, వరంగల్లు 506009

ముద్రితములు :

మధుర (కవితా సంపుటి)
శిఖరం (కవితా సంపుటి)
మానస సంచరరే . (కవితా సంపుటి)
విపంచి వ్యాస సంపుటి
వరంగల్లు జిల్లా రచయితల వాఙ్మయ జీవిత సూచిక
దేవులపల్లి రామానుజరావు - రేఖా చిత్రం
కోవెల సుప్రసన్నాచార్యులు వాఙ్మయ జీవిత సూచిక

అముద్రితాలు :

కోజరాటు ఏకశిల [యుగోస్లావియా కవితలకు అనువాదం
20వ శతాబ్దపు ఉత్తరార్థ శతక సాహిత్య వికాసం
శ్రీ కాట్రగడ్డ సాహిత్య సమీక్ష

# కోవెల సుప్రసన్నాచార్యులు

"స్నేహమున్నచోట శ్రీ మృదు భావ ప
రిమళములు ఐక్య సిద్ధినొందు
ఊహ సేయవలయు సోహమ్మనన్వలె
జీవభావమపుడు చివురులెత్తు"

(అధునా పుట–30)

ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యులుగారు ఎంత గంభీరుడో, అంత హాస్య ప్రసన్నుడు కూడా. ఈయనతో చనువున్న ప్రతివారికి స్వానుభవంగానే తెలుస్తుంది. ఆయన ఉన్ముఖత ఎంత తేలికయైన భావ చతురుడో, అంతః పుటలలోని భావ పరంపరలకు నిశితమైన ఒరవడిని కల్పించే తాత్వికుడు. వీరి కవిత్వములో, భావనానుశీలనంలో భారతీయ సాంప్రదాయమును, అరవిందుని తాత్వికతను, జిడ్డు కృష్ణమూర్తి భావనాత్మకతను, గాఢమైన అనుభూతిని జోడించి మనకు అందిస్తారు. ఆధునిక సాహిత్య రంగంలో లబ్ద ప్రతిష్టులు సుప్రసన్న. అటు సంప్రదాయ మార్గంలోనూ, ఇటు నవ్య కవితా పథంలోనూ

కవిత్వం చెప్పి మెప్పించగలిగిన ప్రతిభావంతులు. అంతేకాదు— అటు ప్రాచీన కావ్యకళా రహస్యాల్ని ఆవిష్కరించటంలోనూ, ఇటు ఆధునిక కవిత్వ తత్వాన్ని వ్యాఖ్యానించడంలోనూ సమ్యక్ దృష్టి కల విమర్శకులు.

"ఒక జాతి కవిత్వం ఆ జాతి సమిష్టి చైతన్య పురోగమనానికి సూచిక. జీవితంలోని సుఖ దుఃఖాల నడుమ వాటి కతీతంగా సాక్షాత్కరించే తీయనివేళ కవిత— కవివేదననానుభవం వైయుక్తికం, సహృదయుని అనుభవం సామాజికం శబ్దానికి నియతమైన అర్థం, కవిత్వానికి అర్థం అనంత ముఖం— వ్యక్తి సమాజంగా, అతని మనస్సు సామాజిక చైతన్యంగా రూపొందుతుంది కవిత్వంలో" (చేతనావర్తం—2) ఇదీ నేను కవిత్వాన్ని గూర్చి అనుకునేది అంటారు సుప్రసన్న.

యువ నామ సంవత్సర ఫాల్గుణ కృష్ణ నవమి (17 మార్చి 1936) నాడు లక్ష్మినరసమ్మ, వెంకటనర్సింహాచార్యులగార్లకు ప్రథమ సంతానంగా సుప్రసన్న జన్మించారు. ప్రముఖ పండితులు, సంస్కృత విద్వాంసులు అయిన శ్రీమాన్ కోయిల్ కందాడై రంగాచార్యులు గారు వీరి తాతగారు కాగా, బహుముఖ ప్రజ్ఞ గల శ్రీమాన్ తంయ్యాల లక్ష్మినృసింహాచార్యులు గారు వీరి మాతామహులు. ఇద్దరు తాతగార్లు వీరికి సాహిత్యాధ్యయన గురువులైనారు. వీరికి ఎక్కువగా ఇంట్లో జరిగే సాహిత్య చర్చలు, సంస్కృత గోష్ఠులు, కాలక్షేపాలు అంతశ్చేతనంగా సాహిత్య పిపాసను కల్పించాయి. ఈయన సంస్కారాల సంపుటిలో తాతగార్ల ప్రభావాల్లో తంయ్యాల లక్ష్మినృసింహాచార్యులగారిది అవ్యక్తంగానూ, కోయిల్‌కందాడై రంగాచార్యుల గారిది వ్యక్తంగానూ పనిచేసి ఉంటవి. దాదాపు 9, 10 సంవత్సరముల ప్రాయంలోనే కంద పద్యం వ్రాయడం ప్రారంభించినారు. భావాన్ని అనుకోవడం ఇలా ఉంటే బాగుంటుంది, ఇలా రాస్తే ఎలా ఉంటుంది. అని ఆలోచించి పద్యాలను వ్రాయడం చేసేవారు. ఈ చర్చకు శ్రీ సంపత్కుమారాచార్యులుగారు చేయూత. అయితే ఇందుకు ఎక్కువగా సహకరించింది వీరి తాతగార్లే. రజాకార్ల ఉద్యమంలో వీరి కుటుంబం కల్లెడకు వెళ్ళి 1947 అగస్టు నుండి 1948 జనవరి వరకు ఉన్నారు. కల్లెడలో శ్రీమద్రామాయణంపై తాతగారు, ఇతర పండితులు ఇచ్చే ఉపన్యాసాలు వినడం, రామాయణంపై అభిరుచి కలగడం, అందులోని అంశాలను అర్థం చేసుకోవడంనకు బీజం పడింది అంటారు.

ఇక్కడే వీరి యొక్క రచనలను, కవితాత్మను శ్రీ ప్రతాపం రాఘవాచార్యులుగారు చూసి ప్రోత్సాహించడమే కాకుండా, వ్రాసే పద్ధతిని, అందులోని కిటుకులను చెప్తూ, అందలో ఆసక్తిని కలిగించారు. ఈ ప్రోత్సాహం తోని, బాలోత్సాహముతో అంగద రాయబారం/అంగద విజయం అను నాటకాన్ని, కొన్ని పద్యాలను కూడా రాయడం జరిగిందట కాని వాటి ప్రతులు ఈనాడు లేవు. ఈ సమయంలోనే తిరుపతి వేంకట కవులు మొదలగు వారిని తెలుసుకొనడం జరిగింది. 1948 జనవరిలో విజయవాడకు మకాం మార్చ వలసి వచ్చింది. సంపత్కుమారాచార్యులుగారితో దూరంగా ఉండవలసి వచ్చింది. స్థలమార్పిడుల వలన, అయినప్పటికిని భావసంచలనంలోని వ్యక్తీకరణకు ఏమాత్రం ఇబ్బంది లేకుండానే పద్య రచన మాత్రం నడుస్తూనే ఉన్నది.

1948-49 ప్రాంతాలలో తిరిగి వరంగల్లుకు వచ్చాక ఎ.వి.వి. హైస్కూలులో 2వ ఫారం నందు చేరారు. ఆ సమయంలో దూబాటి వేంకట రమణాచార్యులుగారు అక్కడే పని చేస్తున్నారు. వీరికి క్లాసు టీచరుగా 7వ తరగతిలో హరి రాధాకృష్ణమూర్తి గారు ఉండేవారు. ఏ.వి.వి. హైస్కూలుకు శ్రీ యద్దనపూడి కోదండ రామశాస్త్రిగారు ప్రధానాచార్యులుగా రావడంతో స్కూలులో సాహితీ వాతావరణం పెరగడమే కాకుండా, "సుకృతి" అనే లిఖిత మాసపత్రిక ఒకటి వెలువడింది ఏప్రిల్ నెలలో ఈ పుస్తకంనకు ముఖ పత్రంగా కందుకూరి వీరేశలింగంగారి ఫోటోను వేసారు. "పరశురామ పంతుల లింగమూర్తి" గారి గురించి సుకృతిలో ఒక వ్యాసంను దూబాటి వేంకటరమణాచార్యులు గారు రాసారు. ఎ.వి.వి. హైస్కూలులో 'పోతన జయంతి ఉత్సవాలు, ఊళ్ళో 'కాకతీయ కళా సమితి' ఉత్సవాలు జరిగేవి. ఆ ఉత్సవాలలోనే తొలిసారిగా వేదిక నుండి ఓ పద్యంను వినిపించారు. అందులో పొందిన అభినందనలు ఉత్సాహాన్ని రేకెత్తించినవి. 1950 సం॥లోనే చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారిపై పద్యం వ్రాయడం అందులో ఇంట్లోనేర్చుకున్న సంస్కృత ఛాయలు ప్రతిబింబించడం దానికి గుర్తింపు రావడం ఇంకాస్త ఊపువచ్చింది.

శ్రీ అరవిందులు 1950 డిసెంబరులో శరీరాన్ని విడిచిపెట్టడం, ఆంధ్రప్రభలో వ్యాసం రావడం, చూడడం జరిగింది. 1950-51 ప్రాంతంలో భారతిలో వేలూరు శివరామశాస్త్రిగారు వరసగా ఆరేడు వ్యాసాలు అరవిందుల గురించి వ్రాసారు. వాటిని చదవడం వలన సుప్రసన్నగారి

ఆలోచనల్లో కొంత మార్పుకు దోహదం అయింది. ఇందుకు తోడుగా ఊళ్ళోని ధార్మికచింతన, ఆచారవ్యవహారాలలో కూడా 'లిబరల్ ఆటిట్యూడ్' ఒక కారణం కాగా, మిత్రుల ఆలోచనలు ముఖ్యం అయినవి. అరవిందుల తత్త్వం తెలుసుకోవడం వలన సామాజిక చింతనకు క్రొత్త మూల్యాలను వెదుక్కోవడం, అందులో గడపడంనకు ఒక క్రొత్త మార్గం ఏర్పడింది.

విశ్వనాథ వెంకటేశ్వర్లు గారు 1951 సంIIలో ఎ.వి.వి. హైస్కూలు వచ్చారు. అప్పుడు తన పద్యాలను వీరికి చూపెట్టడం, వాటిని పరిశీలించి, సర్ది ఇవ్వడం కూడా అయింది. ఇదే సంవత్సరంలో ఆంధ్ర సారస్వత పరిషత్తు వార్షికోత్సవాల నిమిత్తం విజయవాడ నుండి విశ్వనాథ సత్యనారాయణగారు వచ్చి సభలలోను స్కూలులోను ఇచ్చిన ఉపన్యాసాల ప్రభావం కూడా సాహిత్యంలో ఒక క్రొత్త మార్గను చూపెట్టినవి. ఎన్నో ప్రబలమైన సంస్కారాలు పనిచేసి సుప్రసన్నను కవినీ. విమర్శకుడినీ చేసాయి ఆప్పుడే ఆచారాల పట్లా, ఆడంబరాల పట్లా విశ్వాసం లేని అస్తికుణ్ణి చేసినప్పటికీ, క్రమంగా వీరి మీద ప్రతిబింబించిన వ్యక్తిత్వాలు ఇద్దరివి. ఒకరు శ్రీ అరవిందులు అయితే, మరొకరు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు.

1953 సంవత్సరములో 'హృద్గీత' లోని కొన్ని పద్యాలు (సర్వేశ్వర మకుటం) వ్రాయడం జరిగినది. అప్పుడు వరంగల్లు నుండి వెలువడుతున్న "వివేకానంద పత్రిక" (దీని సంపాదకులు శ్రీ కొమ్మ సుబ్బారావుగారు)లో 1953-54లో అచ్చు అయినవి. ఇదే సమయంలో ఇవి పుస్తకంగా కూడా వచ్చినది. ఈ పుస్తకమును సంపత్కుమారగారితో కలిసి రచించినారు. ఈ కృతికి శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు ముందుమాట వ్రాస్తూ 'శార్దూలమత్తేభములు ప్రౌఢిని సంపాదించుటకు యోగ్యములైన వృత్తములు ప్రౌఢి యున్న గుణమీ చిన్న కావ్యమునందు సమృద్ధిగా నున్నది. ఏ గుణమైనను శబ్దగతమై, భావగతమై ద్విభాయుండును. ఈ రెండును సంయోగమునుబొంది కవితలో నొక విలక్షణమైన ప్రౌఢి భాసించును. అట్టి ప్రౌఢి యీ కావ్యమునందు గలదు. "కవులు వయస్సుచేత చిన్నవారు, కాని వీరి కవితా పాకము మిక్కిలి ప్రశస్తపథముననున్నది. భాషా భావము లొక పరిపాకమునకు వచ్చినగాని యెవ్వరు ఇట్టి పద్యరచనన చేయలేరు" అని అంటారు. శ్రీ రాజరాజనరేంద్ర (చిత్రవిచిత్ర సినీవారపత్రిక సంపాదకులు

అవర్క ప్రింటర్స్ యాజమాని)గారు ముఖపత్రంను అచ్చువేసి ఇచ్చినారు ఈ కృతిపై చక్కటి సమీక్షలు భారతి, స్వతంత్ర పత్రికల్లో వచ్చినవి.

స్వతంత్ర పత్రికలో 1954లో సుప్రసన్నగారి కవితలు రావడంతో సి. నారాయణరెడ్డి, దాశరథిలతో పరిచయం ఏర్పడింది. ఈ సమయంలోనే "సాహితీ బంధు బృందం"ను ఏర్పాటు చేయడానికి ఆలోచనలు జరిగినా అవి ఫలించి 1955 ఫిబ్రవరిలో ఏర్పడింది. దీనికి స్థాపక అధ్యక్షులు వీరు. కార్యదర్శి బి. లక్ష్మణరావుగారు. దీని ప్రారంభం నిమిత్తం విశ్వనాథ సత్యనారాయణగారు వచ్చారని తెలుస్తోంది.

ఉదాహరణముల గురించి వ్యాసం 1954లో గోలకొండపత్రికలో వెలువరించడం శ్రీబోయినపల్లి వెంకటరామారావుగారు (కరీంనగరం) వెలువరించిన సారస్వత జ్యోతి మిత్రమండలి ప్రత్యేక సంచికలో పోతనగూర్చి ఒక ఉదాహరణ చోటుచేసుకోవడం గమనించదగినది. ఈసంవత్సరమే ఆంగ్ల కవిత నొకటి వ్రాసారు.

1954 సంవత్సరములో శారదగారితో సుప్రసన్నగారి వివాహం జరిగింది.

ఇంటర్ చదువుకుంటున్నప్పుడు పోటీ నిమిత్తం 'ఎవరెస్టు' అనే కవిత వ్రాయడం దీనికి రెండవ బహుమతిగా తెలంగాణా రచయితల సంఘం వారు ఇచ్చారు. ఈ పోటీలకు న్యాయ నిర్ణేతలుగా పుట్టపర్తి నారాయణాచార్యులు, నార్ల వెంకటేశ్వరరావు గారలు వ్యవహరించారని తెలుస్తుంది. ఇది 1955 సంవత్సరములో జరిగినది. కాళోజీనారాయణరావు, గార్లపాటి రాఘవరెడ్డి, పాములపర్తి సదాశివరావుగార్ల సహకారం, నేతృత్వంతో "తొలికారు" కవితా సంకలనం సాహితీ బంధుబృందం నుండి వెలువరించడం జరిగింది.

1955 సంవత్సరములో బి.ఏ. చదువుకోవడానికి హైదరాబాదుకు వెళ్ళడం, అక్కడ మాదిరాజు రంగారావుగారితో ప్రత్యేక మిత్రత్వం ఏర్పడినది. జనగామలో జరిగిన "పోతన ఉత్సవాలు" రెండురోజులు ఘనముగా ఏర్పాటు చేసినారు. ఈ సభల్లో శ్రీయుతులు వానమామలై, దాశరథి, సి. నారాయణరెడ్డి, పెండ్యాల చినరాఘవరావు, జె. బాపురెడ్డి ప్రభృతులు పాల్గొన్నారు.

బి.ఏ. చదువుకుంటున్న రోజులలోనే కాళోజీ నారాయణరావు గారిపై వ్యాసం, ఎంకిపాటలపై వ్యాసాలు వెలువరించారు. 1955లో మగదల రామచంద్ర రావుగారి స్నేహంతో చలం సాహిత్యాన్ని పరిశీలించడం, గాఢానురక్తితో పాటుగా వారితో ఉత్తరప్రత్యుత్తరాలు కూడా జరిగినట్లుగా తెలుస్తున్నది వీరి దగ్గరున్న ఉత్తరాల వలన.

1956 సంవత్సరములో పి. యన్. స్వామి, రాధాకృష్ణ, సుప్రసన్న గారలు కార్యకర్తలుగా తెలంగాణా రచయితల సంఘం వరంగల్లు తరపున ఆంధ్రప్రదేశ్ అవతరణ సంచికను కాళోజీ నారాయణరావు, పాములపర్తి సదాశివరావు, గార్లపాటి రాఘవరెడ్డి గారల సంపాదకత్వంలో వెలువరించారు. ఈ సంచికలో రెండు ప్రముఖ రచనలున్నాయి, ఒకటి "అమరశిల్పి" నాటికతో శ్రీ సంపత్కుమారగారు నాటక రచయితగా పరిచయం అవుతారు, ఇంకొకటి సుప్రసన్న "ఓరుగల్లు సాహిత్య సమీక్ష"

సుప్రసన్న సంపత్కుమారల కృతి ఆనందలహరి 1957లో వచ్చింది. దీనిని విశ్వనాథ సత్యనారాయణ గారికి అంకితం ఇచ్చారు. ఈ పుస్తకావిష్కరణ సభను తిలకించిన కానుగంటి రాజేశ్వరరావుగారు ఈ పుస్తకం యొక్క ముద్రణా ఖర్చులు ఇచ్చారు. అపర్ణ అనే కావ్యం కూడా ఇద్దరు కలిసే రచించారు. ఇది అముద్రితం అయితే డా॥ సి. నారాయణ రెడ్డిగారి కర్తృత్వంలో హైదరాబాద్‌నందు యువకవులకు సన్మానం పేరిట అపర్ణఅముద్రిత కావ్యగానం 24జూన్ 1956న జరిగింది. 'సతి' అనే కావ్యంను 9 ప్రకరణాలుగా రచించడంనకు ఆలోచించి ప్రారంభించడం అయింది కాని మధ్యంతరంగానే నిలిచిపోయింది. 1955లో ఎవరివి వారివి విడి విడిగా రచనలు పత్రికలలో రావడం ప్రారంభం అయ్యింది సుప్రసన్న – సంపత్కుమారలు కలిసి సీతను గురించి "దుఃఖయోగిని" కావ్యంను రాయడం జరిగింది. ఇది వస్త్వాశ్రయము గాఢమైన అనుభూతి విచారణా శీలకమైన కావ్యము. విశ్వనాథ మధ్యాక్కరలతో తొలిరచనలు 1956లో వచ్చినవి, వచన కవితకు విడిగా ఒక నిర్దిష్ట రూపం ఉండాలని భావించి ఒక ప్రయోగంగా ఉండాలని సుప్రసన్న తేజశ్చక్రమును రచించాడు. ఇది ఆత్మాశ్రయము ఇందులోని ఛందస్సు ఒక నూతన ప్రయోగం లయానుగుణమైన గతి దీనియందు ప్రయోగింపబడినది తేజశ్చక్రము, దుఃఖ యోగిని రెంటి యందును ప్రధానదృష్టిభావసముద్మీలనము

కళాశాలలోని మిత్రుడు శ్రీనివాసరావుగారి ఆర్థిక సహాయంతో 1958లో ఈ పుస్తకంను అచ్చువేసినారు.

దేశోద్ధారక గ్రంథమాల వారు స్మారకోపన్యాసాలు ఏర్పాటుచేసి శ్రీ సుప్రసన్నచే ఉపన్యాసం ఇప్పించి రూ. 116/-లతో సన్మానం చేసారు. ఈ స్మారకోపన్యాసాలు అన్ని కలిపి "ప్రభాస" అను వ్యాస సంకలనంగా వచ్చింది.

1956 సం॥నుండి ఓ నాలుగైదు సంవత్సరాలు ఖమ్మం, వరంగల్లు, హైదరాబాదులలో "శ్రీ మద్రామాయణ కల్ప వృక్ష పద్యాలు" పఠన ఉత్సవాలు జరిగినవి. ఈ సభల్లోను సుప్రసన్నగారికి భాగస్వామ్యం" ఉంది ఇప్పుడే ఛందారు సదాశివరావుగారితో సన్నిహిత పరిచయం కలిగింది. 1957 సం॥లో వరంగల్లులో 'మిత్ర మండలి' ఏర్పడింది.

1958 సంవత్సరములో జువ్వాడి గౌతమరావుగారు 'జయంతి' పత్రికను ప్రారంభించినారు. ఈ సమయంలోనే హైద్రాబాదులో 'రసధుని' అనే సంస్థను సుప్రసన్న, రామకోటిశాస్త్రి, మొవలి నాగభూషణశర్మ, మాదిరాజు రంగారావు గారలు కార్యకర్తలుగా 'విశ్వనాథ సాహిత్యం'పై ఉపన్యాసాలు వ్రాయించి చదివించడం చేయించినారు. ఈ సభలను సెమినార్‌గా నిర్వహించేవారమని తెలిపారు, 1958లో 'శ్రీ లక్ష్మీనర్సింహోదాహరణము' వ్రాసినా అది 1960లో భారతి పత్రికలో అచ్చు అయింది. జయంతి పత్రికలో సంస్కృత రూపకాలు తెలుగు అనువాదము శీర్షికన నాలుగు వ్యాసాలు వచ్చినవి అంతకు ముందే ఈ ఉపన్యాసాలను సభలో విన్నటువంటి పెద్దలు భూపతి లక్ష్మీనారాయణ, వి.వి. రాఘవాచార్య ప్రభృతులు వాటిని ఉత్తమ పరిశోధనగా ప్రశంసించారని తెలుస్తుంది. (ఆంధ్రప్రభ దినపత్రిక 22-11-58 సంచిక) అంటే సుప్రసన్నగారు యం.ఏ. ఫైనల్ చదువుతున్న రోజులన్న మాట. ఈ సమయంలోనే అబ్బూరి, దేవులపల్లి కృష్ణశాస్త్రి, నాయని సుబ్బారావు, గోపీచంద్. కుందుర్తి తదితరులు హైద్రాబాదుకు రావడం వారితో పరిచయం అవడం జరిగింది.

1959వ సంవత్సరములో యం. ఏ. పూర్తి చేయడంతోటే సిటీ కాలేజీ, ఈవినింగ్ కాలేజీలలో పార్ట్ టైం లెక్చరర్‌గా చేరారు. ఇదే సంవత్స

రములో విద్యుమరాజు రామరాజుగారి నేతృత్వంలో "రామ రాజ భూషణుని కృతులు" అను అంశంతో పరిశోధక విద్యార్థిగా ఉస్మానియా విశ్వ విద్యాలయంలో చేరారు ఈ సందర్భానుగుణంగా మద్రాసు దాకా, విజయనగరం దాగా విభిన్న ప్రాంతాలు వెళ్ళి అక్కడి పండితులను కలవడం తమ అంశం గురించి చర్చించడం జరిగింది. గోపీచంద్‌గారితో సాన్నిహిత్యం, వారితో చర్చలలో కొత్తమార్గం తట్టడంతో పరిశోధన సులభంగా సాగింది. 1961లో పరిశోధన పూర్తిచేసి సమర్పించడం, 1961 లోనే ఉస్మానియా విశ్వవిద్యాలయంలో అడ్‌హక్ లెక్చరర్ నియామకం జరిగింది. 1962 జూన్‌లో డాక్టరేట్ ప్రదానం అయింది. 1960 సంవత్సరములో వరంగల్లు నందు "కులపతి సమితి"ని స్థాపించినారు, ఈ సమితికి యద్దనపూడి కోదండరామ శాస్త్రిగారు అధ్యక్షులుగాను, హరీంద్రబాబు గారు కార్యదర్శిగా పున్నారు. ఆ సందర్భంలో కాళిదాసుపై ఒక వ్యాసముమ సమర్పించినారు, 1962లో ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజీ, వరంగల్లుకు లెక్చరర్‌గా వచ్చారు.

1958 - 64 సంవత్సరాలలో వ్రాసిన పద్యములను కొన్నింటిని కలిపి "అధునా" అనుపేర ఒక సంపుటిని 1964లో అచ్చు వేసినారు. ఈ కావ్య సంపుటిని గోపీచంద్‌కు అంకితం ఇచ్చినారు. అయితే గోపీచంద్‌గారు ఈయనకు ప్రాచీన కావ్యాలను క్రొత్త దృక్పథమునుంచి వీక్షించడానికి పురికొల్పినారు. శ్రీ గోపీచంద్‌గారి సూచనమేరకు 5, 6 నాటికలు వ్రాయడం అవి రేడియోలో ప్రసారం కూడా అయినవి. 1963లో శ్రీ గోపీచంద్‌గారు దివంగతులు అయినారు. గోపీచంద్ గారితో కలిగిన మానసికమైన అనుబంధం "అధునా"ను అంకితమివ్వడానకు ప్రేరేపించినది అనుటకు అందులోని అంకిత పంక్తులు చూస్తే తెలుస్తుంది.

"శ్రీ అరవిందదర్శన వ
శీకృతచిత్తత నీవునేను, రా
మాయణ భారత ప్రవణ
మంజుల భావన నీవునేను, స్వే
చ్ఛాయుత జీవన ప్రవహ
ణాదృత భిన్న విచిత్ర భావ సం
ధాయిత నీవు నేను, ఒక
దారిన పోయెడు పట్టివారమై

మనసున సద్ధర్మ భావన
మును సారస్వత మహోక్తి మూలస్తంభం
బనునావృతి, మూడేండ్లుగ
తనరిన స్నేహమ్ము రూపుదాల్చుత దీనన్''

1960-61 సంవత్సరాలల్లో స్రవంతి మాసపత్రికలో 'జ్యోత్స్నా పరిధి' అను నాటిక ఒకటి వెలువరించారు. 1964 సం॥లో ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీకి సభ్యుడిగా ఎన్నుకొన బడినారు. 1967 సంవత్సరములో అకాడమీ ప్రచురించిన "వసు చరిత్ర"కు సంపాదకత్వం వహించడం జరిగింది. ఇదే సంవత్సరం "సాహితీ బంధు బృందం" రీఆర్గనైజ్ చేసి 'చేతనా వర్తము' వెలువరించారు దీనికి శ్రీ సుప్రసన్నగారు సంపాదకులు. 1969-73 సంవత్సరములకు కూడా తిరిగి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సభ్యుడిగా ఎన్నుకోబడినారు. 1968 సం॥ములో పూనాలో జరిగిన "ఓరియంటల్ కాన్ఫరెన్స్‌కు వెళ్ళారు. 1967-68 సం॥లలో జనధర్మ పత్రికలో "నేను చదివిన పుస్తకం" శీర్షికన క్రమంగా కొన్ని వ్యాసాలు రాసారు. 1968 మే లో జిల్లా రచయితల మహాసభలు నిర్వహించడం జరిగింది. వాటికి యం.యస్. ఆచార్య (జనధర్మ సంపాదకులు) గారు ప్రధానంగా పని చేశారు. ఈ సభల్లో సుమారు 150 మంది రచయితలు పాల్గొన్నారు. దీనికి కార్యదర్శిగా సుప్రసన్నాగారే కార్యకర్తృత్వ బాధ్యతను తీసుకున్నారు. 1969-71 సంవత్సరాలమధ్య జనధర్మ త్రైమాసిక పత్రికను వెలువరించడం దానికి గౌరవ సంపాదకులుగా వ్యవహరించి 11 సంచికలు తెచ్చినారు.

"సాహిత్య వివేచన" వ్యాస సంకలనము 1971లో వెలువరించారు. ఇందులోని వ్యాసాలు అన్నీ 1968-71 మధ్య కాలంలో వ్రాయబడినవి. ఈ పుస్తకమునకు 1972 సంవత్సరములో ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ఉత్తమ విమర్శా గ్రంథంగా బహుమతి పురస్కారం చేసారు. 1973 సం॥లో శ్రీ భాష్యం విజయ సారధిగారి నేతృత్వంలో మొట్ట మొదటి అష్టావధానం చేసారు. ఈ అవధానాలు కరీంనగర్, వేములవాడ, ములుగు, ఘన్‌పూర్, హన్మకొండ (ప్రపంచ తెలుగు మహాసభలు 1975) లలో చేసారు. దాదాపుగా 60, 70 అవధానాలు చేసి వుంటారు.

1974 సంవత్సరములో "ఋతంభర" ను ప్రచురించారు ఇదే సంవత్సరములో 'జాతీయ సాహిత్య పరిషత్తు' ప్రారంభం అయినది. దీనికి కార్యవర్గ సభ్యుడిగా ఉండి వర్క్‌షాప్స్, కవితా గోష్ఠులు నిర్వహించడం చేస్తుండేవారు. 1975లో జాతీయ సాహిత్య పరిషత్తు పక్షాన వారి సంధరిం కత్వంలో వరంగల్లు సభలో 'అగ్నిగర్భ' కవితా సంకలనంను ఆవిష్కరణ చేసారు.

పాండిచ్చేరికి 1974లో వెళ్ళడం, అక్కడ ఆశ్రమంలో పొందిన తాదాత్మ్యత, అంతవరకు మనస్సులో రగిలిస్తున్న అరవింద సమాలోచనం ఉప్పొంగి కెరటంగా "పాండిచ్చేరి పన్నెండు గీతాలు"గా పుస్తక రూపకంలో వచ్చింది. వీనిని ఆచార్య యస్. లక్ష్మణ మూర్తిగారు ఆంగ్లంలోకి అనువాదం కూడా చేసారు. 1977 సం॥లో "పాంచాలరాయ శతకం"ను వెలువరించారు. 1977 సం॥లో పట్నాంబి సెమినార్‌లో పాల్గొని "రీసెంట్ ట్రెండ్స్ ఇన్ సౌత్ ఇండియన్ పొయెట్రీ" అంశంతో తెలుగు కవిత్వం పై ఒక వ్యాసాన్ని సమర్పించారు. 1977 నుండి 1980 వరకు నిర్వహించిన 'సంస్కృత భారతి' ఆధ్వర్యంలో శ్రీ భాష్యం విజయసారధిగారి 'ప్రహేళికలు' రెండు భాగాలు, మందాకిని' పుస్తకాలు వచ్చినవి. 1978లో కేంద్ర సాహిత్య అకాడమీ వారి ట్రావెల్ గ్రాంట్ వచ్చింది. తెలుగేతర రచయితలను, విశ్వ విద్యాలయాలలోని సాహిత్యాధ్యయనం నిమిత్తం. ఈ సంవత్సరమే సుప్రసన్న గారి పితరులు వెంకటనర్సింహాచార్యులుగారు పరమపదించినారు. దాదాపుగా ఇదే కాలంలో సాదన మాస పత్రికకు కార్యనిర్వాహక సంపాదకత్వమును వహించినారు. 1981 సంవత్సరము లోచెకోస్లోవాకియా కవితలు కొన్ని అనువాదం చేసి ఆంధ్రప్రభలో ప్రచురించినారు. కేంద్ర సాహిత్య అకాడమీ వారు ప్రచురించిన 'భారతీయ కవిత' సంపుటాలలో వీరి కొన్ని కవితలను ప్రచు రించినారు. అకాడమీ వారు ప్రచురించిన 'Who is who of Indian writers'లో వీరి పేరు నమోదు చేసినారు. 1967లో 1981 సం॥లో మద్రాసు నుండి వెలువడే Poet, బాంబే నుండి వెలువడే Pen, లండన్ నుండి వెలువడిన who is who or poetics లో వీరి కొన్ని కవితలు చోటుచేసుకున్నాయి. 1982 సం॥లో జరిగిన జాతీయ సాహిత్య పరిషత్తు గుంటూరు మహాసభల్లో ఆవిష్కరించిన హిరణ్యగర్భ కవితా సంకలనంకు సంపాదకత్వ బాధ్యత వహించారు.

శ్రీ సుప్రసన్నగారు, కె.కె. రామానుజాచార్యులుగారు నెల్లూరుకు తిక్కన మహా సభలకు వెళ్ళినపుడు పోతనోత్సవాలకునాంది పలికింది అదే సమయంలో వరంగల్లులో జి. యస్. మాధవరావుగారు. అమరేశం రాజేశ్వర శర్మగారు, సంపత్కుమారాచార్యులు గారు కూడా పోతన ఉత్సవాలను నిర్వహించుకోవడానికి ప్రయత్నాలు ప్రారంభించినారు. ఈ విషయాల్ని సమన్వయంగా చర్చించి, సాంస్కృతిక కార్యక్రమాలకు ఆచార్య ఎ.యు.ఆర్. సోమయాజులు గారిని కన్వీనర్‌గా అనుకొని ఒక కమిటీ వేసుకొని వరంగల్లులో పోతన పంచశతి మహాసభలు ఏర్పాటు చేయాలనే ప్రయత్నంనకు 1981లో అంకురార్పణ జరిగినా. 1982లో మహా వైభవంగా ఈ సభలు జరిగినవి. (ఏడుడు పంచశతి స్మారిక) ఈ సందర్భంలో ఆంధ్ర ప్రభ వారపత్రిక (1-3-82)లో 'పలికించెడి వాడు' అనే కథను వెలువరించారు. ఈ కథను చదివిన పాఠకుని మనోనేత్రం ముందు పోతనను ప్రత్యక్షం కావించిన మహనీయుడు సుప్రసన్న. ఈ కథలో గాఢమైన అనుభూతి, పరిణతి ఉంది. అంతే కాదు కథాశిల్పంలో చక్కటి నేర్పు ఉన్నట్టుగా అన్పిస్తుంది. ఈ కథ గురించి ఎంత చెప్పినా తక్కువేకాని దానిని చదివి ఆ అనుభూతిని ఎవరికి వారే పొందడం భావ్యం. ఇదొక్కటే కథ వీరు రాసింది ఇంతవరకు.

1983లో ఒక వ్యాస సంపుటిని తెచ్చారు అది సహృదయ చక్రం ఇందులోని వ్యాసాలు 1959 నుండి 1982లో వ్రాయబడిన కొన్ని వ్యాసాలను ఇందులో క్రోడీకరించారు. ఈ వ్యాసాలన్నీ సరస్వతీ తత్త్వమును చూపెడుతున్నవి. సాహిత్యానికి ఒక అంచు కవీ, వేరొక అంచు సహృదయుడూ ఈ రెండు బిందువులు ఒకచోటికి వచ్చినప్పుడు సహృదయ చక్రమేర్పడుతున్నది. సాహిత్యానుభవమంతా దీనిలో అంతర్భవించిందే. సుప్రసన్నగారు చెప్పినట్టుగా ఈ గ్రంథం అలా ఆవిర్భవించింది.

ఇటలీలోని 'యూనివర్శిటీ ఆఫ్ ఆర్ట్స్' వారు ఒక సర్టిఫికెట్టును ప్రదానం చేసారు వీరి సాహిత్య కృషికి గుర్తింపుగా 1985-86లో కలకత్తానందు జరిగిన అఖిల భారత ప్రాచ్య విద్వన్మహా సభలలో ద్రావిడ అధ్యయన విభాగమునకు అధ్యక్షత వహించినారు. 1987 సంవత్సరములో 'శతాంకుర' కవితా సంపుటిని వెలువరించారు. ఈ కవితాసంపుటిలో సరస్వతిని శతవిధాలుగా వర్ణించారు. మానవుడు తాత్త్వికంగా పొందే అనుభవాలను, తాత్త్విక చింతనలను అను సంధించి వచ్చిన రచన ఇది.

1987 సం॥లో కాకతీయ విశ్వవిద్యాలయం ప్రచురించిన దూపాటి వెంకటరమణాచార్యుల జీవిత చరిత్రంనకు సంపాదకులలో వీరు కూడా సంపాద కత్వ బాధ్యతను తీసుకున్నారు.

శ్రీలక్ష్మి నృసింహోదాహరణము. దేవీపూజా, అగ్నిసూక్తములు కలిపి 1988 డిసెంబర్‌లో 'స్తుతి ప్రబంధము' అను పుస్తకమును అచ్చువేసినారు. ఆంధ్రదేశములో గల నృసింహదేవాలయాలను ఆయా దేవుడిని వర్ణిస్తూ రాసినవి నృసింహోదాహరణములు ఇందులో విభక్తి ప్రత్యయములను వాడుకొని అందించినారు.

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం వారు ఉత్తమ అధ్యాపకులుగా సన్మానం చేసినారు 1976లో. కాకతీయ విశ్వవిద్యాలయం, విభాగం ప్రచురించిన 'విమర్శిని' వార్షిక పత్రికలకు అసోసియేట్ ఎడిటర్‌గా పనిచేసారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం వారు ప్రచురించిన 'మహాభారత సంశోధిత ముద్రణ'కు వీరు సంపాదకులు. సుప్రసన్న కేవలం కవిగాను, విమర్శకుడిగానే ఉండిపోకుండా పై విషయాలను మనం పరికించినప్పుడు ఉత్తమ కార్యకర్తగాను కూడా గోచరిస్తారు. ఆయన ఆధ్వర్యంలో వచ్చిన సాహితీ సంస్థలు, వాటిలో పాల్గొనడం మొదలగు వాటిని నిశితంగా పరిశీలించినప్పుడు 70వ దశకములో విశ్వసాహితి, హైదరాబాద్‌వారు నిర్వహించిద అఖిలభారత రచయితల మహాసభల్లో కూడా పాల్గొన్నారు. ఉదయరాజు శేషగిరిరావుగారి కేశవనాథ శతకం, గార్లపాటి రాఘవరెడ్డి రచనలు, చిలుకపల్లి మధురవేదన, నాయని సుబ్బారావు వేదనావాసుదేవము, విశ్వనాధ వారి కేదారగౌళ, (ఖండకావ్యము), మనోరమ పద్య సంపుటి మొదలగు పుస్తకాలు వెలుగు చూడడంలోని వీరి ప్రధాన పాత్రను గుర్తు చేసుకోక పోవడం తప్పే అవుతుంది ఎవరేమనుకున్నా.

వీరికి ఆధ్యాత్మిక గ్రంధాలయం, వరంగల్లు, శ్రీ అరబిందో సొసైటీ వరంగల్లులతో సాన్నిహిత్యం ఉండడమే కాకుండా వాటి ఆవిర్భావానికి వీరి పాత్ర ఎంతగానో ఉంది. శ్రీ సుప్రసన్నగారి నేతృత్వంలో సుమారు 10 పి.హెచ్.డీలు, 10 యం.ఫిల్‌లు వచ్చాయి. వారి వద్ద పరిశోధించే విద్యార్థులకు సాహిత్యాభినివేశం కలుగుతుంది. రాజకీయ, సామాజిక సాంస్కృతిక రంగాలలో ఆయనకున్నటువంటి అత్యంతాధునాతన భావాలు భారతీయతా భూమికకు ఏ విధంగా అన్వయించుకోవాలో పరిశోధక విద్యార్థులకు అర్థమవుతుంది.

ఆయన విద్యార్థులను ఎవరిని కదిలించినా ఆయన దగ్గర పరిశోధక విద్యార్థులకు అపరిమితమైన స్వేచ్ఛనిచ్చి వారి నుండి క్రొత్త విషయాలు రాబట్టుకోవడానికి కృషి చేస్తారు. పరిశోధక విద్యార్థులతోపాటుగా ఆయనా శ్రమించి క్రొత్త మూల్యాలను, విషయాలను, మార్గాలకు చెప్పడానికి, వ్యాఖ్యానించడానికి ప్రయత్నిస్తారు. ఈ కారణంచేత వీరి విమర్శ వ్యాసాలలో (సిద్ధాంత గ్రంథాలలో) భారతీయ సాహిత్యంపై ఒక క్రొత్త వెలుగును ప్రసరింప చేయడంనకు తమ వంతు కర్తవ్యంను నిర్వహించారు. అనవచ్చు నూతన సాహిత్య విమర్శక ప్రమాణాలను వీరు ఏర్పరచారు. అంతేకాదు ఈ వ్యాస రచయిత "వరంగల్లు జిల్లా రచయితల వాఙ్మయ జీవిత సూచిక" వెలువడమునకు వీరే ప్రధాన కారకులు.

సుప్రసన్నగారి గ్రంథములను పరికించినప్పుడు మనం ఒక విషయాన్ని స్పష్టంగా గమనించి వచ్చును. నవ్యసంప్రదాయంను గురించి మొట్టమొదటగా సాహిత్య విమర్శలో చెప్పిన వారు వీరే. ఈ విషయంలో ఆయన నిర్దిష్టమైన సూత్రాలను, సిద్ధాంతాలను స్పష్టం చేస్తూ వచ్చారు అనేక సందర్భాలలో సాహిత్య విమర్శ మార్గంలో ఆయన సమకాలీన విమర్శకులలో క్రొంగొత్త మార్గాన్ని త్రొక్కే ప్రయత్నం చేస్తున్న వారిలో వీరు అగ్రగణ్యులు.

శ్రీ సుప్రసన్నగారి సాహిత్యమునకు భూమిక భారతీయ దర్శనం. భారతీయమైన మూల్యాలు భూమికగా ఆయన సాహిత్యంను అధ్యయనం చేయవలసిన అవసరం ఎంతైనా ఉంది. వివేకానందులు, విశ్వనాథ, శ్రీ అరవిందులు శ్రీమాత, జిడ్డు కృష్ణమూర్తి, రమణ మహర్షిల యొక్క రచనల ప్రభావం ఆయన జీవిత సాహిత్యాలపై అపారమైన ప్రభావం చూపెట్టినట్టుగా గమనించవచ్చును ఆయన రచనల్లో—

వచన కవిత్వంలోనూ, పద్యగేయ కవిత్వంలోనూ ఖండ కావ్య సంపుటాలను ముమ్మరంగా వెలువరిస్తున్న కాలంలో ఖండకావ్య సంపుటాలలో సైతం అంతస్సూత్రంగాకానీ, ఏక వాక్యతాగుణంగా కానీ భావాత్మక సంవేదనాన్ని ప్రకటించి కావ్యత్వ స్ఫూర్తిని కలిగించటంతోపాటు, ఆధ్యాత్మిక తాత్త్వికకావ్యాలను ఆధునిక దృక్పథంతో రచించే మార్గంతో, తమ కవితా మార్గంలో ఆధునిక కావ్య స్పృహకు ఒక నిండు తనాన్ని ప్రయోగ ప్రౌఢినీ కల్పించిన కవి సుప్రసన్న గారు.

ఆధునిక కావ్యంలో మానవుని ఆధ్యాత్మిక, సామాజిక ప్రవృత్తులకు సంబంధించిన ఆత్మ సంవేదన చైతన్యం వస్తువుగా జాలు వారుతున్నది. ఆధునిక కావ్యంలోని వస్తు స్వభావాన్ని బట్టి ముఖ్యంగా మూడు విధాలుగా ఆ ప్రక్రియను విభజించ వచ్చును.

1) ఆధునిక ఆధ్యాత్మిక కావ్యం
2) ఆధునిక తాత్విక కావ్యం
3) ఆధునిక సామాజిక కావ్యం

ఆధ్యాత్మిక సంవేదన అంతస్సూత్రంగా అభివ్యక్తమైన ఏక వాక్యత కాని, భావ సమైక్యతకాని, కథా సూత్రతగాని స్పష్టంగా గోచరించేది ఆధ్యాత్మిక కావ్యం. ఈ ప్రక్రియకుదాహరణగా సుప్రసన్న గారి శతాంకుర, పాండిచ్చేరి పన్నెండు గీతాలను చెప్పుకోవచ్చును.

సమన్వయ దృష్టితో సంకలనం చేసే కవితా సంపుటాలు ప్రక్రియ సంకలన ప్రవృత్తి కలిగి ఉంటాయి. విభిన్న అంశాల పై అప్పుడప్పుడు వ్రాసిన ఖండకావ్యాలను కలిపి ఒక సంకలనంగా ప్రచురించే పద్ధతిలో కావ్యాత్వ స్పృహ ఉండడానికి వీలుండదు. కాని వస్తువుచేతగానీ, ఒక దృక్పథంచేతగానీ, ఒక క్రమంలో నిబంధింపబడిన ఖండకావ్య సంకలనాన్ని కావ్య సూత్రచ్ఛాయగల ప్రక్రియగా సంభావించవచ్చును ఈ మార్గంలో వచ్చినవే అధునాఋతంభరలు.





# నేతాజీ గురుకుల విద్యాలయము

ఖానాపురం-506 132 జి॥ వరంగల్

ఫోన్ : 198

గత పది సంవత్సరాలుగా S.S.C. లో 100% ఫలితాలు సాధిస్తున్న గురుకులం. చక్కని పల్లె వాతావరణంలో అనుభవజ్ఞులైన అధ్యాపకులచే ఆధునిక పద్ధతిననుసరించి విద్యాబోధన నిరంతరం అధ్యాపకుల పర్యవేక్షణ రుచికరమైన పుష్టికరమైన ఆహారం.

5, 6, 7, 8 తరగతుల్లో ప్రవేశము ఉంటుంది, ప్రతి సంవత్సరం జూన్ 2వ తేదీ ప్రవేశ పరీక్ష ఉంటుంది.

: వివరాలకు సంప్రదించండి :

- కరస్పాండెంట్

EKASHILA VYTHALIKULU (Essays)

Edited by: T. Sri Ranga Swamy





A Publication of
Sri Lekha Sahithi
Regd. 2337/89
H. No. 5-11-481
Vidyaranyapuri,
Warangal-506 009

May 1991 Rs. 30/-